Manjuvani Series

# Delepa Charitra

BY

VENKATA KRISTNA KAVI.

*Author of Meghaduta, Swatachalamahatym, Vignaneswareyam, & Kurmamahatym, &c. &c.*

EDITED BY

**ja M. Bhujanga Rau,**

**BAHADUR, ZAMINDAR.**

**ELLORE.**

*Re-printed from the Manjuvani.*

THE MANJUVANI PRESS.

1902.

 *Price 12 A*

Printed by N. Chalapati Rau.

# దిలీపచరిత్రము




ఇది

కొటికలపూడి వేంకటకృష్ణకవిచే

రచియింపఁబడి

మంజువాణినుండిపునర్ముద్రితమయ్యెను.

ఏలూరు

మంజువాణీముద్రాక్షరశాల.

మొదటికూర్పు 500 ప్రతులు.

1902

 [Price 8 Annas

# పీ ఠి క.

## దిలీపచరిత్ర కవిచరిత్రాదిప్రశంస.

---

ఈసత్కవి విశాఖపట్టణ మండలమునందలి బొబ్బిలిదరి కొండాపురము అగ్రహారమున శాలివాహన శ॥ ౧౬౮౬ అతీతమగు తారణ సంవత్సర శ్రావణబహుళ ౫లు నాఁడు (అనఁగా నేటికి ౧౩౮ సంవత్సరముల క్రిందట) జన్మించెను. వీరు వెలనాటి వైదికబ్రాహ్మణులు హరితసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. యజుశ్శాఖీయులు. తండ్రి వేంకటరామశాస్త్రి. తల్లి వెంకమాంబ. ఈకవియును, వీరిపూర్వికులును. వీరి తదనంతరపురుషులును, నేటికిని శ్రీబొబ్బిలి సంస్థానాస్థాన పండితులుగ నుండుటయగాక తత్సంస్థాన ప్రభువర్యుల పురోహితులుగఁ గూడనున్నారు.

ఇక్కవిశిఖామణింగూర్చి యప్పటి విద్వత్ప్రభువగు శ్రీ రాయడప్ప రంగారాయప్రభువీ క్రిందరీతిగాఁ దమ సంకల్ప సూర్యోదయమునందు స్తుతించిరి.

సీ. బహుసంస్కృతాంధ్రప్ర-బంధనిర్మాణవి,
చక్షణుండతిశుభ-లక్షణుండు।
సద్గ్రంథత్రయాన్విత-జ్యౌతిషజ్ఞానవి,
భ్రాజితుండవనీశ-పూజితుండు।
సత్యయుతాఖిల-జనసన్నుతప్రియ,
భాషణుండుదయావి-భూషణుండు।
కోటికెలపూడిస-త్కులపయోరాశిసు,
ధాకరుండుచితగు-ణాకరుండు।
గీ. మైథిలీవల్లభాంఘ్రితా-మరసబంభ।
రాయమానసమగ్నాంత-రంగుఁడగుచు।

నలరు వేంకటకృష్ణాహి-తాగ్నిమత్పు।
రోహితునిసన్నుతింతుని-రూఢమతిని॥

ఇందుంబట్టి యిక్కవి బహుసంస్కృతాంధ్ర ప్రబంధరచనా ధురంధరుఁడనియు, జ్యోతిషమునం దసమాన ప్రజ్ఞఁ గలవాఁడనియు, శ్రీరామోపాసకుఁడనియుఁ, బురోహితుఁడనియు, జెప్పఁబడియున్నది. మఱియు, వీరిప్రపౌత్రపౌత్రులేమి, ప్రపౌత్రిపుత్రులేమి నేటికిని జ్యోతిషమునం దసాధారణ పాండిత్యము కలవారైయున్నారు.

ఈకవి, అప్పటిసంస్థానాధిపతులగు శ్రీవేంకట రంగారావు బహద్దర్ వారివలన శా॥స॥ ౧౭౨౨ గతమగు రౌద్రి సం॥ ఆషాఢ శు॥ ౧౦ బుధవాసరమున "రామునివలస" యనునొక గ్రామమును, సంకల్పసూర్యోదయ గ్రంథకర్తలును ప్రభువులునగు శ్రీరాయడప్ప రంగారావు బహద్దరు వారివలన శా॥స॥ ౧౭౪౮ వ వ్యయవత్సరభాద్రపద శుద్ధ ౧౨ బుధవాసరమున "సుభద్ర" యను మరియొక గ్రామమును బహుమాన రూపకముగఁ గైకొనెను.

మఱియు, శా॥శ ౧౭౩౨ వ ప్రమోదూత వత్సరమున అగ్నిష్టోమమాచరించి సోమయాజిపదమునం దెను.

'ఇట్లుకీర్తికాముఁడై ప్రకాశించిన వేంకటకృష్ణ సోమయాజికి పుత్రులు ఏడుగురు. పుత్రికలిద్దరు. అందుఁ జతుర్థతనయుఁడగు కోదండరామకవి సంస్కృతాంధ్ర కవిత్వమునం బ్రథమగణ్యుఁడై యనేక గ్రంథరాజముల విరచించి మించె. వీరి చరిత్రమంతయు విపులముగ 'విశాఖపట్టణ మండల కవిచరిత్రము'' న వ్రాయఁబడి యుండుటచే నిట వివరింపఁబడదయ్యె.

పూర్వజన్మ సుకృతపరిపాకమునం జేసి వేంకటకృష్ణకవికి బాల్యమునం దె కవితాలతాంకురము హృదయక్షేత్రమునం జనించి వేదాధ్యయనా ద్యంతరాయాదులను వాడక, కావ్యపఠనాది దోహదంబు

చే దైనందిన ప్రవర్ధమానంబై కొనసాగి రాణించుటంబట్టి తానుపిన్ననాఁడు చదువుచువచ్చిన కావ్యత్రయమునకుఁ బోలికగాఁ బద్యములు వ్రాయుచువచ్చెను. వానిలో నిపుడు మేఘసందేశముమాత్రము లభించినది. తక్కిన రెండుగ్రంధములును నామమాత్రావశేషము లయ్యెనని తోఁచుచున్నది. మఱియు.

౧ శ్వేతాచలమాహాత్మ్యము
౨ విజ్ఞానేశ్వరములను తెనిగించెను.
3 ప్రబోధచంద్రోదయ నాటకమును శ్రీరాయడప్పరంగారాయ ప్రభువు సంకల్పసూర్యోదయమును తెనిగించిన పిమ్మట మూడాశ్వాసముల పద్యకావ్యముగా రచించెను.

ఈకవికిని [వీరివంశస్థులకందరికిని] శ్రీరామమూర్తి యిష్టదైవమగుటంజేసి యీతండు రచించిన గ్రంధములన్నియు నాస్వామికే సమర్పించి శాశ్వతపదవింబొంది యానందించుచున్నవాఁడు. కావున వేంకటకృష్ణసోమయాజి తన నిర్యాణకాలమగు శా॥ శ॥ ౧౭౨౦ గతమగు విళంబివత్సర పుష్య బ॥ ౫ల నాఁడు యీక్రిందరీతిగా భగవంతునకు విజ్ఞాపనమొనర్చుచు పరమపదించెను.

శ్లో॥ యాతాస్సప్తతివత్సరాస్సముచితా ధర్మార్థకామాః కృతాః।
విద్వాంసోనతిరస్కృతాస్సముదితా దేవర్షిపిత్రాదయః।
కింతైస్తావక మందహాసవిలసద్వక్త్రేందు సందర్శనా।
దన్యేచ్ఛాః క్రమశః కృశంతి కృపయా తే రామచంద్రప్రభో॥

శ్లో॥ ఆదావేవదశేంద్రియస్ఫుటశిరో దీవ్యన్మనో రాక్షసం।
హత్వామత్ప్రతిభావిదేహతనయా కళ్యాణయత్నంకురు।
ప్రత్యాసన్న సుఖంనలంఘ్యమితిమా చింతామహీజావిభో।
లస్మిన్దీర్ఘ వియోగదుఃఖజననా దేహావిలంబవ్యధా॥

ఎట్టి మహాపురుషులకేని ప్రాణోత్క్రమణ సమయమందిట్టి విజ్ఞాన సహితమగు జ్ఞాపకశక్తిజనించు టత్యాశ్చర్యమగుటంజేసి వీని నిట సకౌతూహలముగా లిఖించితిమి.

కవితాశైలిం దెలియుటకై వేంకటకృష్ణకవి విరచిత గ్రంథముల నుండి రెండేసిపద్యములిట వ్రాయఁబడియె.

౧ మేఘసందేశము. ప్ర॥

మ. మహితాసారనివాసివాటవిశిఖి-స్వార్గ్రశ్రమార్తున్ నినున్।
వహియించుందగలనామ్రకూటమువిభా-స్యచ్ఛానువౌ చుందమః।
పిహితుండైననుమిత్రునాదిసుకృతా-పేక్షుండలందాల్పఁగా।
మహినిన్నున్నతుఁడీనగోత్తముఁడుస-న్మానింపఁడే వేఁడుకన్॥

ద్వి॥

చ. కరమునమంజులాబ్జముల-కంబునఫుల్లనవీనమల్లికో।
తక్కరము, ముఖంబునందధవళ-తందగులోధ్రరజంబు, కొప్పునం।
గురువకముం, జెవిన్ దళుకుఁ-గుల్కుశిరీషము, పాపిటంభవ।
త్కరుణజనించునీప మొగిఁ-దాల్చి చెలంగుదురింతులప్పురిన్॥

౨ విజ్ఞానేశ్వరము. ప్ర॥

శా. తాంబూలంబొనరింపుచున్ జనపదా-ధ్యక్షోత్తమానీతవి।
త్తంబుల్ ద్రవ్యగృహంబులం బ్రబలయ-త్నంబొప్పఁగాదాఁచిరూ।
పంబుల్ మార్చఁగ నేర్చుగారతతితో-భాషించితత్తత్త్వకా।
రంబుల్ మంత్రులకేర్పడం దెలిపికా-ర్యస్ఫూర్తిఁ జింతింపుచున్॥

చ. తనుతనయప్పుదీర్చినవి-ధంబున పుత్త్రుఁడునున్నతండ్రిచే।
సినఋణముల్ సమృద్ధిగన-శేషముదీర్పవలెం ; దదీయవం।
దనునకుఁదీర్పఁగావలసి-నన్మొదలిచ్చిఁజాలు యుత్తమ।
ర్ణనకథమార్గపాత్రుఁడని రుద్ధుఁడువృద్ధికిమాత్రమెయ్యెడన్॥ ౨॥

3 ప్రబోధచంద్రోదయము.

శా. గ్రీవానల్పనినాదముల్చెలఁగత-త్కీర్తిప్రభావోన్నతుల్।
గ్రామాంచత్కరికుంభకూటకుహరా-క్రాంతాదిదేశంబులన్।
శీవింబాడుదురుగ్రరాక్షసవధూ-టీహస్తసంస్ఫాలనన్।
యావల్గన్నృకపాలతాళరవనృత్యచ్ఛాకినీఢాకినుల్॥ ౧॥

ఉ. కేవలవిష్ణుభక్తియె య-కల్మషవృత్తిఁ జెలంగిమోక్షవి|
ద్యావిభవంబొసంగుసఖుఁ-డైనమనోజునిఁబాసిధర్ముఁడా|
దేవినిగొల్వనేగనఁట ? - తీర్పరియై విమలాంగిశ్రద్ధత|
త్సేవయొనర్చుచుండునఁట ? - చిత్రగతుల్ వినవయ్యె నేటికిన్ ||

## శ్వేతాచలమహాత్మ్యము.

శా. ఆమాటల్విని భూవిభుండు నిజభా-ర్యన్ సద్వ్రతాసక్తికిన్|
శ్రీమన్మాధవభక్తికిన్ బొగడి ధా-త్రిన్ మూఢచిత్తుండనై|
భామారత్నము పాటిబుద్ధిగణుతిం-పంబూనఁగాలేకయా|
సోమార్కాంబపకీర్తిపాలయితినం-చున్ లోనఁజింతిల్లుచున్ ||
ఉ. వేరొకభూవరాత్మజుఁడు-విద్రుమగుచ్ఛమురత్నకంకణో|
దారకరారవిందమునఁ-దాల్చెలతాంగినన్వరించినన్|
భూరిశుభక్రమాకలన-బోఁటిపదాంబుజమీతెఱంగునన్|
గూరిమితోడఁబట్టుకొనఁ-గోరెదనంచును దెల్పుకైవడిన్ ||
శా. జంబాలుండనువానికొన్ని దినముల్-జాయాన్వితుండైతదు|
ర్వ్యంబుణ్యస్థితినుండిగర్భవతినా-రింబాసిస్వర్గంబుచే|
రంబోవంగశమీసమీపమునగ-ర్భస్థార్భకుంబెట్టెనె|
య్యంబొప్పారఁగఁజేసెఁదత్తరుణిదా-నగ్నిప్రవేశంబొగిన్ ||

కృతిపతి యగు రాయణప్పరంగరాజు తనను గూర్చి పల్కినట్టి క్రింది పద్యము లుదాహృతములై యున్నవి.

చ. హితులు మదన్వవాయజుల-కెల్లఁ బురోహితు లార్యలోకపా|
లిత కవితాప్రకల్పిత ది-లీపచరిత్రముఖోజ్జ్వలత్ప్రబం|
ధతతులు హారికాగ్రణు లు-దారగుణాన్వితచిత్తులస్మదా
శ్రితులు సమస్తసూరినుత-శేముషు లెన్నఁదరంబె మిమ్ములన్.
సీ. ధీరత మేఘసం-దేశంబు తెనిఁగించి,
ప్రీతి దిలీపచ-రిత్ర మనెడు|

గొప్ప ప్రబంధంబుఁ-జెప్పి శ్రీరాముల, కర్పించితివి మున్ను-నేర్పు మీఱ।
గార్తాంతికులు మెచ్చఁ-గా శ్రీపతిగ్రంథ, గతిని మామకజాతకము లిఖించి।
మా కొసంగితి విప్వ-డేకాగ్రచిత్తత, నంచితంబుగఁ దెనిఁ-గించుచున్న।

గీ. కూర్మమాహాత్మ్య మొసఁగుము-కూర్మిమాకు।
రమ్యచారిత్ర వేంకట-రామపుత్త్రి।
కీర్తిదౌదార్య వేంకట-కృష్ణమార్య।
యనుచు బహుమతిచేయ నా-హ్లాదమునను॥

ఈ సత్కవి కవిత్వము ద్రాక్షాపాక విలసితమై, అలంకారపటిమ గలిగి, పండితప్రకర్ష వెల్లడించుచు మిక్కిలినొప్పియున్నది.

ఈగ్రంథకర్త రచియించిన గ్రంథములన్నింటిలోను దిలీపచరిత్ర మిక్కిలి ప్రౌఢముగానున్నది.

వర్ణనాంశములనేమి, కథాసందర్భము నేమి, శయ్యాదుల నేమి యెక్కువ ప్రజ్ఞతో చక్కఁగా నిర్వహించెను.

సంస్కృతమందసమానప్రజ్ఞ కలదనుటకును, కల్పనాసామర్థ్యంబు వ్యక్తీకరించుటకును యీగ్రంథము మిక్కిలి దక్షమై యొప్పుచున్నది.

ఇందలి దిలీపుని కథ ప్రాచీనమేయైనను అక్కడక్కడ కొన్ని మార్పులు యథోచితముగా చేయఁబడినవి

ఈదిలీపచరిత్ర గ్రంథము మాత్రకనొసంగుటయగాక అనేక విధముల మాపత్త్రికాభివృద్ధిఁ గోరు మహారాజశ్రీ నిడదవోలు సుందరం పంతులుగారికి మా మనఃపూర్వక వందనము లాచరించుచున్నారము.

ఇట్లు,

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు

జమీదారు.






శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

# దిలీపచరిత్రము.

(ప్రథమాశ్వాసము.)




సీతాతటిదుజ్జ్వలుండఖిలధా-త్రీభృచ్ఛిరోభూషణుం । బాసన్నాహితరాజహంసభయదుం-డక్షీణశోభాన్వితే। ష్వాసుండాప్తమయూరసేవ్యుఁడనుకం-పాసారసంపూర్ణుఁడౌ । కౌసల్యాసుతుఁ డన్ఘనుండు రసయు-క్తన్ మత్కృతిం జేయుతన్ ॥

సీ. బంధురాలంకార-పటిమభాసిల్లంగ,
విశ్వసన్నుతమైన-వృత్తి వెలయ।
శుభలక్షణంబుల-విభవంబు రాజిల్లఁ,
జెన్నైనరీతులు-వన్నెకెక్క।
మృదుపదన్యాససం-పదసొంపు వాటింప,
యతివిచిత్రాకార-మతిశయిల్ల।
మహితసల్లాపచ-మత్క్రియల్ దనరారఁ,
శృంగారరసపుష్టి-రంగుమీఱఁ।

గీ. బలుకు పలుకున కమృతంబు-లొలుక రాఘ।
వాఖ్య నారాయణునితోడ-ననుదినంబుఁ।
గ్రీడఁ గావించు లక్ష్మి మ-త్కృతికిఁ దనదు।
సరస సారూప్య పదవియొ-సంగుఁగాత॥ ౨॥

మ. శ్రుతులు న్నాలుగు నాల్గు నెమ్మొగముల-న్శోభిల్లఁగా భారతీ।
సతియుం బట్టపు రాణియై చెలఁగఁగా-సర్వప్రపంచంబు స।
మ్మతితోడన్ సృజియించు నల్వ కృతిని-ర్మాణంబు సేయంగ హృ।
చ్ఛతపత్రంబునఁ గోరు నాకుఁ గృపతో-సాహాయ్యముం జేయుతన్

మ. క్షితిలో నేసతికింగుచంబులయి సం-గీతంబు సాహిత్యము।
న్నతివిఖ్యాతి వహించె నాస్యముల నే-నారీమణిం దాల్చి తాఁ।
జతురాస్యుండు కృతార్థుఁడైతన రెభా-స్వత్కీర్తియా భారతీ।
సతి నా నాలుకనుండుఁగాత మృదువా-క్చాతుర్య సంధాత్రియై॥ ౪॥

మ. తలపైనుండు మృగాంకునింగనఁగ మ-ద్వక్షోజముల్ బట్టెదా।
భళి యంచుం దన కేలు గౌరి ప్రియ మొ-ప్పం బట్టి కాకోదరో।
జ్జ్వలఫూత్కార భయంబున న్విడువఁగా-సంప్రీతితో నవ్వుకుం।
డలిరాట్కంకణుఁ డిందుశేఖరుఁడు వే-డ్కం దామముం బ్రోవుతన్

చ. నలినభవాంగనాది సుర-నాయుల నారతము న్భజింపఁగా।
సలలిత శంకరార్ధతను-సౌధమున న్విహరించు సర్వమం।
గళ గిరిరాజపుత్త్రి త్రిజ-గజ్జనయిత్రి శుభాంగి సర్వమం।
గళములు వేడ్కతో నొసఁగుఁ-గాత మదుజ్జ్వల కావ్యకన్యకున్॥ ౬

ఉ. శైలము జన్మభూమి ప్రప-శంకర మౌళి కలాపపేటి పా।
తాళము సాహిణంబు పసు-ధాబిల మంబుధిమాతులాలయం।
బాలు విరక్తిరచ్ఛనిగ-మాంతము గాఁ దనరారునట్టి శుం।
డాలముఖుండు విఘ్నముల-దుంచి కృపం గనుఁగాత మత్కృతిన్॥ ౭

మ. లవణాంభోనిధిదాటి దానవఘనో-ల్లాసంబుమాయించి వై।
శ్రవణోద్యానముమాపి లంకదహన-జ్వాలాళికర్పించిభూ।
భువనోత్కృష్టమహాబలాఢ్యుఁడనిస-ద్బుద్ధులగణింపన్ఘనో।
జవసత్వంబులనొప్పునప్పవనజు-న్సంప్రీతితోఁగొల్చెదన్॥ ౮॥

శా. గాయత్రీఘనవర్ణయుగ్దశశత-గ్రంథాదిపద్యంబులై।
తేయారాత్యవతారసల్లలితమా-దిత్యాన్వయాఖ్యానధా।
రేయంబైతనరారుకావ్యముబుధ-శ్రేణుల్వినోదింపఁబ్రి।
జ్ఞాయత్తంబుగఁజేయుపూర్వకవికి-న్సంప్రీతితో మ్రొక్కెదన్॥

సీ. అఖిలాగమార్థవి-న్యాసు వేదవ్యాసు,
ఘనకల్పనోల్లాసుఁ-గాళిదాసుఁ।
బ్రిబలపాండిత్యశో-భారవిభారవి,
సరసకవిత్వవి-చారుఁజోరు।
భారతీకారుణ్య-భవభూతిభవభూతి,
సకలవిద్వజ్జన-శ్లాఘుమాఘుఁ।
గాకవీశ్వరభుజం-గమమయూరుమయూరు,
మృదుపదరచనాధు-రీణుబాణు।

గీ. రసికజనగేయుఁబండిత-రాయుఁగావ్య।
బహులఘటనాసముత్కృష్ట-భట్టహర్షు।
భూరివిద్యాప్రచండుల-భోజరాజు।
మల్హణమురారిదండుల-మదిఁదలంతు॥ ౧౦॥

సీ. చతురాస్యవాగను-శాసనుసమధిక,
పండితత్వాహీనుఁ-గుండలీంద్రు।
మృదుపదాచ్ఛాదిత-త్రిభువనుశ్రీనాథు,
ధరణిసర్వజ్ఞతఁ-బరగుభీము।

సన్మార్గఘటనావి-చక్షణభాస్కరు,
    నమితకళావంతుఁ-డైనసోము।
ధర్మిధర్మజ్ఞతఁ-దగురామభద్రుని,
    విశ్వవిఖ్యాతుఁడౌ-వీరభద్రు।

గీ. నభినుతించెదమత్కావ్య-మనెడుకన్య।
కాయురారోగ్యమాత్సౌక్య-మతిశయంబు।
మహిమచల్లదనంబుదాం-పత్యసుఖము।
శత్రువిజయంబుఁబ్రేమనొ-సంగుఁగాక॥ ౧౧॥

సీ. హరితగోత్రపవిత్రుఁ-డగుకృష్ణపండితుం,
    డేమహామహునిపి-తామహుండు।
సకలవేదాంతవి-శారదుండగువల్ల,
    భార్యుఁడేధైర్యజి-తాద్రితండ్రి।
పరమపాతివ్రత్య-నిరతయాలింగమ్మ,
    వినుతింపనేవేద-విదునితల్లి।
వనధిజాధరణుల-కెనయగుజగ్గమ్మ,
    చిన్నమ్మలేగుణాం-చితునిసతులు।

గీ. ధారుణీమండలాధిపా-స్థానములను।
సన్నుతివహించెశివరామ-శాస్త్రియనఁగ।
నేతపోధికుఁడతనిసా-హిత్యభోజు।
మతిపితామహుమత్పితా-మహుఁడలంతు॥ ౧౨॥

చ. హరితసగోత్రుసూరినుతు-నాగమవేదితపోధికున్మహే।
శ్వరచరణాంబుజద్వయని-షక్తమధువ్రతచిత్తుధారుణీ।
సురుశివరామశాస్త్రిఁబరి-శుద్ధచరిత్రుఁబవిత్రుధైర్యమం।
దరధరుమత్పితామహుఁబి-తామహసన్నిభుసంస్మరించెదన్॥ ౧౩॥

చ. కొటికలపూడివంశమణి-కోవిదు వేంకటరామువిస్ఫుర
త్పటుతరసాహితీసహితుఁ-బార్థివపూజితుజ్యౌతిషేజ్యునిన్
ఘటితమహాప్రబంధుమురఘు-స్మరసంస్మరణానురక్తువి
స్ఫుటవిభ వేంద్రుమజ్జనకు-భూరిగుణాఢ్యునిఁగొల్తు వేఁడుకన్॥

క. ఘనపాతివ్రత్య జితాం
బునిధికుమారీపులోమ-పుత్రీగిరిరా
ట్తనయా సావిత్రిన్న
జ్జనయిత్రి న్వేంకమాంబ-సన్నుతిఁ జేతున్॥ ౧౫॥

సీ. భాగీరథీపయః-పరిశుద్ధదేహుండు,
సప్తసంతానసం-స్థాపకుండు
కన్యాప్రదానవి-ఖ్యాతచారిత్రుండు,
నిరతాన్నదానవ-ర్ణితగృహుండు
హరిహరనామసం-స్మరణప్రగల్భుండు,
బాంధవముఖపద్మ-భాస్కరుండు
సూరిజనస్తుతా-చారధురీణుండు,
దేవరాతసగోత్ర-దీపకుండు

గీ. మంగిపూడికులాబ్ధిందు-మండలంబు
నరసమాంబాకళత్రుఁడ-ర్ణవగభీరుఁ
డనుచుజను లెన్నఁదనరు పే-రనసమాఖ్యు
ఘనునిమామకమాతామ-హునిఁదలంతు॥ ౧౬॥

సీ. కొన్నికల్పనలొక-కొలఁదియౌన నెడువా,
రాంధ్రభాషావృతం-బనెడువారు
స్వారస్య మెఱుఁగక-సంశయించెడివారు,
విశ్రమస్థానముల్ - వెదకువారు
చెలఁగిదుశ్శంకలు- సేయఁజూచెడువారు,
పూర్వకావ్యంబులఁ-బొగడువారు

ప్రాచీనరచనని-ర్ణయమిదియనెడువా।
రర్థగుంభనచాల-దనెడువారు।

గీ. గారెకాకవిపుంగవుల్-గానవార।
లున్నసభలోనసత్కవి-యొక్కఁడున్నఁ।
జెడుమహత్త్వంబుబకముల-నడుమనున్న।
రాజహంసంబునకునుగౌ-రవముగలదె॥ ౧౭॥

క. సుకవికవితాచమత్కృతి।
కుకవులమదికింపుగాదు-కుంభినిలోనన్।
సకలజనసమ్మతంబగు।
పికనాదముకాకములకుఁ-బ్రీతియెతలఁపన్॥ ౧౮॥

వ. అనియిష్టదేవతావందనంబును సుకవిగురుజనాభినందనంబును గు
కవినిందనంబునుగావించి యొక్కప్రబంధంబు రచియింపం బూ
నియున్న సమయంబున. ౧౯.

సీ. సీతామనఃపయో-జాతప్రభాతప్ర,
భాకరుండరిలోక-భీకరుండు।
ధృతహారరత్నకి-రీటకేయూరాది,
భూషణుండుచితసం-భాషణుండు।
శ్యామాభ్రనిభదేహ-చంచలాయితకాంచ,
నాంబరుండురుగుణా-డంబరుండు।
కరుణాకటాక్షవీ-క్షణరక్షితాఖిల,
సేవకుండఘదారు-పావకుండు।

గీ. మందహాసామృతాంచిత-సుందరాస్య।
మండలుండునతాబ్జజా-ఖండలుండు।
కన్నుఁగవసఫలతఁజెందఁ-గరుణనాదు।
స్వప్నముననొక్క-నాఁడుసా-క్షాత్కరించె॥ ౨౦॥

వ. ఇట్లు సాక్షాత్కరించిన. ౨౧॥

ఉ. పెన్నిధిఁ జేరువంగనిన-వేదవిధంబునసద్గుణాఢ్యునా।
పన్నశరణ్యురాఘవుగృ-హాజలధిం జనకాత్మజాధిపుం।
గన్నులఁగాంచిలేచికర-కంజములెత్తినమస్కరించినన్।
నన్ననుకంపఁగన్గొనిఘ-నధ్వనినిట్లనిపల్కెవేడుకన్॥ ౨౨॥

మ. అమలస్వాంతుఁడుమాసమేతుఁడుశతాం-గాగీకృతాంగీకృతా।
ర్యమనీహారకరుండుభక్తసులభుం-డశ్వీకృతస్వీకృతా।
గముఁడీశానుఁడనంగభాసిలుశివా-ఖ్యబ్రహ్మకర్పించెశీ।
లముయుష్మత్ప్రపితామహుం డెలమివ-ల్గంభట్లువిజ్ఞానియై॥ ౨౩॥

శా. విఖ్యాతుండుభవత్పితామహుఁడుని-ర్విఘ్నంబుగాఁదారకో।
పాఖ్యానంబుమదీయచర్యనయమొ-ప్పన్ద్వాదశీసద్వ్రత।
వ్యాఖ్యానంబొనరించిశంకరునకు-ద్యల్లీలనర్పించితా।
ముఖ్యుండైపరగెంగవిప్రతతిస-మ్మోదంబుతో నెన్నఁగన్॥ ౨౪॥

క. అగణితమతిమీజనకుం।
డగువేంకటరాముఁడద్భు-తాభిజ్ఞుండై।
జగతిన్సుకవులలోపలఁ।
దగఁదారలలోఁదుషార-ధామునిరీతిన్॥ ౨౫॥

క. మృదుపదరచనాచాతురి।
విదితార్థసమృద్ధిగలక-విత్వమునీయం।
దుదయించెనువచనామృత।
విదళితకవిసంశయోష్ణ-వేంకటకృష్ణ॥ ౨౬॥

చ. జపములనన్నదానముల-సత్క్రతులంగురుదేవపూజలన్।
విపులశుచిత్వసంపదల-వేదరహస్యములన్నవంబులం।
దపములనన్నుశంకరునిఁ-దావకపూర్వులుసంతసించఁగా।
నిపుణతఁజేసినిల్పిరవ-నిన్నిజకీర్తిసుధాంశురోచులన్॥ ౨౭॥

శా. పూర్వాచారముఁ దప్పనీక సుగుణాం-భోరాశివై నీవుమ|
త్పూర్వుం డైనదిలీపువర్తనము వి-స్ఫూర్తిం బ్రకాశింపఁగా|
నుర్విం గావ్యముఁ జేసి మాకొసఁగు వి-ధ్యుక్తంబు గాఁ దత్కృతిన్|
సర్వాభీష్టఫలప్రదంబగు మదా-జ్ఞన్ మీఱ రాదేరికిన్॥ ౨౮॥

క. కృతి మాకు నొసఁగి నీవుసు|
కృతివై శాశ్వతము గాఁగ-గీర్తిజ్యోత్స్నల్|
క్షితి నిలుపుము నితటూలున|
నతడంతర్ధానమయ్యె-నాశ్చర్యముగన్॥ ౨౯॥

గీ. మేలు మేల్కాంచితినటంచు-మేలుకాంచి|
కలదె మహినింతకంటె భా-గ్యంబు కృతిప|
తిత్వమా రామభద్రుఁడ-ర్థించివచ్చె|
ననుచుఁ బ్రముదితహృదయుఁడ-నైతి నెలమి॥ ౩౦॥

సీ. ఏదేవుపదపద్మ-మెలమి గౌతమముని,
పతిని గ్రమ్మర నుస-భార్యఁ జేసె|
నేదేవువాత్సల్య-మినతనూభవునకె,
ప్పటిరీతి కపిరాజ్య-పటిమ నొసఁగె|
నేదేవుసంపూర్ణ-కృపవిభీషణునకు,
మగుడ లంకాస్థితిఁ-దగ నొసంగెఁ|
నేదేవుభుజశక్తి-ఋభుసమూహమునకు,
మరలహావిర్భాగ-నిరతి నొసఁగెఁ|

గీ. ప్రజలకే దేవుభూపరి-పాలనంబు|
కృతయుగోత్కృష్టధర్మసం-తతుల నొసఁగె|
నట్టి శ్రీజానకీమనో-హరునకే ను|
గావ్యకన్యక సర్పించి-ఘనతఁ గాంతు॥ ౩౧॥

ఉ. ఆదికవుల్విశేషకృతు-లర్పణసేయఁజెలంగుమేటిలి।
శ్రీదయితుండుమత్కృతిఁ-జేకొనునాయనిసంశయింపఁగా।
రాదనురక్తిఁగజ్జమధు-రందనుజేరననూనవిభ్రమా।
చ్ఛాదితరూపసౌష్ఠవమొ-సంగికవుంగిటగారవింపఁడే॥ 3౨॥

సీ. ప్రీతితోరమ్మని-పిలిచినఁబోవఁడే,
మొదలవిశ్వామిత్ర-మునిమఖంబు।
దోర్బలంబునను దై-త్యులమించికావఁడే,
దండకాటవిలోని-తాపసులను।
భక్తినాతిథ్యమ-ర్పణసేయఁజూపఁడే,
శబరికినపవర్గ-సౌఖ్యసరణి।
శరణార్థియగువిభీ-షణునికొసంగఁడే,
కరుణతోలంకాధి-కారగరిమ।

గీ. శమనసదనంబునకుఁజేర-జనినభూమి।
సురకుమారునిబ్రతికించి-సురుచిరముగ।
నిలుపఁడేకీర్తిజగములు-నిండనహహ।
మైధిలీధవుసెన్నబ్ర-హ్మకునువశమె॥ 33॥

సీ. కలితవేదాంతవీ-థులకునెవ్వనిపరి,
పూర్ణప్రభావంబు-భూషణంబు।
పంకజసంభవ-ప్రముఖులకెవ్వని,
పదపద్మరజముసం-పత్ప్రదంబు।
సనకాదియోగుల-మనములకెవ్వని,
దివ్యస్వరూపము-దీపకంబు।
గిరిరాజపుత్రికిఁ-బరికింపనెవ్వని,
నామమంత్రంబుసం-తతముజప్య।

గీ. మసురసంపత్తికెవ్వని-యతిశితోగ్ర।
శరపరంపరపరలోక-సౌఖ్యజనక।

మట్టికోటీరకేయూర-హారకుండ।
లాదిభూషణభూషితు-నాశ్రయింతు॥ ౩౪॥

మ. శరధింగోలకుఁ దెచ్చెఁబాతిని సరో-జాతాననం జేసెద।
న్వరుగం జిమ్మెను దుందుభిప్రబలదే-హం బేక బాణంబునన్।
ధరపైఁ గూలిచెఁ దాళసప్తకము మం-దస్ఫూర్తితోఁ బత్త్రికం।
ధరునింగీటణఁగించె రాము విభుఁడే-తన్మాత్రుఁడే చూడఁగన్॥ ౩౫॥

సీ. తనభుజాపాటవం-బునకు ఫాలాక్షుని,
ఘనధనుర్దండ మిం-ధనము గాఁగ।
దనచరణాంగుష్ఠ-మునకు దుందుభిదుర్భ,
రకళేబరంబు కం-దుకము గాఁగ।
దనబాణసామర్థ్య-మునకుఁ బారావార,
మరసి చూడఁగ ముత్తి-యంబు గాఁగ।
దనప్రతాపానలం-బునకు దశానన,
ప్రముఖదైత్యులు శల-భములు గాఁగ।

గీ. దనకృపాలోకనమునకు-వనజసంభ।
వాదిదేవపురందరా-ద్యమరసముద।
యంబు పాత్రంబు గాఁగ నొ-ప్పారు సౌఖ్య।
దాయకుండు మహీసుతా-నాయకుండు॥ ౩౬॥

మ. తనవామంబున సీత వెన్కను సుమి-త్రానందనుండగ్రమం।
దున సామీరి కెలంకులన్ భరతశ-త్రుఘ్నుల్ ప్లవంగాధిరా।
డ్దనుజేంద్రాంగదజాంబవంతులు జగ-త్ప్రాణాధికోణంబులం।
దనరంగద్దియనొప్పు రాముఁ దలఁతున్-ధారాధరశ్యామునిన్॥ ౩౭॥

సీ. ఆదరింపఁడెశ్శర-ణాగతంబగు వాయ,
సంబును శరముప-సంహరించి।
విడిపింపఁడే కీర్తి-వెలయ బందీకృత,
సురసుందరుల దశా-స్యునివధించి।

బ్రతికింపఁ డేరణ-క్షితిఁబడ్డ కీశుల,
గురుతరామృతవృష్టిఁ-గురియఁ జేసి।
పాలింపఁ డేతన-ప్రతినలంకాపురీ,
సామ్రాజ్యమున విభీ-షణుని నిలిపి।

గీ. వెంటఁబట్టుకచనఁడె స-ద్వృత్తి నున్న।
మునిసమూహంబునకును జే-కొనఁగ రాని।
పరమపదవికి సాకేత-పురిజనముల।
దాశరథివంటి భక్తవ-త్సలుఁడు గలఁడె॥ ౩౮॥

సీ. అవతరించిన చక్రి-కనితోఁడు పడఁ జెంతఁ,
జేరిన చక్రావ-తారములనఁ।
గుండలీకృత సము-ద్దండ కాండాసన,
భీకరోద్యత్ప్రతి-బింబములన।
దానవుల్బడ గ్రుంగు-ధరయని మింటికి,
నిలనంటఁగట్టిన-వలయములనఁ।
బతదుగ్ర రాక్షస-భటదళితాంతరో,
ద్దామార్క-మండల-భూమికలనఁ।

గీ. దనరధర వ్రిచ్చి పాతాళ-మునకుఁ బోయి।
మరల వేఱొక త్రోవఁ బై-కరుగుదెంచి।
గగనగతి వచ్చిదోనను౦డు-కౌసలేయ।
శితశరావళులఘుములఁ-జెందుగాత॥ ౩౯॥

చ. మునిహృదయాంబుజాతములు-మోదమునొందని శాటకోటినె।
మ్మనమున భీతి గుండగరి-మన్ శ్రితచక్రము వేడ్కఁ జెంద భూ।
జనముల నేత్రముల్సఫల-సంపద నొందధరిత్రిలోపలం।
దనకులకర్త యౌరవివి-ధంబున భాసిలు రాముఁ గొల్చెదన్॥ ౪౦॥

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధనానాసుగు
ణావిత సత్కీర్తిచంద్రి-కామోదితరా
జీవభవప్రముఖామర
జీవంజీవునకు శేము-షీజీవునకున్. ॥ ౪౧॥

క. సీతాసమేతునకు ఖ
ద్యోతాన్వయజాతునకు స-ముజ్జ్వలశౌర్యో
పేతునకు నిశాచరసం
ఘాతసముద్ధర్తృసాయ-కవ్రాతునకున్. ॥ ౪౨॥

క. మాయాదైత్యభయంకర
సాయకపరివారునకును-సంసారాధ్వ
వ్యాయామశ్రాంతజన
చ్ఛాయాసహకారునకున-చలధీరునకున్. ॥ ౪౩॥

క. వీరునకు భానుకులవి
స్తారునకు ధనుఃకళాప్ర-చారునకు మహో
దారునక ఘదూరునకున్
మారాకారునకు భక్త-మందారునకున్. ॥ ౪౪॥

క. మౌనిమనోంబుజభీకర
దానవసైన్యాంధకార-దళనసమర్థా
నూనశరకిరణలక్ష్యస
మానాతీతప్రతాప-మార్తాండునకున్. ॥ ౪౫॥

క. ఖరదూషణాదిరాత్రిం
చరపీనోరఃప్రదేశ-సంస్థాపితభీ
కరవిశిఖజయస్తంభో
త్కరునకు రక్షితనిజాశ్రి-తప్రకరునకున్. ॥ ౪౬॥

క. చండాహికల్పబాహా।
దండునకుం గుండలీకృ-తప్రస్ఫుటకో।
దండవినిర్యన్మార్గణ।
ఖండితదశకంఠకంఠ-కరకాండునకున్॥ ౪౭॥

క. రామునకు నీలమేఘ।
శ్యామునకు దివాకరాన్వ-యాంభోధిసుధా।
ధామునకు సకలసుగుణ।
స్తోమునకుం బ్రణమితాజ-సుత్రామునకున్॥ ౪౮॥

క. శ్రీవైదేహీముఖరా।
జీవార్యమబింబునకు వ-శీకృతనానా।
దేవనికురుంబునకుఁ బా।
రావారమనోభయంక-రకలంబునకున్॥ ౪౯॥

క. శ్రీరామునకంకితముగ।
నేరచియించినదిలీప-నృపతిచరిత్రో।
దారప్రబంధమునకుం।
బ్రారంభించినకథాక్ర-మం బెట్టిదనన్॥ ౫౦॥

కథాప్రారంభము.

క. పూగసహకారచాంపే।
యాగరుజంబీరచంద-నార్జునమధుపు।
న్నాగతమాలామలకము।
ఖాగశరణ్యము నగు నైమి-శారణ్యమునన్॥ ౫౧॥

శా. సూతుం గన్గొని శౌనకాదిమునుల-స్తోకప్రభావుండుకం।
జాతాప్తాన్వయరత్నమాశ్రితసుర-క్ష్మాజంబు భాస్వద్గుణా।
వాప్తుండైన దిలీపభూపతిచరి-త్రంబింపుగాఁ దెల్పవా।
చ్చాతుర్యంబున మాకటన్న నతఁడు-త్సాహంబుతో నిట్లనెన్॥ ౫౨॥

సీ. గ్రహతారకానేక-ఘంటాపథీకృత,
ప్రాకారశాఖాంత-రస్థలంబు।
చతుర్భ్రవోంగనా-వక్షోజలిప్తస,
ద్గంధబంధురపరి-ఖాజలంబు।
మహనీయగగనతా-మరసమోహప్రద,
సౌధాగ్రనిహితకాం-చనఘటంబు।
ధారాధరప్రభా-స్థగితశాతక్రత,
వోపలప్రఘటిత-గోపురాగ్ర।

గీ. మలఘుతరకేతనాగ్రదీ-వ్యత్పటాగ్ర।
జనితవాతూలవారిత-స్వర్నదీత।
టాగ్రసంచరదమరీస-మగ్రమదన।
కదనఘుర్మంబయోధ్యాన-గరవరంబు॥ ౫౩॥

క. సుగుణాళిసమేతంబై।
జగతిన్భీమావహప్ర-శస్తంబై-మూ।
డంగసుమనోహృద్యంబై।
తగుసాకేతంబనంగ-ధర్మోజ్జ్వలతన్॥ ౫౪॥

ఉ. చందనగంధులందముగఁ జల్లనివెన్నెలలుల్లసిల్లమి।
న్నందినమేడలంబతుల-నంగజకేళులఁదేల్చినిద్దురం।
జెందనభోనదీనవకు-శేశయగర్భకుటీరనిర్యదిం।
దిందిరబృందనాదములఁ-దెల్పఁబ్రభాతములందువారలన్॥ ౫౫॥

ఉ. మేలిపసిండిసౌధముల-మీఁదనిజాంశుకరాజిఁబెట్టిస్వా।
ర్భాలికలంబుకేళికిసు-పర్వనదింజొరఁగాస్వనాయికా।
చేలములంచుబోఁటులవి-చేకొనిదాపఁగఁబోవవారికా।
కీలెతిఁగించిపంజరశు-కీతతివారణసేయునప్పరిన్॥ ౫౬॥

మ. అరయందత్పురలక్ష్మికిందివిజప-ద్మాస్యల్ నివాళింపనం।
బరమార్గంబునఁబట్టుదీపికలన-భాసిల్లుభాస్వత్స్వరం
దరరత్నోజ్జ్వలసౌధభాగఘటితో-ద్యద్హేమపాంచాలికా।
కరదీవ్యద్ఘనపద్మరాగమణిరే-ఖల్ ధూతతామిస్రలై॥ ౫౭॥

సీ. గగనమధ్యవిలాస-గరిమచేఁగొమ్మల,
గమికోటకొమ్మల-గమివెలుంగుఁ।
గమలాకరత్వవి-ఖ్యాతిచేసరసుల,
బృందంబుసరసుల-బృందమమరుఁ।
క్రీడితాఖిలభోగి-రేఖచేఁగేళీవ,
నంబునుబరిఖావ-నంబుఁదనరుఁ।
బూర్ణకుంభప్రభా-స్ఫూర్తిచేవారణ,
నివహంబుఁదోరణ-నివహమెుప్పు।

గీ. సురతరమహోహవక్రియా-హూతజంభ।
శాసనాద్యఖిలాదిత్య-సమితిజేత।
రాజరాజియుసద్విజ-రాజరాజి।
దనరుఁదత్పట్టణమునసం-తసమునిగుడ॥ ౫౮॥

మ. పరిఖామార్గములన్నివీధినులస-ర్పశ్రేణులే తెంచినా।
గరికత్వంబునఁగోటకొమ్మలకువే-గంబ్రాకిస్వర్లోకవై।
ఖురులెల్లంగనిక్రమ్మరంజనునిజా-గారంబులంజెందఁద।
త్వరమందున్నజనంబువేఁగిననుద-మ్ముంగాంచునంచున్వడిన్॥౫౯

సీ. సుమనస్సమూహభా-సురవైభవముగల్గి,
తనరువాసవరాజ-ధానిపగిది।
హరికిశోరప్రభా-వాభిరామతగల్గి,
రాజిల్లుయామ్యపు-రంబురీతి।

సేవితాతనువాహి-నీవరాళులుగల్గి,
కన్పట్టువరుణన-గరముభంగి।
గురుతరాహీనస-త్కోశరాసులఁగల్గి,
వెలయువైశ్రవణుని-వీఁటికరణి।

గీ. చారుతరరాజహంససం-సక్తిగలిగి।
తగుఁగనుంగొనవిష్ణుప-దంబురీతి।
ననుచుజనులెల్ల వినుతింప-నలరునొక్క।
రూపమునఁదత్పురంబుఁబు-రోపవనము॥ ౬౦॥

సీ. సాధులైయీశ్వర-శోధసేయరుగాని,
పెనుతురుసర్వజ్ఞ-తనుమహేశు।
వలవనివైరంబు-వాంఛసేయరుగాని,
కలఁతురుదపమున-గాధిసుతుని।
సభలోనబ్రహ్మవం-చనయొనర్పరుగాని,
తప్పింతురజుని వే-దములలోన।
స్వర్గభోగంబుల-క్ష్యంబుసేయరుగాని,
సాధింతురింద్రుని-సవనసమితి।

గీ. ననుచుజనులెల్ల వినుతింప-నప్పురమున।
శమితతామసగుణులుమా-త్సర్యరహితు।
లగణితానందులపరిమి-తాధ్వరాఢ్యు।
లైవెలుంగుదురెలమిభూ-దేవమణులు॥ ౬౧॥

ఉ. మానధనుల్విపక్షబల-మర్దనులాప్తసుధర్ములన్సదా।
దానగతుల్ మహాహవశ-తవ్రతులన్యకుభృద్భయంకరుల్
మానితవైభవాఢ్యులస-మానబలుల్ సుమనోనురాగసం।
ధానులుఁదత్పురీవరము-నందనరారునరేంద్రులెన్నఁగన్॥ ౬౨॥

ఉ. కోటిసువర్ణనిష్కములఁ-గట్టె మనమ్ము లొక్కొకటెక్కుమన్న భో।
వాటికిఁబర్వతెత్తినర్ఘు-వంబుగఁగాలమెఱుంగ నేరికిన్।
వాటముగాదటంచుఁబురి-వైశ్యులునిల్పిరికోటికోట్లక।
చ్చోటనుఁగొక్కకేతనము-చొప్పనసంఖ్యనతిక్రమించఁగన్ ॥౬౩

ఉ. అద్రులుధీరతంగరధృ-తాద్రులనూనదయాసమృద్ధిసా।
భద్రులుశౌర్యశక్తిబల-భద్రులుబాహుబలంబుపెంపునన్।
రుద్రులుసద్విభూతినిమ-రుద్గిరులుదానగతింగణింపన।
క్షుద్రులనంజెలంగుదురు-శూద్రులుతత్త్వటభేదనంబునన్॥ ౬౪॥

శా. ఆవీటంగలమత్తసామజసమూ-హంబుల్ సదాదానధా।
రావర్షంబులచేనిరంతరముగో-త్రాతాపనిర్మోచన।
ప్రావీణ్యంబులుజూపుచున్నభమునన్-భాసిల్లుమేఘంబులన్।
వేవేగంజెదరంగఁదోలుఁశ్రవణా-విర్భూతవాతంబులన్॥ ౬౫॥

చ. సరసగుణంబులేకనహి-చర్వితమైఘననిందితాకృతిం।
దిరుగుచుటించభేదనిర-తింగుటిలంబగుమారుతత్వమా।
దరమునఁబూనిసాగెడుస-దాగతిమాగతినేగతిందిర।
సరణముఁజేయునంచునగు-సైంధవముల్ పురిఫేనదంభతన్ ॥౬౬॥

చ. అరిహృతఘోటకప్రకర-మాదృతభీమదురంతవాహినీ।
శ్వరముఖునావరోధయుత-చక్రముమ్రుణ్మయమంచుఁజంద్రశే।
ఖరునిరథంబనారతముఁ-గన్గొనితత్పురిఁదేరులెప్పుడుం।
బరిహాసనంబుసేయుధ్వజ-బద్ధసితాంశుకకైతవంబునన్॥ ౬౭॥

ఉ. శ్రీహరిదివ్యపాదసర-సీరుహసంస్మరణానురక్తిభీ।
మాహవరంగరంగదహి-తావనిభృద్ఘనగర్వభంజనో।

త్స్నాహాసమగ్రశక్తివసు-ధాసురభాసురభక్తిధర్మమా।
ర్గాహితసూక్తితత్పరిభ-టావళికింగలదుర్వినెన్నఁగన్॥ ౬౮॥

గీ. నిమ్నములలోనమికిలి-నిమ్నమైన।
నగరిపరిఖనువెయినోళ్ళఁ-బొగడఁదరమె।
యున్నతంబులలోనన-త్యున్నతమగు।
వరణమొగివేయుఁగన్నుల-నరయవశమె॥ ౬౯॥

గీ. మేడఁగట్టనిలోగిఁట-మెలఁగువాఁడు।
మానికములేనితొడవుమై-నూనువాఁడు।
పూనిముత్తెపుసున్నంబు-లేనివిడెము।
వేయువాఁడొకఁడైనన-వీఁటలేఁడు॥ ౭౦॥

సీ. గంభీరవేదులు-గానినాగములునా,
జానేయములుగాని-సైంధవములఁ।
గమలాకరంబులు-గానిసరంబుల,
నుద్యానములుగాని-యుపవనముల।
వేదగర్భులుగాని-విపులాదితేయుల,
నార్యులుగానివై-శ్యప్రవరుల।
సుందరుల్గానిపూ-ర్ణేందుబింబాస్యల,
లబ్ధవర్ణులుగాని-లౌకికులను॥

గీ. చంద్రశాలలుగానిని-శాంతములను।
దానశౌండులుగానివ-దాన్యమణుల।
నైచికులుగానిగోవుల-నలువకైనఁ।
దరమెపరికింపఁదత్పురీ-వరమునందు॥ ౭౧॥

చ. చనుఁజనుబంతులిమ్మనుచుఁ-జయ్యనఁగేల్బలుమారుసాతువై।
ట్లనఁదగుముందుగాసరము-లన్నియుఁజిక్కిసరింపఁజూతువా।

వెనుకరసోచితంబుగను-వేమరుమాటలఁబొ్రిద్దుఁబుత్తువం।
చనువిటులంజమత్కృతులఁ-జొక్కఁగఁజేతురుపుష్పలావికల్॥

సీ॥పదనఖవిక్షేప-పాటవంబునఁగొంత, [illegible]
తారామనోహర-త్వమ్ముఁజిమ్మి।
కరికరాకారోరు-కమనీయదీప్తుల,
రంభావిజృంభణా-రంభమణఁచి।
చంచలాపాంగప్ర-సారవిభ్రమముల,
హరిణీమనోజ్ఞవై-ఖరులగెలచి।
తనులతాచ్ఛవిసము-ద్యత్ప్రరోహంబుల,
హేమాతిశయలక్ష్మి-నెగ్గుపరచి।

గీ. కలితగానాభినయచమ-త్కారములను।
లాస్యసమయాంగహారవి-లాసములను।
మరులుకొలుపుదురెంతటి-మానుసులను।
వారకామినులప్పురీ-వరమునందు॥ ౨౩॥

ఉ. అచ్చపుముత్యసర్లగల-వంచునగంచెలఁగప్పియుండఁగా।
నిచ్చనుగట్లపైనడతు-రేమరుపాటునఁజేలమీఁదికిం।
జెచ్చెరఁగేలుసాతురిటు-సేయఁగవచ్చునెయంచుఁబాంథులన్।
మచ్చికమాటలాడిపలు-మారుఁగలంతురుశాలిపాలికల్॥ ౨౪॥

ఉ. చందనభూమిభృద్విపుల-సౌరభసారధురంధరంబులై। [illegible]
నందునజాహ్నవీప్రవిమ-లాంబుసముత్తరణావసంబులై।
నందునఁదత్పురాంతికస-మగ్రవిహారవనాంతికంబునన్।
మందగతింజరించుఁబవ-మానకిశోరములింపునింపుచున్॥ ౨౫॥

మ. ఘనసౌధాగ్రచరత్సరోజనయనా-కందర్పసంగ్రామసం
జనితాయాసమమర్త్యలోకతటినీ-సంజాతసంఫుల్లకాం
చనకంజాతసమగ్రసౌరభభర-శ్రాంతాతిహృద్యానిలం
బున వెన్వెంటఁ దొలంగఁ జేతురరరం-బుల్ మిప్పి భోగుల్ పురిన్ ॥ ౨౬

మ. పరమానందకరోర్మికానికరశో-భాప్రాభవంబుల్ భృతాం
బురుహంబుల్ తరుణారుణోత్పలదళ-స్ఫూర్తుల్ చలత్కంకణా
కరముల్ గచ్ఛపమత్స్యపద్మదరచ-క్రశ్రేష్ఠరేఖామనో
హరకాంతుల్ కమలాకరంబులు పురో-పాంతంబునన్ భాసిలున్ ॥

క. ఆనగరి చెంతఁ దగు సర
యూనది కమనీయసార-సోత్పలమకరం
దానూనమాధురీస
న్మానితరోలంబయైజ-నంబులు వొగడన్ ॥ ౨౮

మ. సురసాలాంచితతీరయై యనిమిష-స్తోమాంచితద్వీపయై
సరసాళిస్తవనీయనూతనలస-త్సౌవర్ణనాళీకయై
సరయూనిమ్నగ వీఁటి చెంతఁ దనరున్-స్వర్లోకమం దొప్పు ని
ర్జరకల్లోలినిపోలికం బరమహం-సశ్రేణి మోదింపఁగన్ ॥ ౨౯

క. క్షితిలోనుత్పలమాలాం
చితనిఖిలకవిజనచక్ర-సేవితయై పూ
రితనవరసయై సత్కృతి
గతిఁ దగు సరయూస్రవంతి-ఘను లెన్నంగన్ ॥ ౩౦

శా. ఆకేళీవనవాటులా స్ఫటికహ - ర్మ్యశ్రేణులా కాంచన।
ప్రాకారాగ్రములా సముజ్జ్వలసరో - రాజంబులా మందురా। గుఱ్ఱపుసాలలు, పాకలు
నీకంబా గజశాలలా విపణులా - నృత్యాలయ వ్రాతమా।
లోకోత్కృష్టవిలాసమన్య పురినా - లోకింపఁగాఁగల్గునే॥ ౮౧॥

వ. ఇవ్విధంబున సకలజనంబులకు నయనానందంబు గావింపుచు సుజనహృదయంబునుంబోలె మాలిన్యరహితంబై, పుష్పవనంబునుంబోలె సరసాళిసన్నుతంబై, వైకుంఠపురంబునుంబోలె దుర్జనశూన్యంబై, పాతాళపురంబునుంబోలె బహునాగ సమాకీర్ణంబై, మేరునగంబునుంబోలెఁ గళ్యాణభరితంబై, పారావారంబునుంబోలె లక్ష్మీజనకంబై, పార్వతీవిలాసంబునుంబోలె సర్వజ్ఞమనోహరంబై, శ్వేతద్వీపంబునుంబోలెఁ బురుషోత్తమనివాసంబై, పురందరపురంబునుంబోలె సుమనస్సందోహ సుందరంబై, సర్వేశ్వరశరీరంబునుంబోలె సర్వమంగళాలంకృతంబై, గగనతలంబునుంబోలెఁ గవిబుధ గురు కళానిధి కలితంబై, మంగళోపేతంబై యహీనప్రాభవంబై సద్గుణపరివృతంబై, ప్రావృట్కాలంబునుంబోలెఁ బ్రబలఘనోన్నతంబై సర్వతోముఖ సమృద్ధంబై, ప్రభాతంబునుంబోలె నవల తరణికిరణమసృణంబై ముదితాప్తచక్రంబై రాకానిశాసమయంబునుంబోలె రాజమండలరాజమానంబై యాహ్లాదప్రదంబై, శారదావిగ్రహంబునుంబోలె సత్యకలితంబై చతురాననాధారంబై, యలకాపురంబునుంబోలె ధనదాశ్రయంబై సార్వభౌమసహితంబై, వరుణనగరంబునుంబోలె బహువాహినీ పరివృతంబై రత్నాకరరమణీయంబై, భీరువిరహితంబైయును భీరువిలసితంబై, పుణ్యజనాగమ్యంబైయును బుణ్యజనోపేతంబై,

మంగళోపేతంబైయును నవక్రవిక్రమాతిశయంబై, కంటక రహితంబైయును బరిపంథిజనాగమ్యంబై, యభంగంబైయును రత్నాకరంబై, బంధంబులురతులయందును, భయంబపకీర్తివలనను, బాష్పంబులానందంబువలనను, బాతిత్యంబు క్రీడాకందుకంబునందును, గామంబుకీర్తియందును, క్రోధం బసత్యంబువలనను, లోభంబు సద్వర్తనంబునందును, మోహంబు నిద్రవలనను, మదంబు గజంబులందును, మాత్సర్యంబు సదాచారంబులయందును, ఛదచ్ఛేదంబు పద్యంబుల యందును, వాదంబులు శాస్త్రంబుల యందును, గల్పనలు కావ్యంబులయందును, గాఠిన్యంబు కాంతాకుచంబులయందును గానితనయందుఁ గలుఁగదననొప్పి సకల సంపత్కరంబై దుందుభిప్రముఖ వాద్యఘోషంబులను, వివిధవేదనాద విశేషంబులను, ప్రబలశాస్త్ర ప్రసంగంబులను, కాదంబినీభ్రాంతిప్రద చంద్రశాలాసముద్గత కాలాగరుధూప ధూమమాలికాసందర్శన సముత్థితోత్సాహ చంద్రకితసమూహ కేకానాదంబులను, వెలవెలందులనాట్యవినోదంబులను, మకరంద పానతుందిల చలదిందిందిర బృందగరుత్సమీరసముద్ధూత పరాగపరంపరా విలసిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత బహుపాదప పరివృతంబులగు తోటలను, బాలికామణులపాటలను, సామంతాంతరంగ ధైర్యలతికాదళన కృపాణాయమాణ గారుత్మత రత్న రారాజ్యమాన వేదికాసమీప సంఘటిత కాయమాన కలితస్తంభోపాంత విజృంభితార్ధ తనూవిలాస వారరమణీ రమణీయంబులగు రచ్చలను, గోపానసీకలితంబులగు పచ్చలను, గీర్వాణాలివేణీ వాగ్ధోరణీశ్రవణ మనోహారి కీరశారికా పరివార విరాజమాన మహోన్నతా

గ్రంబులగు మేడలను, చిత్రితసురాసుర సంగర విలసితంబులగు బంగరుగోడలను, నిందీవరారవింద కదంబనిర్యన్మకరంద బిందుసందోహ వాసనావాసిత పరిపూర్ణపయఃపూరితంబులగు బావులను, మృగమదమిళితోదక సిక్తంబులగు తావులను, శృంగారంబులకు శిరోగృహంబై, విభ్రమంబులకు వేశ్మంబై ప్రాభవంబులకు భవనంబై, వైలక్ష్యంబులకు వాసంబై, సంపదలకు సదనంబై, మంగళంబులకు మందిరంబై, సౌఖ్యంబులకు సద్మంబై, సత్యంబునకు శరణంబై, దానంబునకు ధామంబై యప్పురంబు భూదేవికి భూషణంబు పోలికం బొలుచునయ్యెడ. ౮౨॥

శా. ఏలుందత్పురమంబుజాప్తకులవా-ర్ధీందుండమిత్రావనీ।
పాలవ్రాతనఖాగ్రసంక్షుభితరం-భామేనకాముఖ్యనా।
నాలేఖాబ్జముఖీపయోధరధరేం-ద్రద్వంద్వుఁడభ్యర్చిత।
శ్రీలోలుండుదిలీపుఁడాశ్రితజన-క్షేమంకరాకారుఁడై॥ ౮౩॥

సీ. సూర్యచంద్రప్రభా-చార్యధౌరంధర్య,
శౌర్యకీర్తిద్వయీ-సంగ్రహుండు।
ద్వీపాంతరాగతో-ర్వీపాలనివహాని,
త్యోప్యాత్తవివిధర-త్నోపహృదుండు।
చండదోర్దండకో-దండనిర్యత్కాండ,
ఖండితోద్దండారి-మండలుండు।
భద్రదానోదక-విద్రావితసముద్ర,
ముద్రితక్ష్మాతలో-పద్రవుండు।

గీ. జైత్రయాత్రావసరసము-జ్జనితభేరి।
కాభయంకరచటులభాం-కారదళిత।
వనజగర్భాండుఁడర్థిహృ-ద్వాంఛితార్థ।
దాయకుండుదిలీపభూ-నాయకుండు॥ ౮౪॥

సీ. తనకలాపస్ఫూర్తి-తనకలాపస్ఫూర్తి,
కరణిదివ్యాంబకా-కరముగాఁగ।
దనసత్రసంఘంబు-దనసత్రసంఘమ,
ట్లఖిలద్విజావృతం-బై చెలంగఁ।
దనదానవిభవంబు-దనదానవిభవంబు,
గతిసరసాళిస-న్నుతివహింపఁ।
దనపురాకారంబు-దనపురాకారంబు,
పగిదిబలోత్కృష్ణ-పటిమఁబూనఁ॥

గీ. దనదుదోర్దండమండితో-ద్దండమండ।
లాగ్రఖండితచండాహి-తావనీశ।
దళితమార్తాండమండలాం-తరుఁడమోఘ।
సాయకుండాదిలీపభూ-నాయకుండు॥ ౮౫॥

మ. సవనాహూతపురందరాదిసుమన-స్సంఘుంబుచేమండలా।
గ్రవినిర్భిన్నసపత్నభూరమణసం-ఘాతంబుచేధారుణిం।
దివిరీతింద్రిదశాలయంబవనిరీ-తింజేసెమేల్మేల్దిలీ।
పవిభుండద్భుతచర్యుఁడాతనిగణిం-పన్వచ్చునేయేరికిన్॥ ౮౬॥

సీ. ఏరాజుసంతత-మింపుపుట్టఁగనిష్క-,
ళంకుఁడైచక్రపా-లనమొనర్చె।
నేభోగియసహా-యుఁడైభుజాగ్రంబున,
భరియించెధారుణీ-భారమెల్ల।
నేఘనుండనుదినం-బీప్సితార్థంబులఁ,
జంచలుఁడైద్విజ-సమితికిచ్చె।
నేసార్వభౌముఁడ-హీనదానోదకం,
బులనింపెసకలది-గ్వలయములను।

గీ. ఏజగద్బంధుఁడగణిత-తేజమునను।
సద్గుణంబులఁబాలించి-సకలకువల।
యప్రమోదమొసంగసు-రాధినాథ।
విభవుఁడైనదిలీపభూ-విభుఁడెకాక॥ ౬౭॥

శా. లోకాలోకమతిక్రమించితెరవా-లోకించుభీతారిగో।
త్రాకాంతాళులకంధకారజనిత-త్రాసంబణంగించెన।
స్తోకాలోకనిజప్రతాపతపనాం-శుశ్రేణిచేనంచునా।
కౌకస్సంఘములెన్నభాసిలెదిలీ-పోర్వీశుఁడత్యున్నతిౘ॥ ౬౮॥

సీ. తనభుజార్గళమద్రి-దంష్ట్రికచ్ఛపనాగ,
నాగంబులకుఁబుర్వో-భాగిగాఁగ।
దనశాసనంబుస-ప్తద్వీపసంచర,
జ్జనసంతతికివతం-సంబుగాఁగ।
దనతనూసౌందర్య-మనిమిషస్త్రీవిలోచ,
నంబులకాసేచ-నకముగాఁగ।
దనవితరణముచిం-తామణిసురధేను,
కల్పకంబులకక్షి-గతముగాఁగ।

ఆ. దనకరాగ్రరాజి-తస్కరచ్ఛాయాసి,
పుత్రిభీకరారి-గాత్రజీవ।
పటలములకుఁ దావి-భాగపత్రిక గాఁగఁ।
దనరునిలదిలీప-మనుజవిభుఁడు॥ ౮౯॥

సీ. బొంక నేరనివానిఁ-బోషించుటయె కాని,
బహుభాషియైనఁ గో-పంబు లేదు।
శరణుఁ జొచ్చినవానిఁ-గరుణించుటయె కాని,
పగతుఁడైన నుగొంచె-పరచ లేదు।
దురితాత్ముఁడగువాని-దూషించుటయె కాని,
నిగమాంతియైనమ-న్నింపలేదు।
తప్పు జేసినవాని-దండించుటే కాని,
విహితుఁడైనను జేర-విడువలేదు।
గీ. తరమె వినుతింపదశదిశా-స్థగితకీర్తి।
చారుతరసాంద్రచంద్రికా-సముదితార్థి।
జనచకోరకలాపభా-స్కరకులప్ర।
దీపుభాస్వత్ప్రతాపుది-లీపుమహిని॥ ౯౦॥

సీ. విబుధసమూహసే-వితుఁడు మహాబలా,
న్వితుఁడు విద్యాధర-వినుతయశుఁడు।
ఖండితారాతిబ-లుండు సుధర్మైక,
నిరతుండు సహజవ-ర్ణితగుణుండు।
గురుభక్తుఁడాదిత్య-కులదీపకుఁడు సదా,
దానపరివర్తన-తత్పరుండు।
దివ్యాంబకసహస్ర-దీప్తితుండధ్వర,
శతనుతుఁడరికుభృ-చ్ఛాసనుండు।

గీ. రాజరాజకిరీటవి-రాజమాన।
రత్ననీరాజితాంఘ్రినీ-రజ్యుఁడటంచు।
జనులువినుతింతురెదదిలీ-పునిమహేంద్ర।
సన్నిభుఁడుగాఁడె పొగడఁద-జ్జనవిభుండు॥ ౯౧॥

సీ. పృథులసదున్నత-పృథ్వీభరణశక్తి,
పురుకుత్సునిమహావి-భుత్వగరిమ।
నలునితనూసము-జ్జ్వలవిలాసముహరి,
శ్చంద్రునిసత్యవాక్చతురిమంబు।
కార్తవీర్యునిపరా-క్రమసమున్మేషంబు,
శిబివదాన్యత్వవి-శేషమహిమ।
సగరునిధర్మాను-సరణవర్తనముమాం,
ధాతృనిప్రబలభా-గ్యాతిశయము।
గీ. దుందుమారునిదుస్సహా-దోఃపటుత్వ।
మంబరీషునిసద్వ్రతా-డంబరంబు।
దనరనీతనియందని-జనులువొగడ।
నెగడెమిగులదిలీపావ-నీవరుండు॥ ౯౨॥

మ. అవనీమండలమూదిలీపన్నపసిం-హంబంబరీషున్నృగున్।
యువనాశ్వున్భరతున్భగీరథువిదే-హుంగార్తవీర్యంబురూ।
రవుమాంధాతృనలుంగకుత్సునహుషున్-రామున్హరిశ్చంద్రునిన్
రఘువురంతిన్సగరున్సహోతఁబురుకు-త్సుంబోలిపాలింపఁగన్॥

క. కకుబంతంబులనారా।
జకుమారునివైరిన్నృపుల-స్వాంతంబులఁబా।
యుకొనినఘనగర్వమునా।
మకమైచెడఁగనుళరత్న-మయమపుడలరెన్॥ ౯౪॥

శా. జీవంజీవపురాకృతోజ్జ్వలతపః-శ్రేణీకమ్మానీతతా। తె,పొందింపబడినది-
రావర్గోజ్జ్వలమవ్యయైంధవరుచి-ప్రాత్తంబుశుభ్రీకృతాం। కావబడినది-
గా భోవాహంబునిరస్తకర్దమముసం-ఫుల్లారవిందోత్పల। అగును-
శ్రీవాసంబుశరత్సమాగమమురం-జిల్లెన్మహీమండలిన్॥ ౯౫॥

క. శరదాగమ మెఱిఁగింపఁగ।
నరుదెంచుమరాళములకు-నద్దేవతలా।
దరముననిడుపీఠములనఁ।
బరఁగెసరోవరములందుఁ-బంకరుహంబుల్॥ ౯౬॥

సీ. రాజహంసలకును-రాజహంసలకును,
ధారాధరావరో-ధంబణంగ। మేఘ,మిగ్గము-
సన్మార్గసీమల-సన్మార్గసీమల,
నత్యంతనైర్మల్య-మధిగమించె।
కుసు శరకలాపములందు-శరకలాపములందు,
గణనమీరినరుచుల్ -గాననయ్యె।
ఋు- భూదేవమణులకు-భూదేవమణులకు,
సాంద్రమహోత్సవముఁబుట్టె।
గీ. ధరణిఁగాంతారములునుగాం-తారములును।
సరసభావంబుఁగాంచిప్ర-శస్తికెక్కెఁ।
గోవిదారప్రసూనప్ర-భావిభాస।
మానమైనశరత్కాల-మహిమఁదోప॥ ౯౭॥

మ. జలదంబుల్ ధవళప్రభందనరెఁగా-శశ్రేణిపూఁచెన్ధరా।
తలమందారెనుపంకమాకసమునం-దారాసమూహంబులు।
జ్జ్వలశోభాతిశయంబునందనరెస-స్యంబుల్ ఫలించెన్ వని।
స్థలనీరంబులతోనదీనదములున్-రాజిల్లెనానత్తఱిన్॥ ౯౮॥

చ. చెలఁగిబిసాళిఁ జెంచువులఁ-జించిభుజించివినిర్మలామృతం।
బులుపొలుపొందఁ ద్రావిపరి-పూర్ణముదంబునసంచలాపగా।
పులినతలంబులన్ రజత-భూధరపాదములం జెలంగుసి।
ద్ధులవలెహృద్గతామయవి-దూరములైతనరారెనత్తతిన్॥ ౯౯॥

సీ. శరదబ్జముఖిపేర్మిఁ-జతురతనలదిన,
ఘనసారసహితచం-దనమునంగఁ।
శారీవృద్ధియోగతా-పంబుచేమెయినుద్భ, వర్ణనీయ-
వంబైనప్రబలవై-వర్ణ్యమనఁగ।
నిర్మలామృతదాన-నిపుణత్వమునఁనాఁగ,
తంబైనయుజహృద్య-శంబనంగఁ।
జాతకంబులఁబోర్వఁ-జాలకనీరస,
త్వమునఁబూనినవెల్లఁ-దనమునంగ।

గీ. భావికలహంబులరయనం-బరమునందుఁ।
గార్త్రితోనున్న సారదుఁ-గొలచియతని।
వలనఁగైకొన్న శుద్ధస-త్వంబనంగఁ।
దనరెధావళ్యమభ్రవి-తానమునను॥ ౧౦౦॥

క. ఘనునివిడనాడివడిమే।
దినిపైవిహరించుమెఱుఁగుఁ-దీగెలునామో।
హనరూపంబులతోడనుఁ।
గనుపట్టెరిశాలిపాలి-కలుచూపులకున్॥ ౧౦౧॥

గీ. పధికసముదయమతనుతా-పమునుఁ జెంది।
చేరవచ్చినలోనికిఁ-జేరనిచ్చి।
వారిఁగేళులఁదేల్చి శై-వలినులలరె।
వారకాంతలగతిశర-ద్వాసరములు॥ ౧౦౨॥

గీ. జలజబాంధవకిరణవృష్టి-సారమునను।
బుడమిగతపంకయై మోద-మునఁ జెలంగె।
నతనుశరజాలనిర్మగ్న-లైనసతుల।
కినకరస్పర్శనం బెన్న-హితముగాదె॥ ౧౦౩॥

మ. హరినిద్రారతిమానెనం దుశరద-బ్జాక్షీశిరోరత్నము।
ర్వరకునాద్రిజమరాళయానమునఁ జే-రన్వచ్చి కీర్తించె।
నెరిగింపన్ఘనవేదసారహితయై-యింపొందెభూదేవిసుం।
దరులామోదముఁ జెందరేదయితుల-న్యాసక్తి వర్జించినన్॥ ౧౦౪॥

మ. ఘనకుంభంబులతోఁ బయోధిజలమా-త్కంఠ్యంబునం దెచ్చిగో।
బ్బునఁ బ్రావృట్టటిదుజ్వలాంగివసుధాం-భోజాక్షికుద్వ్యద్రజ।
స్తనమాలిన్యమణంచిపోవఁ దడియో-త్తంగా శరత్కాంతదె।
చ్చినచాకింటిమణంగులోయనఁగరా-జిల్లెన్వళక్షాభ్రముల్ ౧౦౫॥

శా. నాళీకోత్పలవిభ్రమద్భ్రమరికా-నాదంబు క్రౌంచాఖ్యకు।
త్కేలాభ్యాగతరాజహంసమిథున-క్రేంకారముం గీరవా।
గ్జాలంబున్ నలుదిక్కులం జెలఁగఁగా-సర్వంబునున్ లోఁగొనెన్।
శాలిప్రాంతచరత్సరోజనయనా-సల్లాపచాతుర్యముల్॥ ౧౦౬॥

క. చెన్నలరెదినములభ్ర।
చ్ఛన్నంబులుగాకనపుడు-శౌరిసనయుఁడై।
కన్నులుఁ దెరచికనుంగొన।
సన్నగిలవెదుర్దినప్రభ-సక్తభయంబుల్॥ ౧౦౭॥

సీ. మధుకరాతిథులకు-మకరందమొసఁగంగఁ,
బద్మినులెత్తిన-పాణులనఁగ।
జాగరూకుండైన-శౌరికిఁ బ్రేమన,
దైవతలిడినదీ-పికలనంగ।

విమలాంబుబింబిత-విష్ణుపదంబును,
సేవింపవచ్చిన-సిద్ధులనఁగ।
నీరసత్వమునమం-దీకృతాకృతినప్పు,
లడఁగవచ్చినబలా-హకములనఁగ।

గీ. శారదాగమవేళఁగా-సారసీమ।
లందుఁదనరారెఫుల్లార-విందతతులు।
రక్తకైరవకలికలు-రాజహంస।
లసితశైవాలవల్లికా-విసరములను॥ ౧౦౭॥

చ. అమలినమైప్రపదగ్నితది-గంబరమైశరజన్మభామమై।
ప్రముదితహంసమైవిశద-రస్మిశితంబయిసర్వమంగళా।
స్పదమభిరామమైబుధగ-ణస్తుతమైశుకసేవ్యమైశర।
త్సమయమురాజిలెన్రజిత-శైలవర్ణంబుతెరంగుఁదోఁపఁగన్॥

ఉ. అంబుధవారిఁగొంచెముగ-నాచమనంబొనరించిమింటఁగ।
ర్వంబలరంగఁగర్జిలిని-రంతరముర్వవిషంబుఁజిల్కుమే।
ఘంబులువెల్వెలంబడఁగఁ-గంధినశేషజలంబుఁగ్రోలిలో।
కంబులుమెచ్చభాసిలున-గస్త్యుఁడుదానుజయించెనత్తఱిన్॥

సీ. చాతకంబులకతి-క్షామప్రదర్శక,
మంబుజాతములకు-నయకరంబు।
జలదసంఘమునకు-చ్చాటనమంత్రంబు,
పురుషోత్తమునికిఁబ్ర-బోధకంబు।
కీరంబులకుఁబురా-కృతపుణ్యఫలరూప,
ముత్పలంబులకుభా-గ్యోదయంబు।
రాయంచలకువిచా-రగ్రంథిదళనంబు,
బర్హిణంబులకువా-గ్బంధకంబు।

గీ. ఋతువతంసంబుచంద్రికా-వితచకోర।
గణముకుంభోద్భవోదయ-కారణంబు।
కాశధవళితమపగత-కలుషసలిల।
భాసురముభాసిలెనుశర-ద్వాసరంబు॥ ౧౧౧॥

చ. లలితసరస్సభాంతరము-లన్ సరసాళులు చేరికొల్వఁగా।
జలరుహచారుపీఠముల-సంతసమొప్పఁగనున్న రాజహం।
సలకుఁబటుప్రకల్పితవి-శాలవితానములై చెలంగెను।
జ్వలరుచితోడనత్తరిని-శారదనీరదముల్ నభంబునన్॥ ౧౧౨॥

సీ. పరివృతహంసమై-బ్రహ్మంబుగతిఁబంక,
హీనమైయోగీంద్రు-హృదయమట్లు।
విషధరభయదమై-వినతాత్మజునిరీతి,
శారదోపేతమై-సత్యమట్లు।
సన్మార్గలలితమై-స్వర్గంబుగతివిమ,
లామృతభరితమై-యబ్ధికరణిఁ।
గాశభాసురమైయ-హీశలోకముపోలెఁ,
గమలాభిరామమై-కైటభారి।

గీ. పగిదిఁగువలయహృద్యమై-పాండురాంశు।
మండలముచందమునవృష-మహితమగుచు।
నందనవనంబురీతిఁజె-న్నొందెనపుడు।
భాసురంబైనయాశర-ద్వాసరంబు॥ ౧౧౩॥

చ. వితతమరందతైలరస-వృద్ధములైపతదుత్పతన్మధు।
వ్రతసముదగ్రధూమపరి-వారములైరుచిరంబులైకుము।
ద్వతులుజలాధిదేవతకు-దంచితవృత్తినొసంగుదీపికా।
తతులనరక్తకైరవవి-తానములొప్పెసరోవరంబులన్॥ ౧౧౪॥

చ. చికురములంబుదమ్ములను - సేముషి నాడు నెమళ్ళఁ గాంచిత।
ప్పకనిడుహస్తతాళములఁ - బాంధులు పోల్తురు భ్రాంతిఁ గీరవా।
రకములటంచుఁ దోలుదురె - క్రమ్మరఁ జిల్కలశాలిపాలికా।
లికుచకుచల్ కుచద్వితయ - లిప్తససాంకవగంధసారలై॥ ౧౧౫॥

క. తెల్లముగ నాడుఁ గ్రమ్మర।
వ్రాల్లకయుతశాలిపాలి - కాబ్జముఖీధ।
మ్మిల్లములఁ గనిశిఖులువి।
ద్యుల్లతికాంచితఘనాఘ - నోద్యద్భ్రాంతిన్॥ ౧౧౬॥

మ. జలముగ్భ్రామికలోయనస్మగుడహం - సల్జూచిభీతిల్లఁగా।
విలసద్బృంహితగర్జితంబులసదా - విర్భూతదానాంబుధా।
రలదంతచ్ఛవిచారుచంచలలనిం - ద్రప్రస్తరచ్ఛాయలం।
జెలఁగెన్ మత్తమతంగజంబులు సము - త్సేకంబుతో నత్తఱిన్॥

ఉ. ఆసమయంబునందు వసు - ధాధిపశేఖరుఁ డొక్క నాఁడు కై।
లాససమున్నతంబయి చె - లంగు విఘూపలసౌధమందును।
ల్లాసముతోఁ డనాప్తులు కె - లంకులనుండ మణీమయోరుసిం।
హాసనమందమందవిభ - వాతిశయంబున సన్నివిష్టుఁడై॥ ౧౧౭॥

ఉ. ప్రీతిజయేందిరం గుణగ - రిష్ఠుఁడ వౌచును స్వాంపరాయసం।
కేతమునందుఁ గైకొనిసు - ఖింపఁగ రమ్మని పిల్వవచ్చుత।
ద్దూతికరీతిఁ దెల్లముగఁ - దోఁచిన శారదవేళఁ గాంచి శౌ।
ర్యాతిశయంబు పెంపున నృ - పాగ్రణి మంత్రులఁ జూచి వేఁడుకన్॥

మ. సమదస్ఫూర్తి నరాతిభూపతులపై - సైన్యంబుతో నేగఁగా।
సమయంబయ్యె దిగంతరంబుల జయ - స్తంభంబు లాచంద్రతా।
రముగా నిల్పవలెం బ్రయాణమయి రా - రమ్మంచుఁ గన్నాకులన్।
సముదగ్రంబుగఁ బిల్వఁ బంపుడని యా - జ్ఞాపించి చిత్తంబునన్॥

చ. తలఁచె నరుంధతీధవుని-దారచరిత్రుఁ బవిత్రవర్తనుం।
గులగురు మౌనిపుంగవుని-గుంఠితతేజు గుణాధికుం దపో।
బలపరివేష్టితుం బరమ-పావనమూర్తి వసిష్ఠసంయమిం।
జెలువగు జైత్రయాత్రకువి-శేషముహూర్తము నిర్ణయింపఁగన్॥

చ. సకలకళాకలాపములు-చారుకలాపములై చెలంగఁగాఁ।
బ్రకటతపోబలంబు చతు-రంగబలంబయి కావలఁగా మహః।
ప్రకరమఖండవైభవవి-భాసురలక్షణమై వెలుంగఁగా।
నికటమునందు నిల్చెను ము-నిప్రవరుండు తలంచునంతటన్॥ ౧౨౨

చ. ఘనుఁడు వసిష్ఠసంయమిశి-ఖామణి మోదముతోఁడ నీగతిం।
దననికటంబునన్ నిలచి-నం గని లేచి భయంబు భక్తియున్।
మనమునఁ దొట్రిలంగ నృప-మౌళి నమస్కృతిఁ జేసి కాంచనా।
సనమున నుంచి యర్ఘ్యమిడి-చాలసపర్యలొనర్చి నెమ్మితోన్॥

గీ. తదనుమతమున ధారుణీ-ధవుఁడు తనదు।
హేమసింహాసనాసీనుఁ-డై మునిప్ర।
వరునిఁ గనుఁగొని వినయపూ-ర్వకముగాఁగఁ।
బలికె నిట్లని గంభీర-భాషణముల॥ ౧౨౪॥

క. భద్రమె మీకుం బ్రజలకు।
భద్రమె భవదాశ్రమమునఁ-బ్రత్యహముఁ దపో।
ముద్రాముద్రితులైనిరు।
పద్రవమున నున్నవారె-పరమమునీంద్రుల్॥ ౧౨౫॥

సీ. మీరున్న పర్ణకు-టీరవాటికలలో,
పలను బుట్టదుగదా-జ్వలనభయము।
జీవనోపాధియౌ-నీవారసస్యంబు,
మేసి పోవదుగదా-మృగచయంబు।

భవదాశ్రమోపాంత-పాదపశ్రేణికి,
రాదుగదామరు-దాడిబాధ।
స్నానాదులకుయోగ్య-మైనమీకొలఁకుల,
కడకుఁ జేరవుగదా-గహనకరులు।

గీ. కుశసమిత్పుష్పఫలముల-కునునిరంత।
రంబుద్రిమ్మరుమునికుమా-రప్రతతినిఁ।
జేరరావుగదా వ్యాఘ్ర-సింహవృశ్చి।
కాజగరపన్నగాదులు-యతివరేణ్య॥ ౧౨౬॥

మ. భవదీయాశ్రమమందు నెప్డుమునులభ్యస్తాగమాంతార్థగా।
రవులైయుండిమఖాళి సేయఁగహవి-ర్భాగార్థమింద్రాదిదే।
వవితానంబరుదెంచిమీపనుపున-న్వర్తించు నేదుష్టదా।
నవవీరార్థముయుష్మదుజ్జ్వలతపో-నాశంబుగాకుండఁగన్॥ ౧౨౭

చ ఘటములనీరుమోచిముని-కన్యకలాశ్రమమందునున్న స।
ద్విటపిలతావితానమును-వేమరుఁబ్రోదియొనర్చుచున్ సము।
త్కటమునఁబెంతురే పెరిగి-తద్ద్రుమవల్లులుసంతతంబుసం।
ఘటనముసేయు నేమునిసి-ఖామణివారలకీప్సితార్థముల్॥ ౧౨౮॥

చ. మునులుముదంబుతోఁజొరక-మున్నెసరోంబువులన్
మరాళము।
లొనవుగదాతపోనిధులు-గోయకమున్నెయళుల్సుమంబులం।
గనవుగదాబుభుక్షద్దెరపిఁ-గాంచిభుజింపకమున్నెకీరము।
ల్దినవుగదాఫలంబులుయ-తిప్రవరాభవదాశ్రమంబునన్॥ ౧౨౯॥

శా. ద్వైతాద్వైతములన్నితాంతనిగమాం-తప్రోక్తమార్గజ్ఞతా।
ఖ్యాతిన్భాసిలుశారికాశుకముల-న్యోన్యంబులంగాఁడిలో।
కాతీతోక్తులుపూర్వపక్షమునుసి-ద్ధాంతంబునఖ్యాగత।
శాంతింబులెవ్వరఁగొందఁజేయునెభవ-ద్వాసస్థలిన్సంయమీ॥

శా. ఆఖేటార్థము దంతివాజిముఖసై-న్యశ్రేణితో వచ్చిగో।
త్రాఖండంబుననున్న క్షుద్రన్నృపతు-ల్దర్పంబునందావకీ।
నాఖండాశ్రమమందు సంతతతపో-వ్యావృత్తిచేనున్న భూ।
లేఖశ్రేణుల రాపుసేయరగదా-లేశంబునన్సంయమీ॥ ౧౩౧॥

సీ. కరులు సింగములచెం-గటనువర్తించునే,
తిరుగునే పులులతో-ధేనుతతులు।
కాకులలోఁగల-కంఠంబులుండునే,
నిలుచునే శిఖులలో-పలను ఫణులు।
విహరించునే లేళ్ళు-వృకములతోడ మే,
కలు సంచరించునే-కపులలోన।
మెలఁగునే జవ్వాది-మెకములలోఁ జిల్క,
లాడునే శ్వములను-గూడి కిటులు।

గీ. హృదయముల జాతివైరంబు-లూదవకుండ।
నైకకంఠ్యంబున నుభవ-దాశ్రమమున।
మను నెమిగిలిన వనజంతు-మండలములు।
సంయమీశ్వర జనములా-శ్చర్యమంద॥ ౧౩౨॥

మ. అనిధాత్రీధవశేఖరుండు మృదువా-గ్వ్యాపారమే పారఁబ।
ల్కెనఁ దానిట్లనె మానినీవుధరఁబా-లింపన్నమస్తావనీ।
జను లెల్లన్నిరుపద్రవోన్నతసము-త్సాహంబుతోనున్నవా।
రనఘా వేరె వచింపనేటికి మదీ-యక్షేమలాభంబులన్॥ ౧౩౩॥

క. నరవర ననుదలఁచినపని।
ధర దివ్యజ్ఞానసంప-దం దెలసెను నీ।
పరులం గెలువఁబ్రయాణం।
తిరుగఁదలఁచి సస్పృహార్త-మడుగుటకనుచున్॥ ౧౩౪॥

సీ. ఏకవింశతిదోష-హీనస్వరూపంబు,
నపహృతస్వల్పదో-షాంకురంబు।
కవికళానిధిసుతా-క్రాంతచతుర్థంబు,
శుభగ్రాంశుసహితమే-షూరణంబు।
షష్ఠపదస్థిత-క్ష్మాజార్క-తనయంబు,
విక్రమసహితార-విందహితము।
దివిజేంద్రగురుసమ-ధిష్ఠితలగ్నంబు,
చంద్రతారాబల-సలలితంబు।

గీ. నిఖిలకార్తాంతిక స్తవ-నీయమైన।
ఘనముహూర్తంబునీభాగ్య-గౌరవమునఁ।
గలిగెరేపటిరేయిభూ-కాంతతిలక।
జైత్రయాత్రయొనర్చుత-త్సమయమునను॥ ౧౩౫॥

ఉ. మంచిదిసింహలగ్నమను-మానముమానుమ పాలయొల్లిరే।
యంచితవృత్తిరోహిణిఘు-నాయనమధ్యమమందుమించివ।
ర్తించుతదింజనంగవలె-దిగ్విజయంబుఁబ్రతాపమొప్పఁగా।
వించికరంబులంగొనిభు-విన్నుతికెక్కెడవళ్రిమంబునన్॥ ౧౩౬

వ. అనిపల్కి యమ్మహీధవు మంగళపరంపరాభివృద్ధిగా నాశీర్వదిం
చి వసిష్ఠుండంతర్హితుండయ్యె నాసమయంబుననెల్లి ప్రయాణం
బని భటులకు మనవీఁటఁజాటంబనుపుఁడనుచు మంత్రులకాజ్ఞా
పించి యభ్యంతరంబునకరిగి సమయ కృత్యంబులం బ్రవర్తించి
హంసతూలికాతల్పంబున ననల్పసుఖ సుప్తింజెందె నయ్యవస
రంబున. ౧౩౭॥

ఉ. రాజులనంతమీఁదరణ-రంగములోభుజవిక్రమంబునం।
జేజమణంపఁబూనెజగ-తీధవుఁడైవదిలీపుఁడాతఁడ।

వ్యాజతనింకనిప్రిఁదెలి-యంగలఁడంచుఁదొలంగనోయనన్।
రాజపుడేగఁబశ్చిమధ-రాధరసీమకునిర్గతాంశుఁడై॥ ౧౩౮॥

చ. రవియనురాముఁడంపసుక-రంబుగఁదత్సమయాంజనేయుఁడు।
త్సవమున నేగుదెంచిహిమ-ధామనిశాటహృతావలేపగా।
రవయుగుపద్మినీజనక-రాజకుమారికకింపువుట్టబాం।
ధవమునఁజూపుముద్రికయ-నందగ వేగురుచుక్కతూర్పునన్॥

చ. రవిచనుదెంచినంతనదు-రశ్ములణంగుననటంచుఁబశ్చిమా।
ర్ణవమునకీశుఁడేగగగ-నంబుననుండఁగనోడిభీతితో।
నవనికిడిగ్గమానవగృ-హంబులడాగినతారలోయనన్।
ధవళములైనిశాంతమునఁ-దప్పకనొప్పెనిశాంతదీపముల్॥౧౪౦॥

మ. తరిజ్వాలారితమోంబుపూరితసము-ద్యత్ప్రాక్ప్రతీచీమహీ।
ధరతీరాంచదజాండశైవలినిలోఁ-దారార్భుష వార్తిమల్।
దిరుగంగన్గొనిపార్తకట్టంబునసము-త్సేకంబుతో నుండిము౦।
దరదావైదినరక్తజాలమునసం-ధ్యాకాంతిపార్చిందగన్ ౧౪౧॥

లయగ్రాహి.—కమ్మవిలుకానిసమ-రమ్మునరథాంగవిహ-
గమ్ములువిశాలపులి-నమ్ములనుసమ్మో।
దమ్మునను దేలెమధు-పమ్ములుసరోజనిచ-
యమ్ములమరందముల-సమ్మతినిగ్రోలెన్।
నెమ్మినిశకుంతనివ-హమ్మునుగులాయసద-
నమ్ములనుబాసిగగ-నమ్మునను వేడ్కం।
ద్రిమ్మరుచుమోర్సెసర-సమ్ముగఁబటీర్వవిపి-
నమ్ములఁజరించుపవ-నమ్ములరుదెంచెన్॥ ౧౪౨॥

చ. వెలవెలఁబారఁగల్వలర-విందములించుకతోర్పఁజూపలో।
పలమునుజిక్కియున్న మధు-పప్రకరమ్ములకంతకంతకుం।

దెలివిఁ జెలంగెఁ దారకల-దృశ్యములయ్యెది నేఁడుఁ డింక రాఁ।
గలఁడని చీఁకువాల్ మెరయుఁ గైవడిఁ బుంజులుగా నెనయ్యెడన్॥

గ. చలువలు వేడ్క మీఱ వెదఁ-జల్లుచు వేఁకువమందచందనా।
చలపవమానముల్ సరభ-సంబుగ సోరనగళ్ళ వీవఁగాఁ।
బాలయలుకల్ త్యజించివిరి-బోఁటులు నెమ్మదిఁ దల్లడిల్లనా।
ధులభుజవల్లులం బ్రియము-తోడను గాఁగిటఁ జేర్చిరయ్యెడన్॥

చ. కువలయపీడ సేయఁగను-గొంకక చల్లనిరాజరశ్ములం।
దివిరి హరింపఁ బంకజత-తిం బ్రమదంబునఁ దెల్పఁ గోరి తా।
నవిరళదీప్తఁ జండకరుఁ-డల్లన వచ్చునటంచు భీతితో।
నవలికిఁ బోయెనో యనఁగ-నప్పుడ దృశ్యములయ్యెఁ దారకల్॥

శా. కాలజ్ఞస్వనమంతకంతకును ది-గ్భాగంబులం గ్రమ్మఁగా।
నాలోలోఁ గొనె నారదానియువబా-హాబంధనిర్ముక్తము।
గ్ధాళీకంకణనిక్వణాంచితకరా-బ్జాకర్షితప్రోల్లస।
త్కేళీగేహగరుత్క వాటజనిత-క్రేంకారమొక్కుమ్మడిన్॥ ౧౪౬

ఉ. చెంగలువల్ మఱుంగ సర-సీరుహముల్ విరియంగ జారత।
న్వంగులు భీతిలంగ సుహ-లందుఁ దమిం బ్రసమణంగఁ దారకల్।
నింగి దొలంగ జక్క-వల-నిండ్యరతిం గవలై చెలంగ నా।
శాంగణముల్ వెలుంగ నలి-నాప్తుఁడు చూడఁగ నొప్పెఁ దూర్పునన్

కం. అంతకుమును వందిజనా।
త్యంతసుధామధురవాగ్వి-తానము వలనన్।
స్వాంతం బలరఁ ధరిత్రీ।
కాంతలలామంబు మేలు-కాంచి ముదమునన్॥ ౧౪౭

గీ. కాల్యకరణీయములు శాస్త్ర-గతినిఁ దీర్చి।
ధారుణీసురులకు బహు-ధనము లొసఁగి।

రాజయోగ్యంబులైనట్టి-రత్నఖచిత।
భూషణంబులు దాలిచి-బుధులు వొగడ॥ ౧౪౯॥

సీ. రమణీయతనులిప్త-రక్తచందనచర్చ,
సంజకెంజాయతోఁ-సరసమాడ।
మస్తకవిన్యస్త-మాణిక్యమకుటంబు,
భానుబింబంబుతోఁ-బంతగింపఁ।
శైవల్లెవాటుగాఁ-బరఁగుబంగరుసాలు,
బాలాతపస్ఫూర్తిఁ-బరిహసింపఁ।
కర్ణాంతవిశ్రాంత-కమనీయనేత్రముల్,
వికచాంబుజములతోఁ-వియ్యమంద।

గీ. ధారుణీపతిసముపాగ-తప్రభాత।
చారుసారూప్యసౌభాగ్య-సరణిఁదనరి।
బంధుజననేత్రములకు సా-ఫల్యమబ్బ।
ముదముతోఁ వచ్చె నాస్థాన-సదనమునకు॥ ౧౫౦॥

చ. కవులొకచోటనొక్క-యెడ-గాయకులాశ్రితులొక్క-వైపు బాం।
ధవులొకచాయఁబండితవి-తానములొక్క-దెసం బ్రధానపుం।
గవులొకవంక సద్భటని-కాయము వేఱొకచక్కి-నుండఁగా।
రవమునఁగొల్వ నప్పుడుతి-రంబుగగద్దియనుండి వేడుకన్॥ ౧౫౧॥

సీ. వందిజనస్తుతి-వ్యాహారములు నుపాఱి,
సంగికుల్ సేయుప్ర-సంగములును।
సచివశేఖరులవా-క్చాతుర్యములను బ్రా,
బంధికుల్జదువుప్ర-బంధములను।
సాటిబాంధవులాడు-సల్లాపములను బౌ,
రాణికుల్సెప్పుపు-రాణకథలు।

గాయకగళస్వన-ద్గత గానరసములఁ,
పరిహాసకులవక్త్ర-భాషణముల।

గీ. వేదవేదాంతవిద్యావి-నోదములను।
మోదమును జెందిఝల్లరీ-నాదవిదిత।
భోజనావసరుండయి-భూవిభుండు।
మరలనభ్యంతరంబున-కరిగినపుడు॥ ౧౫౨॥

క. నవపల్లవములకన్నను।
వివరింపఁగ మృదువులగుచు-విలసిల్లుమహీ।
ధవునిచరణాంబుజంబులఁ।
బవడపుజిగిపావలొక్క-బాలికదొడఁగెన్॥ ౧౫౩॥

ఉ. అంతటనొక్క-కాంతదర-హాసముమోమునవంకురింపఁగా।
దంతపుచుల్కలింబడఁబ-దంపడిముత్తెపునత్తుమోవిపై।
గంతులిడంగఁబయ్యెదఁ-దగన్ సవరింపుచువిన్నవించెభూ।
కాంతునకయ్యె వేళజల-కంబునకంచుఁగలస్వనంబునన్॥ ౧౫౪॥

చ. మురువుగ వేత్రముల్ గొనుచు-ముందరఁగొందఱు సుందరుల్ బరా
బరులొనరింపఁగానుభయ-పార్శ్వములందనుపూగశాఖదో।
త్కరములనీడ నేగనొక-తన్వికరాంబురుహంబువేడ్కతోఁ।
గరమునఁబూనిభూవరశి-ఖామణిమజ్జనశాలలోనికిన్॥ ౧౫౫॥

క. చనిగాత్రోత్తతపీఠ।
మ్మున నుండఁగఁబసిఁడిపళ్లె-మున నొకవనజా।
వనమకుటప్రముఖాఖిల।
ఘనభూషణములుపడల్చి-గైకొననిడియెన్॥ ౧౫౬॥

మ. కరముల్ మిక్కిలి జేవురింపఁగుచముల్-కంపింపఘర్మాంబుసీ।
కరముల్ మైనుదయింపఁగంకణఝణ-త్కారంబురాణింపనె।

త్తరులాలిం బ్రభవింప నూర్పు లతిసాం-ద్రస్ఫూర్తి రెట్టింపఁగా।
నరనాథాగ్రణికిం దెఁ దైల మొక కాం-తారత్న ముత్కంఠచేఁ॥

చ. కనకఘటంబుతోడ నొక-కాంత నత్తామరసాభిషేకమో।
య్యనసన్నపమాళి మాళి నిహా-యల్ దగఁ జేయఁగ నొక్క-పద్మలో।
చన తన చేతులం జికుర-జాలము విప్పి వివల్చి కూర్చె నే।
ర్వ్యనముని గోళ్ళ నూనె పస-బోవఁగ దువ్వె వినమ్రహస్తయై॥౧౫౮॥

చ. కొమరుగఁ గొంద అంగనలు-గుంపులుగూడి కవోష్ణవారికుం।
భములొసఁగంగ నొక్క నవ-పల్లవపాణి కరంబు లెత్తిక।
క్షములరుచుల్ బయల్పడఁగఁ-జారుకుచంబులు నిక్కఁ జెల్వమై।
నమర నెరుల్ విడజ్జలక-మార్చె నృపాలున కింపు నింపుచున్॥౧౫౯

సీ. తడియొత్తె నొక చెల్వ-ధవళాంశుకంబున,
నొక కాంత కరములఁ-జికురమార్చెఁ।
గట్టంగ నొక లేమ-పట్టుపుట్టము లిచ్చెఁ,
గట్టెబొందున నొక్క-కలికి కొప్పు।
నిల్వుటద్దము దెచ్చె-నిల్చె నొక్క లతాంగి,
తిలక మొక్క వెలంది-దిద్దె నుదుట।
మంచిచందన మొక్క-మగువ మేన నలందె,
వీవెన నొక నీల-వేణి విసరెఁ।

గీ. జల్లెఁ బన్నీరు పైనొక-చంద్రవదన।
తొడవెఁ దొడవులు మైనొక-తోయజాక్షి।
కూర్చె నొక చెలి గళమునఁ-గుసుమదామ।
మొకపయోజాస్య పాదుక-లుంచె నెదుట॥ ౧౬౦॥

ఆ. ఈవిధంబున స్న-హీంవహుండంగ నా।
జనకృతోపచార-సరణిఁ దనరి।

తారకాకృతోఁ ప-చారభాసురుఁడైన।
చందమామతోటి-సాటిగాంచె॥ ౧౬౧॥

క. ఆతరువాతమహీతల।
నేతహితవారితమలర-నిర్మలహృత్కం।
జాతుఁడయిభుక్తిగృహమున।
కాతతగతినరిగికల్పి-తాసనుఁడగుచున్॥ ౧౬౨॥

క. ఈచందంబునసమ్మో।
దాచరితాహారుఁడగుచు-నంబువులోకరా।
కాచంద్రవదనబోయుఁగ।
రాచూలిచెలంగికృతక-రక్షాళినుఁడై॥ ౧౬౩॥

క. అనిపెఁడనమందిరంబున।
మునుపుభుజించినద్విజోత్త-ములనునిజనికే।
తనములకుదక్షిణలతో।
వెనువెంటనెకప్పురంపు-విడెములొసఁగుచున్॥ ౧౬౪॥

క. అంబురుహమిత్రకులర।
త్నంబైనదిలీపుఁడివ్వి-ధంబునసమ్మో।
దంబునఁదేలుచుచర్విత।
తాంబూలుండైనిజప్రప-ధానానుమతిన్॥ ౧౬౫॥

క పురవరణజనపదాంతః।
పురరక్షణములకుఁదగిన-పురుషులనుసమా।
దరముననునిలిపిధరణీ।
శ్వరుఁడయ్యెడఁగొంతతడవు-వారుందారున్॥ ౧౬౬॥

గీ. ప్రమదముననుండియాంగిక-ప్రముఖభావి।
జయనిమిత్తంబులకుసము-త్సాహియగుచు।

భేరి వేయించె దిక్కరుల్-భీతి బెదరఁ।
బృథ్వి కంపింప గగనంబు-బీటబార॥ ౧౬౭॥

క. అనవిని మనమున మోదం।
మ్మునఁ దేలుచు శౌనకాది-మునివర్యులు సూ।
తునిఁ గనుఁగొని యవ్వలికత।
వినయము దళుకొత్త మాకు-వినుపింపుమనన్॥ ౧౬౮॥

శా. సూతద్యోతమకణ్వకశ్యపఘటీ-సూనాత్మభూజాతభూ।
జాతాచారుతటిల్లతావృతవిరా-జన్నీలజీమూతజీ।
మూతాగారవిరించిముఖ్యసురసం-పూజ్యాంఘ్రికంజాతకం।
జాతాప్తాన్వయదుగ్ధవారిధిశర-త్సంపూర్ణజైవాతృకా॥ ౧౬౯॥

క. సాకేతపురవరప్రియ।
లోకస్తుతముదితజనక-లోచనకల్యా।
ణాకరసన్నుతవర్యా।
శ్రీకాంతాంశాభిరామ-సీతారామా॥ ౧౭౦॥

మాలిని. వినుతగుణకలాపా-వీతదైత్యావలేపా।
వననిధిభయదకోపా-వర్ధితోద్యత్ప్రతాపా।
ఘనతర[illegible]శ్లాపా-ఖండితాశేషపాపా।
మునినృపకులదీపా-మైథిలీహృద్యరూపా॥ ౧౭౧॥

గద్య — ఇది శ్రీజానకీరమణ చరణార్పిత మనశ్శతపత్ర హరితసగోత్ర
పవిత్ర కోటకలపూడి వేంకటరామపుత్ర విద్వద్విధేయ సరస
కవితాధేయ వెంకటకృష్ణనామధేయ ప్రణీతంబైన దిలీ
పచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

# దిలీపచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.




రఘుకుమారసరసవి।
చారామేరునగధీర-శశ్వత్సారా।
వీరాధివీరసారా।
చారానీరదశరీర-క్ష్మాజాజారా॥ ౧॥

గీ. అవధరింపుము శౌనకా-ద్యఖిలమునుల!
తోడనిట్లనిపలికెసూ-తుండుపద్మ।
జాండమీగతినిండిన-యవనివిభుని।
విజయభేరీనినాదంబు-వినిముదమున॥ ౨॥

ఉ. అంబరసీమ రాంకవను-ధారుణదీప్తులలంకరింపదా।
సాంబువులుర్వి పైబహుళ-మైప్రవహింఁపరదట్యతుల్ దిగం।
తంబులఁదెల్పులీనఘన-తుంగనిమావతులోలిఁదోలవ।
చ్చెంబురవీధులంగులవి-శేషములేర్పడఁగామదేభముల్ ॥ ౩॥

ఉ. ఆకసమందుఁ గేతనప-టాంచలముల్ చలియింపఁ బగ్గముల్।
గైకొని సారథుల్ నొగలఁ-గ్రాలి రథుల్ శరచాపపాణులై।
భీకరవృత్తితో నదుముఁ-బెంపు వహింపఁ దురంగమంబుల।
స్తోకజవంబునన్ నడలఁ-జూపఁ రథంబులు వచ్చెఁ జెచ్చెరన్॥ ౪॥

చ. గతులు సదాగతిం దెగడఁ-గాఖురనిర్దళితావనీరజః।
ప్రతతులు వానితండ్రిపయిఁ-బర్వ ఖలీనములూని సాదులు।
న్నతిఁ బయినొప్పఁగ న్గొనుజ-నంబుల కంబకపర్వమై తగం।
జతురత మీఱినయ్యెడకు-సైంధవముల్ చనుదెంచెఁ బెంపునన్॥ ౫॥

ఉ. ప్రాసగదాపరశ్వధకృ-పాణశిలీముఖపాతకుంతచా।
ణాసనభిండివాలక్షురి-ఘూంకుశతోమరముద్గరాదిసం।
త్రాసదసాధనంబులు క-రంబులఁ బూని పదాతులాహవో।
ల్లాసములాననంబులఁ జె-లంగఁగ వచ్చిరి పేర్చియార్చుచున్॥ ౬॥

సీ. కూర్చికట్టినపట్టు-కుచ్చులచాలు సం,
క్రందనకార్ముక-ప్రభలనీన।
డోలాంతరాంతర-కీలితరత్నముల్,
శక్రగోపములతో-సరసమాడ।
రాంకవపరివృతా-గ్రచలత్సువర్ణక,
లాపముల్ విద్యుద్వి-లాసమొసఁగఁ।
జతురవాహకముఖాం-చద్బ్రమహుంకృతుల్,
గర్జారవంబుల-గతిఁ జెలంగ।

గీ. వెలయుచారుతరాందోళి-కలను సన్ని।
విష్టులై వాహినీపతి-వృధులు ఘనత।
దోపజను దెంచిరాప్తక-లాపులలర।
విమతరాజనురాశముల్ - వెతను జెరల॥ ౭॥

ఉ. ఔదలలందుశోణసిచ-యంబులుగట్టిలతాంతమాలలా
హ్లాదముతోడఁజుట్టియొర-లన్మరలందెరలించినట్టిబల్
కైదువులెత్తిపట్టితమ-కంబునజేగురుబొట్టుబెట్టిప
త్తాదులువచ్చిరాహవవి-శారదులైపరువళ్లుద్రొక్కుచున్॥ ౮॥

మ. నవరత్నాంకితహేమవేత్రములుసం-ధ్యాకాంతులంజిమ్మఁగా
తవపుష్పాంకితకంచుకంబులుడుయు-క్తద్యోమతందాల్పఁగా
ధవళోష్ణీషములద్భుతంబుగనుజ్యో-త్స్నల్ గాయనానాచమూ
ధవులెన్నంజనుదెంచిరయ్యెడకును-త్సాహంబుతోఁగంచుకుల్॥

శా. శోణశ్మశ్రుసమావృతాతిభయదా-స్యుల్ కాననోర్వీధర:
క్షోణీసంచరణప్రవీణలసితాం-గుల్యాప్తబాణస్ఫుర
త్పాణుల్గండకఖడ్గకాసరమదే-భవ్యాఘ్రకంఠీరవ
శ్రేణీభీకరులేగుదెంచిరమిత-ప్రీతింగిరాతుల్డగన్॥ ౧౦॥

మ. కరవైడూర్యమణీమయోరువలయ-గ్రైవేయకాద్యుజ్జ్వలా
భరణశ్రేణులఁదాల్చిపైఁడియొరలన్-భాసిల్లుసంతాదిభీ
కరశాతాయుధముల్ధరించిసముద-గ్రస్ఫూర్తితోలోనికిం
కరులేతెంచిరిపల్లవస్ఫురదశో-కస్తోమహాకారులై॥ ౧౧॥

శా. కాలవ్యాళములట్లమూపులపయిం-గౌక్షేయకంబుల్దగన్
బాలేందుప్రభనుత్తమాంగములపై-భాస్వత్సితోష్ణీషము
ల్గ్రాలంజిత్రదుకూలముల్మెయినివ్యా-ఘ్రత్వగ్రుచిన్భాసిలన్
ఫాలాక్షాకృతులొప్పవచ్చిరెలమిం-బాశ్చాత్యులుద్యద్గతిన్॥

చ. తనచతురంగసైన్యసము-దాయములీగతినేలయీనిన
ట్లనుపమరీతిరానరవ-రాగ్రణికన్నులఁగాంచిచేట్కనె
మ్మనముననిండిపారఁగస-మగ్రగతింజరిపించెఁగ్రమ్మఱన్
ఘనజభవాండమద్భుతర-వంబునబీటలువారదుందుభిన్॥ ౧౩॥

శా. ఆభేరీరవమాత్తగహ్వరముల-న్వ్యాపింపఁగాఁ గాంచెనో।
ర్వీభృన్మందరముఖ్యసర్వశిఖరి-శ్రేణుల్ జనుల్మెచ్చున।
ట్లాభూభర్తససత్ప్రియత్నఘటితా-నంతోజ్జ్వలద్భేరికా।
లాభోత్సాహములం బ్రతిధ్వనుల దే-లం జేసెనో కుమ్మడిన్॥ ౧౪॥

శా. పౌరుల్ జానపదుల్ తనూన్నతులవి-భ్రాంతాత్ములై చూడ ఘం।
టారావంబులజిక్కురుల్ బెదరఘం-టాశీకరాక్రాంతమై।
తారామార్గము రాజిలన్ మహిమదా-ర్ద్రంబై ప్రకాశింపనం।
బారీపట్టపుటేనుగుల్ విభవమొ-ప్పన్ వచ్చెనచ్చోటికిన్॥ ౧౫॥

చ. తరఁగలపోల్కి ఫేనసము-దాయములన్ ఖగరాజుపోల్కిఁబ।
క్కెరలనుపక్షయుగ్మములఁ-గేవలలంఘననైపుణిన్ మృగో।
త్కరములపోల్కిఁ బాదదళి-తక్షితిధూళులగాడ్పుపోల్కెసు।
స్థిరముగఁ దెల్పుచున్ జూలుమ-తీలవిహావులువచ్చెఁ జెచ్చెరన్॥ ౧౬

మ. విలసత్కాంచనకింకిణీరవములా-విర్భూత నేమిధ్వనిం।
గలయన్ వాజిఖురోద్ధతక్షితిపరా-గంబుల్ ధ్వజశ్రేణితో।
జలముక్పద్ధతినంటసారథులయు-త్సాహంబుతో సైంధవం।
బులు రారత్నమయంబులైనయరదం-బుల్ ధోఁచెనత్యున్నతిన్॥

గీ. తనకధిష్ఠింపఁదగినమ-తంగజములు।
సైంధవంబులురథములీ-చందమునను।
నికటమునవచ్చినిలచిన-నృపతివాళి।
శుభముహూర్తావసరమున-విభవమెసగ॥ ౧౮॥

శా. భేరీముఖ్యవిశేషవాద్యరవముల్-పృథ్వీసురాశీర్వచ।
స్స్వారస్యంబులువందిపుంగవులవా-క్చాతుర్యముల్వాజిహే।
షారావంబులిభేంద్రబృంహితములు-త్సాహంబుపుట్టింపఁగాఁ।
దేరెక్కెన్ నరనాయకుండుచితకీ-ర్తిన్ సైన్యముప్పొంగఁగన్॥

సీ. చటులారిమదతమస్స-పటలంబులు దొలంగ,
బుధలోచనోత్పలం-బులు చెలంగ।
భటచకోరములు తా-పమును బాసికనంగ,
వైరిచక్రములగ-ర్వంబణంగ।
కీర్తిచంద్రికలు ది-గ్దేశంబులఁ జెలంగఁ,
ప్రజలు సమ్మోదనీ-రధిమునుంగఁ।
బరివృతవాహినీ-శ్వరులు పొంగఁ దొణంగ,
మూర్ఖమనస్సపద్మ-ములు ముణుంగఁ।

గీ. బండితస్తుతమైనిజ-మండలంబు।
భాసిలంగను బూర్వాద్రి-పైనిదనరు।
చందురునిపోల్కె-సుందర-స్యందనమున।
నధివసించిన నరాధిపు-డలరెనపుడు॥ ౨౦॥

మ. హరిదీక్షుండనిదిగ్జిగీషుతనుగాం-డాళిఙనుంగల్చిమ।
ద్వరరాజ్యంబునిజప్రతాపశిఖికీ-తండిచ్చునోయంచుభూ।
వరునిన్వహ్నియనేకరూపములఁగొ-ల్వన్వచ్చినాఁడోయనం।
గరదీపంబులు తేరుచుట్టునున సం-ఖ్యఖ్యాతితో భాసిలెన్॥ ౨౧॥

ఉ. సారసలోచనల్ గనక-సౌధములెక్కఁగ వాత్మపద్ధతిం।
గోరిక మీరఁజూడనను-కూలగతిం జయభేరి మ్రోయ హే।
షారవబృంహితధ్వనుల-సైన్యములుత్సవమంద వేడ్కతో।
సారథి తేరుమందగతి-సాగఁగనిచ్చెఁబురంబులోపలన్॥ ౨౨॥

మ. మతిదోషాకరులైనరాజులవధిం-పంబూనియేతెంచుభూ।
పతి నోజం బలిభిక్షుకైయనుసరిం-పన్వచ్చునక్షత్రసం।
తతులట్లింతులు మేడలెక్కి చెలువం-దంజల్లుముక్తాఫల।
ప్రతతుల్ లాజలుకోరకావళులుఁబు-ష్పవ్రాతముల్ భాసిలెన్॥

చ. గమనరయంబయత్నముగఁ-గట్టినగ్రంథిసడల్పఁజన్నులం।
దమరినకంచుకాంచలము-లాడుచునుండనృపాలుఁజూడహా।
ర్మ్యముతుదకొక్క-బోటిజన-నచ్చటికొమ్మలుజూచిపెక్కులం।
దముగధరించివచ్చెనని-నవ్విరియవ్విరిబోడినయ్యెడన్॥ ౨౪॥

ఉ. పెట్టియుఁదత్తరంబునను-బెట్టనికాటుకలోచనంబులం।
జుట్టియుసంభ్రమంబునను-జుట్టనిపూవులదండకొప్పునం।
గట్టియుజారకుండఁగను-గట్టనిచేలమెయింజెలంగఁగా।
గ్గుట్టసియాడుచుండనొక-కోమలివచ్చెనరేశుఁజూడఁగన్॥ ౨౫॥

శా. మంజీరధ్వనికైమరాళములుస-మ్యక్ప్రీతితోవచ్చినీ।
య్యంజంజుట్టుకొనంగఁజొచ్చెఁగనుగొ-మ్మంచున్వచోనైపుణిన్।
ముంజేతందగుచిల్కదెల్పఁదెరవా-మోదంబుతోఁజూచుచుం।
గంజాతాననయోగనొక్కతెమహీ-కాంతున్విలోకింపఁగన్॥

మ. తమకాసేచనకంబులౌటఁబురకాం-తారత్నముల్ధారుణీ।
రమణాగ్రేసరుసింహసంహననతల్-రాగంబుతోఁజాలమా।
ర్గములంగన్నులఱెప్పపాటులతిదూ-రంబైచనంజూచిరు।
త్తములంజూచినమాత్రలోననిమిష-త్వంబబ్బదేయేరికిన్॥ ౨౭॥

చ. శయములఁహేటలాజలను-జల్లుచురాగముతోడనొక్కక।
న్నియఘనసౌధజాలసర-ణిన్ధరణీశుతనూవిలాసనం।
చయములఁజూచిచిత్రవిల-సత్ప్రతిమాకృతినుండెసాత్వికో।
దయసమయంబునందితర-తంత్రములన్మతిసంచరించునే॥ ౨౮॥

శా. సంజాతప్రమదంబుతోనపుడుభా-స్వన్మల్లికామంజరీ।
పుంజంబుల్గురుమౌక్తికంబులుఁగరాం-భోజంబులంజల్లివే।
డ్కంజూచెంగనకాంగియోర్తుధరణీ-కాంతేందునిన్నేత్రజీ।
వంజీవంబులుతృప్తిఁజెందనితర-వ్యాపారముల్మానుచున్।

ఉ. మొల్లము గాఁ బ్రసూనములు-మందరఁ గొందర మంద రాగులై।
హల్లకపాణులిందుమణి-హర్మ్యములెక్కి-యశేషము న్మహీ।
వల్లభుమీఁదఁ జల్లమగు-వల్మతిఁ గొందఱు వచ్చి కన్నులం।
జల్లిరి లేవుఫువ్వులని-సందియమందక చూపుకల్వలన్॥ ౩౦॥

చ. శకునము గాదు రాజు కని-సందియమందఁగ నేలనీకుఁదా।
వకకరదీప్తి చేనరుణ-వర్ణములీ నవలయ్యె మారుఁడై।
ప్పకవినుమంచు నెచ్చెలిజ-పాస్ఫటికంబులరీతిఁ దెల్పఁగా।
వొకచెలి ముగ్ధ గావునన్య-పోత్తము పైనొగిఁ జల్లెఁ గ్రొవ్విరుల్॥ ౩౧॥

క. లలనామయంబులై చె।
న్నలరారెన్ సౌధసముద-యంబులు సేనా।
కలితములై పురవీధులు।
వెలసెన్ నృపమౌళి దండు-వెడలిన వేళన్॥ ౩౨॥

సీ. గజతురంగంబులఁ-గని భీతిమరలిన,
కామినులకు వ్రజ-త్కాముకులకు।
సేనఁ దప్పక చూచు-మానవులకుఁ దద్భ,
జములూతఁ గొని చూచు-జవ్వనులకు।
అధిపుఁ జూడఁ బరస్ప-రాంగమేళనము గాఁ,
జనుదెంచు జారిణీ-జారులకును।
కాయంబులొక్కటి-గా వచ్చి గట్టిగ,
భిత్తిఁ బెనగు వీటి-విటజనులకు।

గీ. రహిని భావప్రబోధకా-రణములైన।
¶స్పృష్టకము §విద్ధకంబును-$ఘృష్టకంబు।
*పీడనంబనుసంజ్ఞలఁ-బ్రాధివిఁ బరఁగు।
గూఢపరిరంభములు చెల్లెఁ-గోర్కెలలర॥ 33॥

## ఈయాలింగనములకు లక్షణము.

¶క. ఎదురైమానిని దేహం।
బెదురైయొకవంక పనికి-నేగెడు పురుషుల్।
గదిసి తొలంగుట స్పృష్టక।
మదియని చెప్పుదురు రసికు-లాలింగనముల్॥

§క. ఒకవంకఁ జూచి విభునో।
ర్వకడగ్గిరి కాఁగిలించు-వనితను వాఁడో।
డళకాఁగలించునదివి।
ద్ధకమను నాలింగనంబు-దానై వెలసెన్॥

$*క. యానోత్సవతిమిరంబుల।
మేనులు సోకుటయుఁ బతికి-మెలతకఘృష్టం।
బైనెగడెగోడనెత్తం।
గానదియే పీడనాఖ్యఁ-గాఁగిలియయ్యెన్॥

శా. వాతోద్ధూతసమున్నతధ్వజపట-వ్రాతంబరాతిక్షమా।
నేతృప్రోజ్జ్వలరాజ్యలక్ష్ములసము-న్మేషంబుతోఁ బిల్వసం।
ఖ్యాతీతాహవభీకరప్రబలనా-నానీకముల్ గొల్వఁగం।
జాతాప్తాన్వయరత్నమే గఁదొలుతం-జంభారిగుప్తాశకున్॥ ౩౪॥

చ. ఇలచతురంగభారము స-హింపఁగ లేనని తా జలానలా।
నిలములతోడఁగ ర్తయగు-నింగికిఁ దెల్పఁగ నేగనోయనం।
జెలఁగెఁ బరాగమయ్యెడన-శేషగజోత్కరశీకరాసిరు।
క్ప్రలదురు కేతనాంశుకల-సత్పవనంబులతో నభంబునన్॥ ౩౫॥

చ. తురగఖురోద్ధతంబగుచు-ధూళిక్రమంబున నాకసంబుపై।
కరిగిన నేలదాఁబలచ-నై చెడునంచుఁగృపం బరాగము।
ప్పరిజనియింపకుండఁదడు-పం జను దెంచుఘనాళులో యనం।
బరఁగెను సేనమత్తగజ-పఙ్క్తులువర్షితదానవారులై॥ ౩౬॥

శా. క్ష్మానాథుండరికోటినింద్రపురికం-పంబూనినిర్జించుసా।
పౌనవ్రాతములో యనంగనునభగ్గ-పర్యంతమంతంతకున్।
నానావైఖరులంగ్రమక్రమతవి-న్యాణంబుగాభీషణా।
జ్యానేయోంతుఖురోద్ధతక్షితిరజ-శ్చక్రంబులొప్పెంగడున్॥ ౩౭॥

సీ. మదవాసనాగత-మధుకరశ్రేణుల,
సమధికంబైనవ-సంతగుణము।
వితతనిశ్వాసమా-రుతసముద్ధతపరా,
గములభీకరమైన-ఘర్మగుణము।
ధారాధరాసితో-దారదేహములచే,
ర్తికిఁజల్లనైనవా-ర్షికపుగుణము।
విశదదంతచ్ఛవి-విమలచంద్రికలను,
రమణీయమైనశా-రదపుగుణము।

గీ. కరసముద్ధూతశీకరో-త్కరతుషార।
గతుల హేమంతగుణము మాం-గల్యగతుల।
శిశిరగుణమొుగిఁదమయందుఁ-జెన్నుమీర।
నడచెమాతంగఘటలుసై-న్యములలోన॥ ౩౮॥

చ. పసచెడదుందుభిప్రబల-భాంకృతిబీటలువారకుండనా।
కసమునకున్ స్ఖురత్తురని-కాయసముద్ధతధూళిపూ-తగా।
నోసఁగుచుధారుణీపతిచ-మూదధిలోపలసైంధవాఖ్యలు।
ల్లసిలఁగ ఫేనదీప్తులఁజె-లంగెఁదురంగతరంగసంఘముల్॥ ౩౯॥

ఉ. ఆకసమందుఁ గేతనప-టాగ్రసముద్భవమారుతాహతిన్।
నాకధునీసువర్ణ నలి-నవ్రజచారుపరాగముల్ సము।
త్సేకముతోడఁ బర్వఁడ-చెన్ రథముల్ పరిపంధిలోకహృ।
ద్భీకరతం బదాతులువి-ధేయగతిన్ వెనువెంట నేగఁగన్॥ ౪౦॥

ఉ. భానుకులీనుఁ డీఁగతి న-పారబలంబులతో మహానదీ।
కాననభూమభృద్విషమ-కంటకదుర్గమమార్గసీమలం।
దానపుడప్రయత్న సము-దంచితవృత్తినతిక్రమించుచున్।
సేనలకెల్లఁ దెల్లముగఁ-జేసెనమానుషసైజనైపుణిన్॥ ౪౧॥

ఉ. మానవనాథశేఖరుఁడు-మార్గసమీపపురస్థితావనీ।
జానులచేనమూల్యమణి-సంఘములం దపనీయరాసులం।
గానుకగాఁగఁ గొంచుఁ గ్రము-కప్రముఖద్రుమషండమండితాం।
భోనిధితీరభూములఁ జ-మూయుతుఁడై విడిసెన్ముదంబునన్॥ ౪౨॥

చ. తురగతరంగసంఘముల-తోడ రథోడుపపఙ్క్తి-తోడ సిం।
ధురధరణీధరప్రతతి-తోడఁ బదాతిసమూహవాగ్రివో।
త్కరములతోడ శౌర్యరస-గర్వితమై పరివార్ధిరీతి భూ।
వరునిబలంబు భాసిలెను-వారిధితీరసమీపభూములన్॥ ౪౩॥

క. రంగత్తుంగతరంగతు।
రంగంబులతోడ శరప-రంపరలలరన్।
సంగరమున కంబుధినృప।
పుంగవుపైఁ బ్రతిఘటించు-పోలిక దనరెన్॥ ౪౪॥

సీ. ధరణీధరాధిప-తనయాభిరామమై,
తారాద్రికైవడిఁ-దనరుదాని।
మకరకుళీరాది-మహితమై నీరదా,
యనముచందంబున-నలరుదానిఁ।

బ్రబలానిమేషప-రంపరాభరితమై,
విబుధలోకమురీతి-వెలయుదాని।

సర్వతోముఖమహా-సంపత్సమృద్ధమై,
యలకాపురముపోల్కెఁ-జెలఁగుదానిఁ।

గీ. బ్రస్ఫురత్కంకణోర్మికా-భాసమాన।
మగుచులక్ష్మీకరంబట్ల-తగినదాని।
వారిరాశినిజాచిఘూ-ధరునిలోడ।
నలరుచునన ర్మసచివుఁడి-ట్లనియెనపుడు।। ౪౫।।

చ. హరునకుఁదూణమయ్యె శయ-నాలయమయ్యెను శౌరికిందిరా।
తరుణికిశీతరశ్మికమృ-తంబునకుద్భవభూమియయ్యెను।
ర్వరకుదుకూలమయ్యె మణి-రాసులకాకరమయ్యె నాపగో।
త్కరములకీశుఁడయ్యె వసు-ధావరకన్గొనుమీమహోదధిన్ ౪౬।।

శా. గాంగేయాంబుజషండమండితసమ-గ్రవ్యోమగంగాపరి।
ష్వంగార్ద్రోర్వతలప్రసారితసర-స్వద్బాహువిభ్రాంతికృ।
ద్రంగత్తుంగతరంగసంఘసముదీ-ర్యత్కంకణంబుల్ నభ।
స్సాంగత్యంబువహించిచెన్నలరున-క్షత్రస్వరూపంబులన్।।౪౭।।

క. తరమే వినుతింపన రే।
శ్వరతావకపూర్వులైన-సగరసుతులచే।
ధరనభివృద్ధిం జెందిన।
శరధిమహీపరిధినిగమ-సైంధవశరధిన్।। ౪౮।।

క. పర్వములందీజలనిధి।
నిర్వక్రగతిన్ మునింగ-నేనియునరుఁడా।

సర్వంసహాభ్రముగనుసు।
పర్వండైయుండుదివిజ-పతిలోకమునన్॥ ౪౯॥

క. వినఁడీవననిధిమునిఁగిన।
మనుజుఁడుదిననాథతనయ-మత్తమహిషకం।
తనిబద్ధాయసజగతీ।
జనభీకరగంటికావ్ర-జధ్వనులన్నృపా॥ ౫౦॥

క. పాకాసురారివజ్రముఁ।
గైకొనిరోషంబుతోన-గంబులజెక్కల్।
బోకార్చుసమయమునమై।
నాకాద్రినిగాచెనీవ-నధిమనుజేంద్రా॥ ౫౧॥

క. పరమపవిత్రము లైమహిఁ।
బరఁగినతటినీప్రవాహ-పటలంబులకా।
కరమీరత్నాకరమని।
హరిరమతోనుండునిందు-నతిమోదమునన్॥ ౫౨॥

క. నాళీకాప్తాన్వయపా।
తాళంబుననుండిధరకు-ధరనుండియుఁబా।
తాళంబునకేగభుజం।
గాళులకీజలధిమార్గ-మైవిలసిల్లున్॥ ౫౩॥

క. ఒకదెసఁ గమఠము లురగము।
లొకదెసనొకదెసను ఝషము-నొకదెస నసురుల్।
మకరములొకదెస బాడబ।
మొకదెసఁబీడింపనీప-యోధిసహించున్॥ ౫౪॥

క. జను లెన్న మహీతాపం।
బనుకూలం బైన వృష్టి-నణఁగింపుచుఁదా।
ఘనతం గనె మేఘుండీ।
వనధిపయఃపానపటిమ-వలన నృపాలా॥ ౫౫॥

క. గాంభీర్యంబున శమమున।
శుంభత్కారుణ్యమునను-శుచితను గణనా।
రంభమునకుఁ బ్రథమం బీ।
యంభోనిధి దీనిసాటి-యవనిం గలదే॥ ౫౬॥

క. నరవర బహుజీవుల కా।
కరములయి చెలంగుచున్న-కాండములు నిజో।
దరమున నుండఁగ దామో।
దరునిగతిం దగుపయోధిఁ-దరమె నుతింపన్॥ ౫౭॥

చ. అనివచియింప నర్మసచి-వాగ్రణిఁ జూపుల యాదరించి యా।
జనవరమాళి కొన్నిదివ-సంబులు తజ్జలరాశితీరభూ।
మినివసియించి సుహ్మ్నల స-మిద్ధరణిం దెరలించి వారిచేఁ।
గనకదుకూలరత్నములు-గైకొనెఁ దా నభయం బొసంగుచున్॥

క. ఆతరువాత నసుహ్మా।
క్ష్మాతలపతిదర్శితాగ్ర-మార్గుఁడగుచు ను।
ద్యోతాన్వయమణి సేనా।
న్వీతుం డై చనియె వంగ-విషయంబునకున్॥ ౫౯॥

క. జనవరుఁ డీగతి జని రయ।
మున నొకరమ్యప్రదేశ-మునఁ బ్రబల పతా।
కినితోడ విడిసి వంగా।
వనినాయకుకడకు భాను-వంశ్యం డెలమిన్॥ ౬౦॥

క. చారుతరవచనరచనా।
పారీణుండైనదూతఁ-బనిచిన నుచితా।
కారుండైయతఁ డావసు।
ధారమణునిపాలికరిగి-తగనిట్లనియెన్॥ ౬౧॥

చ. రిపుఘనగర్వభంజన ధు-రీణతనొప్పు మహాబలంబుతో।
విపులపరాక్రమాన్వితుఁడు-వీరవరుం డసహాయశూరుఁ డా।
నృపమణియాదిలీపుఁ డవ-నింగలరాజులగెల్చి కప్పముల్।
నిపుణతతోడఁగైకొనఁగ-నెమ్మదియందుఁదలంచిగ్రక్కునన్॥

చ. నిజనగరంబుఁగావఁ దగు-నేర్పరులన్నియమించి వాజి సా।
మజరథవీరపుంగవ స-మాజముగొల్వఁగ మార్గమధ్య భూ।
భుజుల ననింజయింపుచు వి-భుత్వముమీరఁగ వారిచే మణి।
వ్రజముకరంబుగాఁగొనుచు-వచ్చి భవన్నగరంబుచెంగటన్॥

క. డంబుగవసించె నొకర।
మ్యంబైనప్రదేశమున మ-హాసైన్యముతో।
నంబరతలచుంబిసము।
గ్రాంబరగృహధవళి తాఖి-లాశాంతరుఁడై॥ ౬౪॥

క. భీకరభేరీపటహర।
వాకర్ణనమున మహీస-మగ్రపరాగా।
లోకనమునమీరన్న వి।
వేకించితిరింక విన్న-వింపఁగ నేలా॥ ౬౫॥

క. ఆయవనిపుఁడప్రతిహత।
సాయకుఁడైరాజనీతి-సరణిం బ్రథమో।
పాయంబున నీచేతను।
పాయనములుగొనఁదలంచి-పంపెనునన్నున్॥ ౬౬॥

గీ. సంగరమురిత్తబహుజన-క్షయమునకును।
గారణంబని నన్ను మీ-కడకుఁబనిచె।
నలవియేపూనిదిగ్విజ-యంబునకును।
సైన్యములతోడనడువ సా-మాన్యనకును॥ ౬౭॥

క. ఆరాజవహాళి యుగ్రా।
కారుండై భీషణాంబ-కస్ఫుర దమలో।
దారజ్వాలల శాత్రవ।
వీరాతనుగర్వమణఁచి-వెలయుటయరుదే॥ ౬౮॥

వ. కావున. ౬౯॥

ఉ. ఆమనుజేంద్రచంద్రుఁడుబ-లాఢ్యుఁడుతామసమాప్తిఁబూని సం।
గ్రామముఁజేసినం జయము-గల్గదు పాయనమిచ్చివేడినన్।
క్షేమమునీకగున్ భువి న-జేయపరాక్రములైనవైరులు।
ద్దామతనెత్తివచ్చినఁ బ్ర-ధానముదానముగాదె స్థాయికిన్॥ ౭౦॥

ఉ. అంబురుహారిత్తిగ్గకరు-లానరనాయకవహాళికీర్తిశౌ।
ర్యంబులకుం గరంబులు క-రంబులుగాఁగనొసంగి విష్ణుపా।
దంబెశరణ్యమంచు సత-తంబుఁజరింపుచునుండ వారివం।
శంబులఁబుట్టినట్టి నృప-సత్తములాతనియెత్తువత్తురే॥ ౭౧॥

మ. అనిపల్కన్ వినిభానుమంతుఁడు సను-ద్యత్క్రోధుఁడై మీనరే।
శునకుం దక్కినరాజులట్ల ధనరా-సుల్ దెచ్చికైకొమ్ము పా।
యనమంచుంబలుకంగఁజాల విను శ-స్త్రాస్త్రంబులే మాకిలన్।
ధనముల్ రేపటితెచ్చియిచ్చెదము సి-ద్ధంబేగుమీ నీవిఁకన్ ౭౨॥

ఉ. భావిపరాభవంబుఁ దన-భావములోఁదలపోయలేక వం।
గావనినాయకుండు దుర-హంకృతిసంయుతుఁడై దిలీపగో।
త్రావిభుతోడమార్కొని దు-రంబొనరింపఁగ నిశ్చయించె గ।
ర్వావిలుఁడైనమర్త్యుఁ డుచి-తానుచితంబు లెఱుంగ నేర్చునే॥

క. ఆనరపతిమాటలువిని।
భానుకులోద్భవునిఁజూడఁ-భండనమునఁ గీ।
డౌనని తెలపినవిసఁ డీ।
మానవనాయకుఁడటంచు-మరలిరయమునన్॥ ౭౪॥

క. వినిపించెదూత వంగా।
వనివల్లభుఁడాడినట్టి-వాక్యములెల్లం।
దనకధిపతియైన దిలీ।
పునకందరువినఁగ రోష-భూషితుఁడగుచున్॥ ౭౫॥

క. నికటన్నివిష్టచమూనా।
యకులంబకములనుబూని-రరుణిమ నీపో।
లిక రిపురక్తములమదం।
బకములుననిశోణరుచులఁ-బరఁగుననుగతిన్॥ ౭౬॥

శా. ఆమాటల్ విని భానువంశజుఁడు సా-హంకారుఁడై రేపు సం।
గ్రామక్షోణిని భానుమంతుని సమ-గ్రస్ఫూర్తిమాయించి సు।
త్రామాదిత్రిదశుల్ నుతింపఁగ నితాం-తప్రీతితోఁ దద్యశ।
స్తోమంబెల్లను మద్వరూథినుల కి-త్తున్ వీరపాణంబుగన్॥ ౭౭॥

క. కావునమీరుబలంబుల।
తోవేగమె సమరమునకు-దోర్బలమెసఁగన్।
రావలెననుచు నిజధ్వజి।
నీవరులకుఁదెలిపి ధారు-ణీవరుఁడంతన్॥ ౭౮॥

శా. లోకాలోకకుభృద్గుహాంతరశయా-ళువ్యాఘ్రసింహంబు ల।
స్తోకవ్యగ్రతఁజెందికుందఁగ హరి-చ్ఛుండాలముల్ భీతితో।
నాకంపింపుచునుండ నంబురుహగ-ర్భాండంబు భేదిల్ల ను।
త్సేకంబాత్తఁజలంబుజెందఁ జరిపిం-చెన్ భేరి సక్రోధుఁడై॥

క. ఆదుందుభిసుమహాధ్వని।
మోదముతో విని చమూస-మూహము గర్జా।
నాదంబాలించిన కా।
కోదరభుక్తిగతిని స-ముత్సుకమగుచుఁ॥ ౭౦॥

శా. హ్రేషారావములందెసల్ బగుల న-క్షీణక్షురప్రోద్ధమ।
జ్వాలాజాలములన్నభంబునెర సం-జందాల్పఁ బాదాహతిన్।
భూలోకంబుచలింపుచుండఁ బ్రళయాం-భోరాశిపోల్కిన్ సము।
ద్వేలంబైయరుదేరనాబ్బరిని ధా-త్రీనాథుఁడీక్షింపుచున్॥ ౭౧॥

సీ. నవరత్నకీలిత-నానాప్రదేశము,
జ్వలబాలభానుమం-డలనిభంబు।
దృఢతరచక్రాగ్ర- దేదీప్యమానమ,
ప్రతిఘాతశస్త్రాస్త్ర-భాసురంబు।
కాంచనకింకిణీ-గణరవోపేత ము,
త్తమసితానేకసైం-ధవయుతంబు।
ఘటితసింహధ్వజ-గంధ్దూషితాభ్రమా,
యసయుగదండ స-మంచితంబు।

గీ. విజయలక్ష్మీప్రపద్మంబరి-వీరలోక।
భీకరంబఖిలాయుధా-భేద్య మతులి।
తంబు రథచోదకాలంకృ-తంబునైన।
తేరధిష్ఠించెమనువంశ-దీపకుండు॥ ౭౨॥

శా. ఆకారంబులుపూనితోడుపడు శౌ-ర్యవ్రాతమోనా నిజా।
నీకాధీశ్వరులుత్తమాశ్వరథ దం-తిశ్రేణులం దెక్కి యా।
స్తోకస్ఫూర్తులతోడఁదోనరుగ వం-దుల్ మాగధుల్ నైజవి।
ద్యాకౌశల్యములన్ననంబునకు ను-త్సాహంబు రెట్టింపఁగన్ ౭౩॥

సీ. శంఖ మృదంగ ని-స్సాణ వీణా వేణు,
కాహళఘనరవా-కర్ణనమున।
దక్షిణాంచద్భుజా-దండవిలోచన,
గండస్థల స్తన-కంపనమున।
మాతంగ వారాంగ-నాతురంగమ మయూ,
రోత్సుకన్యాగోని-రీక్షణమునఁ।
బరిబలాభియాతి ని-ర్దళనకౌతూహలా,
లంకృతధ్వజనీశ-లపనములను।

గీ. శశ్వదనుకూలవాయుసం-చారములను।
భూసురాశీర్వచోబల-స్ఫురణములను।
వామభాగ వ్రజత్పక్షి-వరునివలన।
నిశ్చితాశ్రమవిజయుఁడై-నెగడిచనియె॥ ౮౪॥

క. చనిచని యొకవనభూమిని।
మనుజేశుఁడువిడిసె బలస-మాజముతోఁ జ।
ల్లనిగాడ్పులు మార్గాటన।
జనితాయాసములనణఁప-సమరోన్ముఖుఁడై॥ ౮౫॥

క. చారులవలన దిలీపా।
స్మారమణుని రాకవినుచు-సంగరమునకుం।
బోరాదని నిజమంత్రులు।
వారింపఁగ వినక కినుక-వంగాధిపుఁడుఁ॥ ౮౬॥

మ. చతురంగంబుల నాయితంబగుచు రాఁ-జాటించి నానాచమూ।
పతులంబిల్వఁగబంచి బాంధవులతో-బద్ధాంగుళిత్రాణ తూ।
ణతనుత్రాణకృపాణుఁడై దురభిమా-నంబాత్మనుప్పొంగ ను।
ద్ధతుఁడౌచుఁ రథరాజమెక్కి-చనె యుద్ధక్షోణికింగ్రక్కునఁ॥

క. చూడఁగవచ్చిన పౌరుల।
తోడను జానపదతతుల-తోడం గడిమిం।
గూడుకొనిపోగడఁదగి యా।
మేర్డితమైవంగభూప-రిపుఁడని సేనల్॥ ౨౨॥

చ. బెడిదముగాఁగ భేరి జరి-పించుచు సంగరకౌతుకంబునం।
బుడమివణంకునట్లుగను-భూరిబలంబరుదేర వంగరా।
జెడనెడదుర్నిమిత్తము ల-నేకవిధంబులఁదోఁచుచుండఁగాఁ।
బొడఁగనియుం దిలీపనృప-పుంగవుపైనిటులేఁగె వేగునన్॥

క. విభవమునఁబ్రతిఘటింపఁగ।
నుభయబలంబులు సమిత్స-ముత్సుకతఁదగన్।
నభమదియఘూర్ణిలుచునుభ।
ప్రభూదయంబుననుబొంగు-పాథోధులనన్॥ ౨౪॥

సీ. మత్తమాతంగస-ముత్తుంగనగముల,
రంగత్తురంగత-రంగతతుల।
గాంగేయఘటితశ-తాంగోడుపంబుల,
విక్రమాన్వితభట-నక్రములను।
దివ్యాస్త్రబాడబ-హవ్యభుగ్జ్వాలల,
శాతకృపాణభు-జంగమముల।
వరవళక్షధ్వజ-వస్త్రఫేనముల మ,
హాహవౌత్సుక్యప్ర-వాహములను।

గీ. జూడఁదనరారి యొండొంటి-తోడనప్పు।
డుభయసైన్యంబులు ద్వేల-రభసమునను।
మార్కొనెలయావసరజృంభ-మాణపూర్వ।
పశ్చిమోద్వృత్తపయోధుల-పగిదిఁగణఁగి॥ ౨౫॥

క. దివికయ్యెడ వడి నెగసిన
వివిధబలోద్ధత పరాగ-వితతులు వేడ్కన్
బవరముఁ గనవచ్చిన వా
సవముఖ్యామరుల కనిమి-షత్వము మాన్పెన్॥ ౯౨॥

క. మహిసమరోద్ధతిసర్వం
సహయయ్యును దా సహింపఁ-జాలక దివికిన్
బహుముఖములఁ జనునో యన
రహి నెగసెన్ భూరజఃప-రంపర లెలమిన్॥ ౯౩॥

క. భానుఁడు మహీరజస్స్వ
ర్భానునిచేఁ బొదువఁబడి ప్ర-భాచ్యుతుఁడైనన్
సైనికులు సాంధ్యపారా యాం
బోనిధిలో నోలలాడఁ-బూనిరి కన్గొనఁకన్॥ ౯౪॥

క. రౌతును రౌతు పదాతిఁ బ
దాతిని రధికుండు దామ-దంబున రధికున్
మాతంగారోహకుని
మాతంగారోహకుండు-మార్కొనిరాజిన్॥ ౯౫॥

మ. స్ఫురదూరుద్వయసంజ్ఞలన్ ధరణి సం-క్షోభంబులం జెంద ఖే
చరులెల్లన్ వెరఁగొంద నాశ్వికులొగిన్-సవ్యాపసవ్యంబుగా
హరులం ద్రిప్పుచు ఖేటకంబుల సమా-యాతాసిఘాతంబులన్
మరలం జేయుచుఁ బోరి రాహవకలా-స్వాదంబు రెట్టింపఁగన్॥

ఉ. కెంపువిలోచనంబులను-గీల్కొనసంగరకౌతుకంబు రె
ట్టింపఁగ ఘోటకంబుల న-టింపఁగఁ జేయుచు రౌతులందరుం
దెంపున వాడికైదువులు-ద్రిప్పుచుఁ బోరిరి యంత్రధారుఁ డా
డింపఁగ నాడుబొమ్మల క-డిందిమగంటిమిఁ బూనియింపునన్॥

మ. తురగారూఢులకయ్యెనయ్యెడ రణో-ద్యోగంబుభగ్నేతరో।
తరకేయూరకిరీటకంకణతను-త్రాణోరుహారంబుగా।
త్కరదన్యోన్యకఠోరఖేటకగదా-ఖడ్గంబుగాశోణితా।
త్యరుణీభూతపరస్పరావయవలి-ప్తాశేషదేహంబుగన్॥ ౯౮॥

క. గిరులతెరంగునవృషములు।
కరణిని౦ బులులవలె మత్తకరులగతిన్ భీ।
కరులైపోరిరిమింటను।
సురలాశ్చర్యంబునొంది-చూడ౦బదాతుల్॥ ౯౯॥

క. ఊరుస్పందంబనిమిష।
వారవధూటులకు౦బొడమ-వసుధఁదలింపన్।
భోరున నెత్తురులాలుక౦గ౦।
బోరిరుభయసైన్యములను-బొలుచుపదాతుల్॥ ౧౦౦॥

చ. శరముల౦గప్పికప్పి పెలు-చన్ముసలంబులమోదిమోది ము।
ద్గరముల౦జిమ్మిచిమ్మి పరి-ఘంబులహుమ్మనివ్రేసివ్రేసి తో।
మరములభిండివాలముల-మర్మములంట౦గరొప్పిరొప్పి వి।
స్ఫురితమదాతిరేకమున౦-బోరె౦బదాతిసమూహమయ్యెడన్॥

ఉ. ఖండితచాపు౦డైరిపుని-ఖుడమునంబొడువంగదాసము।
ద్దండత౦దచ్ఛిరంబునిశి-తప్రహరంబున౦దున్మివీరు౦డో।
క్కండునుతించుమిత్రులమొ-గంబుల౦గన్గొనమోము౦ద్రిప్పుచో।
భండనసీమ౦దొల్లి౦టికి-బంధముపై౦బడిత్రవచెనాతనిన్॥ ౧౦౨॥

ఉ. ఆడుకబంధముల్ వరద-లైవసుధంబ్రవహించురక్తముల్।
గాడుశిలీముఖంబులుద-కంబులొసంగు౦డటంచుమిత్రులన్।

శేదుప్రవణార్తులం జెవికి-వేడుకఁ గంఠములెత్తి గీతముల్।
బాడుపిశాచముల్ గలిగి-భండనమయ్యెడఁ జెల్లెనెల్లెడన్॥ ౧౦౩॥

మ. సమరారంభమునందు వీరుఁడొకఁడ-స్వప్నత్వమందంగ మ।
ద్రమణుండీతఁ డితండు మద్వరుఁడు మ-త్కాంతుండితండంచు నా।
కమునం దచ్చరలెల్లఁ జేయఁదగు వా-క్స్గ్రామమంతంతకున్॥
శమితంబయ్యె నొడళ్లు దాచక పుడి-చ్చం బోరు వీరాళిచేన్॥ ౧౦౪॥

క. కదనముఁ బోటరులపుడు।
స్మదవృత్తిం జేయదివము-నన్ సురవేశ్యల్।
మదనకథనాభిలాషను।
సదనంబులు పానుపులును-సవరింతురొగిన్॥ ౧౦౫॥

చ. పుడమిపదాహతిం గదల-భోరునఁ గన్నులవిస్ఫులింగముల్।
వెడలభుజంబులుబ్బుచును-వీనులుదాటముఖంబులం బొమల్।
ముడివడదంతపీడనల-మోవులుగందఁగఁ గుంతహస్తులై।
పొదుపొదుమంచుఁ బోటరులు-పోరిరమర్త్యులుజూచి
మెచ్చఁగన్॥ ౧౦౬॥

ఉ. వారణముల్ మహాసమిద-వారణముల్ బహుమానితోన్నతా।
ధోరణముల్ విభుత్వగృహ-తోరణముల్ విజయేందిరాసమా।
ధారణముల్ రిపూత్కరవి-దారణముల్ దిగిభోపమానతా।
కారణముల్ గణంగిరణ-కాంక్షఁ బరస్పరముబ్బి మార్కొనెన్॥

క. భూతలమద్రువఁగ నీగతిఁ।
క్షేతోహ్లాదమున నుభయ-సేనలలోఁ జీ।

మూతాకారములైతగు।
మాతంగములొకటికొకటి-మార్కొని మడిసియున్॥ ౧౦౮॥

శా. శుండాదండము లెత్తి మోదుచు రదా-స్తోకప్రహారంబులం।
గండల్ నెత్తురులొల్కఁ జేయుచు ను ఘీం-కారంబులం బద్మగ।
ర్భాండంబెల్లఁ బగల్చుచుం బెనఁగి ని-ర్యద్రక్తధారోజ్జ్వల।
చ్ఛుండాలంబులు నిర్ఝరాంచితగిరి-స్తుత్యంబులై భాపిలెన్॥

ఉ. ఒండొరుమీఁదఁ గొండలస-ముద్ధతపద్ధతి నొండు మత్తవే।
దండములన్ రయంబున ను-దగ్రకరాంకుశసంజ్ఞలన్ సము।
ద్దండత మీరదీకొలిపి-దారుణతో రణపఙ్క్తి నెత్తురుల్।
భండనభూమిఁ గాల్వలయి-పారఁగఁ బోరిరి జోదులయ్యెడన్॥

మ. చటులానేకపబృంహితస్వనములా-జానేయహేషల్ రవో।
త్కటనేమీరవముల్ భటస్ఫుటనినా-దంబుల్ సముద్యద్ధ్వజః।
పటలాభ్రంబులు చేయు గర్జనలవి-స్పష్టంబుగా ధాత్రి పి।
క్కటిలెన్ భూతభుజంగభుగ్వితతికా-త్యంత్యంబు వాటింపుచున్

శా. కోదండంబులు శక్రచాపములుగాఁ-గోటీరకాంతుల్ తటి।
త్ప్రాదుర్భావము గా రథోద్ధతిఘనా-రంభంబుగా సింజినీ।
నాదం బభ్రరవంబుగా రథులు జ-న్యక్షోణిఁ బర్జన్యమై।
ర్యాదం గప్పి రనేకభంగుల సము-ద్యత్కాండవర్షంబులన్॥

ఉ. మేటిశరంబులొండొరుల-మేనులఁ జాపము లెత్తి నొవ్వఁగా।
నాటని గుచ్చుచున్ మెఱుఁగు-సారసముల్ రథచోదకాళికిన్।
ఘోటకపఙ్క్తికాయములకున్-ధ్వజకోటికిఁ దాకసుంచఁగా।
నూటిమ గుచ్చుచుం బెనఁగఁ-జొచ్చిరి యుద్ధమహిన్ మహారథుల్॥

చ. సమరము సెల్లుచుండెఁ బెలు-చన్ రథచిత్రగతుల్ వెలుంగఁగాఁ
గ్రమమునఁ గుండలాకృతులఁ-గార్ముకముల్ గనుపట్టఁగా శితా
స్త్రములపరంపరల్ దెసలఁ-గ్రమ్మ ఘనంబుల నప్సరస్సమూ
హములు ముదంబునం దగమ-హారథమౌళులకుం గ్రవైఖరిన్ ॥౧౧౪॥

ఉ. చండగతిన్ రథుల్ రణము-సల్పుచునుండఁగఁ గుండలీకృతో
ద్దండతదీయకార్ముకవి-తానములం గని వేడ్కతో డమా
ర్తాండుఁడు తాఁ దదాకృతిని-దాల్చెననం దగ సంగరావనీ
ఖండపతద్భటప్రవర-కల్పితమండలమధ్యమార్గుఁడై॥ ౧౧౫॥

లయగ్రాహి. చంగునను సాదులు తు-రంగములఁ దోలి భట-
పుంగవులు మార్కొనఁగ-ణంగినఁ దదీయో
త్తుంగరణగర్వములు-భంగపడఁ జేయుచు మ-
తంగజవితానముఁగ-నుంగొనుచు వేడ్కన్
సింగములపోలికఁ జె-లంగి నఖరాసులఁగ-
ణంగుచును గుంభమణు-లంగడిమితోనే
లంగలయఁ జేసి సర-థాంగరథికాళిగళ-
తాంగములఁ గూలిచిరి-నింగి సురలెన్నన్॥ ౧౧౬॥

మహాస్రగ్ధర. భటసందోహంబు లెల్లం-బటుతరపరశు-
ప్రాసకుంతాదినానా
చటులాద్యస్త్రాయుధంబుల్-సరభసమున హ-
స్తంబులం బూని శౌర్యో
త్కటులై పోరంగఁ గూలెం-గరిఘటులు హయల్-
ఖండితాంగంబులయ్యెం
దృటితాకారంబుఁ జెందెం-దొడరి నరథసం-
దోహమశ్వాన్వితంబై॥ ౧౧౭

మత్తకోకిల. స్యందనస్థులు భీషణాంబక-జాలముల్ వరఁగింపఁగా।
మందవిక్రమతన్ మహిం బడి-మానితాశ్వకబృందముల్।
గొందలంబున నేలఁగూలిరి-కుంజరస్థులు సద్భటుల్।
కందముల్ పెనుగాలిఁగూలిన-కైవడిం జనిరందరున్॥ ౧౧౮.

ఉత్సాహము. వారణంబు లపుడు దాన-వత్వమంది భీకరో।
దారపాదనిహతులం బ-దాతులన్ హరింపుచుం।
ఘోరదంతహతుల వాజి-కోటులం వధింపుచుం।
భోరనార్చిరథుల చేరి-పోటులం దెరల్చుచున్॥ ౧౧౯.

వ. వెండియుంగుండలీకృత సముద్దండ కోదండ ధారాధరమండలవి
నిర్యత్కాండ ధారా పరంపరలఁ దెరలక కీలాలనిర్ఝర విరాజితం
బులై పెనుగొండలరీతి నిశ్చలంబులై యుండు మత్తశుండాలం
బులును। దండధర దండాయమాన మదోద్దండ వేదండ శుండా
దండ చూర్ణీకృతరథరథ్యధ్వజరథచోదక ప్రముఖ పరికరులై కర
వాలంబులు కరంబులఁగీలించి కుపితంబులగు కంఠీరవంబుల కర
ణిఁ దదీయ కుంభస్థలంబులకు నురుకు రథికులును విజయలక్ష్మీలక్షి
త సముత్తుంగ తురంగ సవ్యాపసవ్య భ్రమణంబులఁ దదారో
హకుల తర్జనభర్జనఁ గావింపక తురంగముదయంబుల తాకునకో
ర్చి నిలుచు చెలియలగట్లతెరంగున నిల్చుపదాతులును। పరిపంథి
భయంకరబహుళపదాతి నికరకరాగ్రవిరాజమాన పరశుపట్టిస
ప్రాసపరిఘాంకుశముసలముద్గరతోమరగదాఖడ్గ ప్రముఖాయు
ధప్రహరణంబుల భగ్నవాహనులగుచుఁ దారును బదాతులై బవ

రంబు సేయు రథికాశ్వికసింధురారోహకులును। కోదండంబులు తుండంబులైన వేరొండుకాండాసనంబులంగొని ఖండనంబుసే యుమహారథులును। సారథులుమూర్ఛిల్లిన సారథ్యంబులు జరిపించుకొనుచు సంగ్రామంబు సేయుచుఁ జలింపనియతిరథులును। పరస్పరప్రదరవిదారితపతాకాశ్వరథరథ్య సారథిధనుర్దండులయి ఛురకరికిగదా దండంబులంబోరు సమరథులును । గదాదండంబులొండొంటిఁదాకివిడఁదరిగిన చండంబున ఖండితంబులైనఁగేచాకచింబోరువారును। బొరిపొరిసొలయువారును । సొలసితెలియువారును। తెలసినిలుచువారును। నిలచిక్రమ్మరసన్నద్ధులగువారును। సన్నద్ధులైసమరంబుఁజేయువారును। సమరంబు సేయఁజాలక తిరుగువారును। తిరిగితిరగఁజాలక మరలనభిముఖులై సింహనాదంబులు సేయువారును। సింహనాదంబులు సేసి తమవారలకడ్డపడువారును। కూలినకుంజరంబులును సమసినసైంధవంబులును బడలుపడినపదాతులును ఖండితంబులైన కార్ముకంబులును విరిగిన వెలిగొడుగులును, విడినవింజామరలును, విరథులైనవీరులును, విదళితంబులైనరథాంగంబులును, విస్రస్తంబులైనకేతనంబులును, విగళితంబులైనరక్తంబులు, వికీర్ణంబులైనసాధనంబులును , విచ్ఛిన్నంబులైన కచంబులును, భగ్నంబులైనఖేటకంబులును, గలిగి కేశశైవాలంబులధవళాతపత్రపుండరీకంబుల భూషణచూర్ణ పులినంబులరథాంగకూర్మంబులఁ జామరఫేనంబులఁగాఁ జేయుక కాశోదరంబు

లఖండితకరికరజల్పాకలముద్గరమత్స్యంబులఁబలలపంకంబులంబరి
ఢవిల్లి ప్రవహించురక్తతరంగిణులనోలలాడుభూతడాకినీ ప్రముఖ
పిశాచంబుల నతిభీషణంబులై మేదోభక్ష్యంబులను, మాంసభో
జ్యంబులను, మస్తిష్కలేహ్యంబులను, శోణితచోష్యంబులను,
మదపానీయంబులను, చర్మభాజనంబులను కపాలపాత్రికలనుఖ
డ్గోపకరణంబులంగనుపట్టుచు మృత్యుదేవత మహానసంబుకైవడి
భయంకరంబై కమలాకరంబునుంబోలె కబంధబంధురంబై కైలా
సంబునుంబోలె భూతపరివృతంబై పారావారంబునుంబోలెఁ
గీలాలపూరితంబై కాలకంధరంబునుంబోలెఁ గపాలాకాన్తంబై
మరునిశరీరంబునుంబోలె భీమాంబకజ్వాల జర్ఝరితంబై కాం
తారంబునుంబోలె దుర్గమంబై దావానలంబునుంబోలె హేతివ్రా
తాన్వితంబై యమ్మహాహవంబుచూచు ఖేచరులకువెక్కసంబును
వెరఁగుపాటునుంబొడమ బీభత్సభయానకరసంబుల కాస్పదంబై
చెల్లెనయ్యెడ॥ ౧౨౦॥

ఉ. చిత్రముగాఁగనిట్లుభయ-సేనలుశౌర్యరసంబునక్షమి।
ధాత్రిఁబెనంగవంగవసు-ధాపతిసారథిఁజూచివేళ్లిడెన్।
శాత్రవసైనమేనురథ-సంబునఁగూల్చుజగంబులోపలన్।
క్షత్రియుఁడీతఁడేయనుచు-సన్నుతిలోకులుసేయుచుండఁగన్॥

క. కావునవరదముఁ వేగమె।
పోవఁగనిమ్మనుచుసమర-పుణ్యేడుకనా।

భూవరుఁడువలుకనటులం।
గావించెదననుచుఁబరపెఁ-గంబాణములన్॥ ౧౨౨॥

క. తేరీరీతినిసారధి।
వైరులపైవడపనపుడు-వంగపతిఘనా।
కారుండైకురిసెశరా।
సారముగుణనాదమురుము-చందమునఁదగన్॥ ౧౨౩॥

శా. కంజాతప్రభవాండభాండమవియం-గావిల్లుమ్రోయన్ హితుల్।
రంజిల్లన్ రుధిరంబుకాల్వలయిపా-రన్ శాత్రవానీకముల్।
పుంజీభూతములైరహింబడశరం-బుల్ భానుమంతుండుదాఁ।
బింజల్ గాఁడఁగనయ్యెడన్వడిమహా-భీలంబుగానేయఁగన్॥ ౧౨౩

క. విలయాభ్రముగురిసెడుపిడు।
గులగతిదగవంగవిభుని-కోలలుదాకన్।
నిలువఁగలేకదిలీపుని।
బలములునల్గడలవిరిగి-పారెభయమునన్॥ ౧౨౫॥

క. పారకశూరతఁగొందరు।
వీరులుపైఁబడినవారి-విశిఖవితతిచే।
నారేచితరుచిరామర।
వారవధూటీకటాక్ష-వశులంజేసెన్॥ ౧౨౬॥

శా. నాళీకాప్తకరాహతిం దిమిర సం-తానంబు జంఝాప్రవా।
తూలప్రోద్ధతిచే మహాజలద సం-దోహంబాగింబంచ బం।
గాళంబైనగతిన్నిజధ్వజిని వం-గక్ష్మాతలాధీశ్వరో।
ద్వేలాస్త్రంబులఁ గూలిన న్మనుకులా-ధీశుండు రోషంబునన్॥ ౧౨౭

ఉ. సారథిఁ గాంచి తేరు రభ-సంబునఁ దోలు మదీయసేనలం।
బారఁగఁ జేసి వంగపతి-భాసిలుఁ బావకరీతి మచ్చరా।
సారములందదీయ పరు-షచ్ఛవి దుల్చెదనంచుఁ బల్కి నన్।
బీరముతోడ వాఁడు నడ-పెన్ రథమాతని తేరు చెంతకున్॥ ౧౨౮॥

శా. క్రోధజ్వాలలు కన్నుదోయి వెడలం-గోదండటంకారము।
ర్వ్యధోండంబుఁ బగుల్ప ధారుణి రథో-ద్వేగంబునం గ్రుంగ వం।
గాధీశుండగు భానుమంతుని సము-ద్యద్విక్రమంబొప్పఁగా।
యోధాగ్రేసరుఁడౌ దిలీపుఁడు సమా-నోద్వృత్తిఁ దాకెన్వడిన్॥

క. ఆతఁడు వేగ దిలీప।
క్ష్మాతలపతి రథమునకును-సమ్ముఖుఁడై జీ।
మూతము శరధారల జీ।
మూతమ్మును ముంచు రీతి-ముంచె ములుఁకులన్॥ ౧౩౦॥

ఉ. ఆపగిదిన్ సితాస్త్రనిచ-యంబుల వంగ మహీవిభుండు దో।
ర్నైపుణితోడఁ గప్పఁగ ఘ-నంబగు కోపముతో దిలీప ధా।
త్రీపతి భాస్కరుండు నిజ-దీప్తులమంచు నణంచు పోలి కం।
జాపవిముక్తశాత శర-జాలముల న్మరలించె గ్రక్కునన్॥ ౧౩౧॥

శా. తూణీరాస్త్రపరిగ్రహంబు ఘటనా-స్తోకోత్సవం బాశ్రవః।
శోణాకర్షణమున్ విమోచనము చ-క్షుర్గోచరంబై తగన్।
బాణాసంబులు కుండలీకృతములై-భాసిల్లఁ గాఁ బోరి ర।
క్షీణప్రాభవ మొప్ప వంగపతి సా-కేతాధినాథుండొగిన్॥ ౧౩౨॥

చ. ఇతనికితండె జోడితని-కీతఁడె సామ్యమటంచు ఖేచర।
ప్రతతులు ప్రస్తుతింపఁ బటు-బాణపరంపరలం బరస్పరో।
ద్ధత రథరథ్య సారథుల-దైన్యము నొందఁగఁ జేయుచుందురం।
బతులితరీతిఁ జేసిరి ర-యంబునఁ దద్ధరణీశులిర్వురున్॥ ౧౩౩॥

చ. కడిమి దిలీపుఁ డేయు శిత-కాండపరంపరలద్భుతంబుగా।
నెడ నెడఁ దున్మి వంగధర-ణీశ్వరుఁ డా మనుజేంద్రు తేరుపైఁ।
బడఁగ పయిం దురంగముల-పై రథచోదకు పై రయంబున।
న్విడఁద శరంబులేసె దివి-వేల్పులు సన్నుతిఁ జేయుచుండఁగన్॥

చ. కడువడి వంగభర్త నిజ-కార్ముకకౌశలమొప్పఁ గ్రమ్మరం।
దడయక మూఁడు బాణములఁ-దాన లుగుల్ములుఁ గంగ నేసిన।
న్విడ లెనొగిన్ దిలీపపృథి-వీపు నెదన్ రుధిరంబు గంట్లవెం।
బడిన భివృద్ధమై వెలికిఁ-బారిన లోపలి కోపమో యనన్॥ ౧౩౫॥

ఉ. నొచ్చి మదిం జలింపక య-నూనపరాక్రముఁడై గురుండు ము।
న్నిచ్చిన భీషణాహిశర-మేయఁ దదస్త్రజ పన్నగేంద్రముల్।
చెచ్చెర నేగ వంగనృప-శేఖరు మీదికి నాజిఁ దోడ్పడన్।
వచ్చెనొకో దిలీపునకు-వాసుకిముఖ్యఫణివ్రజంబనన్॥ ౧౩౬॥

క. గరుడాస్త్రమేసె వంగే।
శ్వరుఁడొగి నాత్మీయులైన-వాహిను లెల్లం।
బరితోషమంది-చూడఁగ।
నురగాశుగగర్వమణఁచి-యొప్పెం గడిమిన్॥ ౧౩౭॥

మ. ప్రకటీభూతునిఁ జేసె నందఱకు హృ-త్పద్మస్థిత క్రోధపా।
వకు నాగ్నేయశరప్రయోగ చతుర-త్వస్ఫూర్తి సాకేతనా।
యకుఁడా వంగవిభుండు నైజఘనశౌ-ర్యప్రోద్ధతుల్వారుణాం।
బకశక్తిం దెలియంగఁ జేసె సమర-ప్రావీణ్యమేపారఁగన్॥ ౧౩౮॥

మ. భరితాత్మీయమనస్తమంబుఁ బ్రకటిం-పన్భానుమంతుండు ధీ।
కరుఁడై తామసబాణమేయ నణఁగం-గాఁ జేసె వే వేగఁద।
చ్ఛరసంభూతమునంధకారవితతిన్-సౌరాస్త్రవిస్ఫూర్తిచే।
నరవిందాప్తకులోద్భవుండు నిజవం-శౌన్నత్యమేపారఁగన్॥

ఆ. ధరణిరాజనంగఁ-దగువంగపతినిశా।
చరశరంబు వైప-మరలఁ జేసె।
రాజమౌళియనఁగ-రాజిల్లెడు దిలీపుఁ।
డతులలీలశాంభ-వాంబకమున॥ ౧౪౦॥

క. దాక్షిణ్యకదంబముర।
క్తాత్ముం డైయితఁడువిడ చె-ననఁగా విజయా।
పేక్షన్ యామ్యశరమువం।
గక్షోణీవిభుఁడువిడ చెఁ-గాకుత్స్థుని పైన్॥ ౧౪౧॥

క. రాజత్కౌబేరాశుగ।
రాజము చేనణఁచె రాజ-రాజఖ్యాతిన్।
రాజిలు దిలీపభూవిభుఁ।
డాజనవరుఁ డేసినట్టి-యామ్యశరమ్మున్॥ ౧౪౨॥

మ. జలజాస్త్రింబు గణంగి వంగవిభుఁడు-త్సాహంబుతో నేయఁగా।
నలుకన్భానుకులుండు వారిఘనశౌ-ర్యస్ఫూర్తిమాయన్మహా।
బలసంపన్నుఁడితండటంచునునిలిం-పశ్రేణులెన్నన్సము।
జ్జ్వలుఁడై వాయుశిలీముఖంబునఁ దద-స్త్రప్రోద్ధతుల్మాన్పుచున్॥

ఉ. లేనగవాననంబునఁద-లిర్ప దిలీపవిభుండు వంగభూ।
జాని మొగంబుఁ జూచిర-భసంబున నిట్లనె దుర్మసంబునం।
గానక మున్ను దూతవినఁ-గాఁ బలుపంతములాడి నీవు బ।
ల్మానిసిరీతి వచ్చితివి-మమ్ము మహాహవభూమిఁ గెల్వఁగన్॥ ౨౪౪॥

క. నీబాహుబలము పెంపును।
నీబంటుతనంబుసొంపు-నీనిపుణతయున్।
నీబాణాసనవిద్యా।
ప్రాబల్యముఁజూపుదడయ-రాదిఁకననుచున్॥ ౧౪౫॥

గీ. ఐంద్రమాదిగ వెక్కుది-వ్యాస్త్రములుంబు।
రందరాదిసురల్వెర-గందిచూడ।
భీషణాకృతి నేయఁగఁ-బెంపుచెడక।
భానుమంతుండుమరలించెఁ-బ్రతిశరముల॥ ౧౪౬॥

చ. ఖలునకుఁజేయు సత్కృతుల-కైవడినూషర భూమిఁజల్లు వి।
త్తులగతిబూదెలోనియతి-తోనిడుహవ్యములట్ల లోభికిం।
దెలిపిన ధర్మపద్ధతుల-తీరుననంగ మహీశుపైని ను।
జ్జ్వలతరదివ్యబాణములు-వ్యర్థములైనదిలీపుఁడల్కతోన్॥ ౧౪౭॥

శా. ఎల్లన్ సారథిఁజక్రరక్షకుల నే-కైకోగ్రబాణంబులన్।
డొల్లంజేయుచు వాజులందఱశరా-టోపంబులందున్మచున్।
భల్లద్వంద్వమునన్ ధ్వజంబుధరణీ-భాగంబునంగూల్చుచు।
న్విల్లర్ధేందుశరంబునందునిమెదో-ర్వీర్యంబురెట్టింపఁగన్॥ ౧౪౮

చ. ఘనమగు పుణ్యమోజదరు-గంగఁదదీయ విశేషశేషముం।
గొనిదివిమండివేగ ధర-కుంజనుదెంచు మహాత్ముపోలికం।
దనజవనాశ్వసారథి ర-థధ్వజకార్ముక ముఖ్యముఖ్య సా।
ధనములురూపరం దుమికె-ధాత్రికిఁబాణిఁగృపాణిఁబూనుచున్॥

క. ఈవిధమునవంగ ధరి।
త్రీవిభుఁడభిమానమూని-తెరలకనిలువన్।
వేవేగఁబెక్కుతునియలు।
గావించెఁగృపాణమష్ట-ఘనకాండములన్॥ ౧౫౦॥

క. విదళితకరవాలుండై।
కదనక్షితిదైన్యరసము-గన్పట్టనిరా।
స్పదతన్ నిలచినఁగన్గొని।
సదయుండైయాదిలీప-జనపతిపలికెన్॥ ౧౫౧॥

క. దురమునఁగైదువువదలినఁ।
బరిపంథుల నేయననుచుఁ-బ్రతిబలికితి నీ।
పురికిప్పుడేగి రాఁదగుఁ।
దిరుగన్సమరమునకలుకు-దీరినపిదపన్॥ ౧౫౨॥

గీ. సంగరము సేయ నోపిక-చాలదేని।
కరమొసంగు వినయపూర్వ-కమ్ముగాఁగ।
శరణుఁజొచ్చినరిపునైనఁ-గరుణలేక।
చెరుతురే భానువంశజు-ల్వెరవసేల॥ ౧౫౩॥

క. అనిపల్కన్వినివంగా।
వనివరుఁడుహతావశేష-వాహినిగొలువం।
జనెమంథాక్షౌకాంతా।
వనుఁడైతనపురికిసాటి-నరవరులునగన్॥ ౧౫౪॥

గీ. విజయలక్ష్మీసమేతుఁడై-విడుదులకుది।
లీపభూపతిచనియెబ-లింజయించి।
సురలుగొనియాడనిజపురి-కరుగుపాక।
శాసనునిపోలెన్సైనికు-ల్సన్నుతింప॥ ౧౫౫॥

క. సమరమునదిలీపక్ష్మా।
రమణుఁడుచేసినమహాప-రాక్రమమునకుం।
బ్రమదమునుజెందిశక్రా।
ద్యమరులుతమమందిరముల-కప్పుడరిగిరొగిన్॥ ౧౫౬॥

ఉ. సంగరరంగమందుజల-జప్రియవంశ్యనిచేతనీగతిన్।
భంగముఁజెందిపోయిమద-భారమణంగినసాధువైనమా।
తంగమురీతిమంత్ర్యభిమ-తంబునసోపదపాణిపద్ముఁడై।
వంగమహీశుఁడేగ హిత-వర్గముతోడదిలీపుపాలికిన్॥ ౧౫౬॥

క. చని కాంచనరత్నోపా।
యనములుమున్నిచ్చినప్రముఁ-డైనదిలీపా।
వనినాయకుఁడనుకంపా।
వననిధియైయాదరించె-వంగాధిపతిన్॥ ౧౫౭॥

క. ఈకరణిభానుమంతుని।
లోకులువినుతింపరణము-లోనగెలచిగం।
గాకూలంబుననిలిపెన।
నేకజయస్తంభములుజ-యేందిరవెలయన్॥ ౧౫౮॥

శా. ఆతర్వాత దిలీపభూపుఁడొక పు-ణ్యాహంబునన్భీషణో।
త్ఖాతక్రీడలడస్సియున్నమదమా-తంగంబురీతిన్హితా।
న్వీతుండైపరిశుద్ధజహ్నుతనయో-ద్వేలప్రవాహంబునం।
బాళితస్నానముఁజేయువేడుకమదిం-బాటిల్లఁగానేగుచున్॥

మ. కనదుత్తుంగతరంగనాశ్రితజనౌ-ఘవ్రాతభంగంబయో।
జనటద్భృంగనుసర్వతోముఖచర-చ్చక్రాదినానావిహం।
గనుసంతుష్టనృపాధినాయకతురం-గంబుణ్యమార్గానుషం।
గనుగంగన్విమలాంతరంగఁగనియెం-గాకుత్స్థుఁడుత్కంఠియై॥

సీ. రహిభగీరథుమనో-రథముఁదీర్పఁదలంచి,
శంకరుమౌళిన-లంకరించి।
శక్రాదిసకలని-ర్జరులసన్నుతిమించి,
యవనీతలంబున-కవతరించి,

జహ్నునికృపఁ బునర్జన్మంబునఁ జరించి,
నదులలోపల మహోన్నతివహించి।
వీక్షించుజనముల-వృజినంబులహరించి,
కడిమిలోకములఁ బ్ర-ఖ్యాతిఁగాంచి।

గీ. సగరపుత్రులకపవర్గ-సరణిఁ జూపి।
భక్తసముదాయమునకుఁ దా-పంబుఁ బాపి।
తనరుభాగీరథీనది-మనుజవిభుఁడు।
వినయమునఁ జూచియిట్లని-వినుతిఁ జేసె॥ ౧౬౨॥

మ. జయపుణ్యాపగ జహ్నుకన్య దివిష-త్సంపూజ్య వారాంనిధి।
ప్రియకల్లోలవతీమతల్లి కరుణో-పేతా సమస్తాశ్రితా।
భయదావిష్ణుపదోద్భవా త్రిపథగా-భాగ్యప్రదావర్జితా।
మయఫాలాక్షశిరోమణీప్రవిమలాం-భఃపూర భాగీరథీ॥ ౧౬౩॥

క. భవదమృతముఁ జూచినమా।
నవుఁడమరుండగుచు నంద-నవనంబున వా।
సవునిగతిఁ గరంభాద్యమ।
రవధూటులతో నిరంత-రముఁ గ్రీడించున్॥ ౧౬౪॥

క. కలితామృతప్రవాహం।
బులననధికమైనయత్న-మునఁ బ్రతిదివసం।
బులమర్త్యులనెల్లనమ।
ర్త్యులఁ జేసెదుతల్లి నీకుఁ-దోయధిసమమే॥ ౧౬౫॥

ఉ. మానవుఁ డొక్కనాఁడుతన-మౌళినిఁ దావకకంకణంబులం।
బూనఁదలంచెనేని సుర-పూజితుఁడై సతతంబు నీనులం।
దానునుజామరాంచితక-రామరవారవధూవతంస స।
న్మానితరత్నకంకణ ఝణం-ఝణ నాదములన్ముదంబునన్ ౧౬౬॥

సీ. వల్లులలోఁ గల్ప-వల్లిచందమున ర,
త్నములలోపలను జిం-తామణిగతిఁ।
గళలలో విజ్ఞాన-కళతెరంగునను వి,
హంగమంబులలోన-హంసపగిదిఁ।
బల్లవాధరులలో-పలను భారతిభంగి,
శాలలలోఁ జంద్ర-శాలరీతి।
వేళలలో శర-ద్వేళపోలికను ధే,
నువులలోఁ గామధే-నువువిధమున।

గీ. మూర్తివితతులలో శంభు-మూర్తికరణి।
దీప్తిసమితులలోఁ జంద్ర-దీప్తిసరణి।
వాహినులలో నవిఖ్యాతి-వడసితీవు।
శక్యమే నిన్ను వినుతింప-జహ్నుతనయ॥ ౧౬౭॥

క. అనుచు దిలీపుఁడు మాధవు।
తనయను గొనియాడి తత్సు-ధామధురజలం।
బున నోలలాడి విప్రులఁ।
దనిపె ధనపరంపరలను-దానపరుండై॥ ౧౬౮॥

ఉ. ఈకరణిన్ మహీధవుఁడ-నేకవిధంబుల రౌప్యకాంచనా।
నేకపధేనుఘోటకమ-ణిప్రముదాదిసమస్తదానముల్।
లోకులు మెచ్చుచుండ మది-లోనుదమందుచుఁ జేసి దిక్కులం।
బ్రాకఁగఁ జేసె సాంద్రముగ-భవ్యతరోజ్జ్వలకీర్తివల్లులన్॥ ౧౬౯॥

క. ఆతర్వాతసమీప।
క్ష్మాతలమునఁ జంద్రకాంత-మణిమయమగుచున్।
శ్వేతావనీధరేంద్రము।
రీతించగు దేవళంబుఁ-బ్రీతిం జూచెన్॥ ౧౭౦॥

కం. చూచి మది న్ముదమొదవఁగ।
సాచీకృతముఖ తనర్త-సచివునితోడన్।
రాచూలి తనదు వాచా।
వైచిత్ర్యము వెలయ ఘనర-వంబునఁ బలికెన్॥ ౧౭౧॥

కం. ధావళ్య రుచుల నీనుచు।
దేవళి మచ్చోటనొకటి-దీపించు మహా।
దేవాంచిత కైలాస।
గ్రావము కైవడిని విబుధ-గణసేవితమై॥ ౧౭౨॥

కం. శంకరుని భక్తలోకవ।
శంకరుని శివంకరుని బి-శాచరగణనా।
శంకరుని దుష్టమనుజభ।
యంకరుని మదిన్ స్మరింప-నఘములుఁ గలవే॥ ౧౭౩॥

మ. నగజాలంకృత వామభాగు హిత మం-దారాగు హారాయితో।
రగరాడ్భోగు సుపర్వలోకతటినీ-రాజజ్జటాభోగు భ।
క్తగణవ్యాప్తమనోనురాగు దళితో-ద్యద్దక్షయాగున్సమ।
స్తగుణోద్యోగు శివుందలంచినఁ బున-ర్జన్మంబు లేదెరికిన్॥ ౧౭౪॥

చ. పురహరుఁ డీశ్వరుండు శిత-భూధరగేహుఁడు శైలరాట్సుతా।
వరుఁడు గుణార్ణవుండు హిత-వత్సలుఁ డాఢ్యుఁడ ఘోన్నమత్తమః।
ఖరకరుఁ డంధకాద్యసుర-కంధరఖండనలోలుఁ డున్నత।
స్ఫురణఁ దగున్ హరిప్రముఖ-పూజ్యులలోపల నగ్రగణ్యుఁడై ౧౭౫॥

త్ర్యర్థి-మ. శరదభ్రాజితమూర్తులవ్యయనివా-సస్ఫూర్తులార్యార్చితుల్
కరుణాంభోధులహీనభూషితులుమా-కాంతుల్వివాఖ్యుల్జితా।
సురశార్దూలులు భాస్వదబ్జరుచిరా-క్షుల్ శ్రీయుతుల్ పార్వతీ।
పరమేశుల్ జగదుద్భవస్థితిలయో-పాయజ్ఞులౌటఁ బ్రమే॥ ౧౭౬॥

[illegible]
[illegible]
[illegible]
[illegible]
ద్వితీయాశ్వాసము.
[illegible]

హరిహరబ్రహ్మసూర్యపక్షకందద్వయము.

క. శ్రీయుక్తునకున్నత్యా।
ధేయునకండజవరస్తు-తిప్రియునకు గాఁ।
గేయనుతాకృతికినతా।
త్రేయునకవిరక్తునకు వి-ధేయుఁడనగుదున్॥ ౧౭౭॥

క. శ్రితచక్రిప్రియకరునకు।
నతసుమనోగణునకును ధ-నంజయగురుస।
న్మతిపాత్రునకున్వృషక।
ర్ణితతేజునకేనమస్క-రింతుముదమునన్॥ ౧౭౮॥

క. శివుఁడుభవుఁడభవుఁడగజా।
ధవుఁడు నతాంబురుహభవుఁడు-దళితాఖిలదా।
నవుఁడపవర్గదపదప।
ల్లవుఁడు జగత్కారణతఁజె-లంగఁగఁదగఁడే॥ ౧౭౯॥

చ. హరుఁడుపరుండుశంభునిఁబ్రి-యంబునఁగొల్వవలెంబినాకిచే।
సిరులభివృద్ధియౌనతులు-జేసెదశర్వునికైజగంబుమా।
పరువలనంజనించు స్మర-వైరికిఁదుల్యుఁడులేడు ధీయుతుం।
డరయ మనంబుశంకరుని-యందిడిసాంబయనన్శుభంబగున్॥

సీ. మునిసితాపాంగ జీ-మూతలోకాతీత,
భక్తజనాంగణ-పారిజాత।
నతపురుహూతవం-దితమునివాంఛిత ప,
ద్మాసనార్చితచర-ణాంబుజాత।
భూతగణాన్విత-పోషితభువనసం,
ఘాత పర్వతకన్య-కాసమేత।
గజదైత్యగర్వాంధ-కారఖద్యోతభ,
వాంబుధవాంత మా-యాకిరాత।

గీ. భువనవిఖ్యాత సద్గుణ-పూతయనుచు।
సంతతము సన్నుతించు స-జ్జనులకెల్ల।
నైహికాముష్మికము లనా-యాసముగను।
గలుఁగఁ జేయును చంద్రశే-ఖరుఁడు ప్రీతి॥ ౧౮౧॥

క. కావున వేగమె మనమా।
కోవెలకుం జని త్రిశూలా-నుకూలుఁడగు మహా।
దేవుని వేడుకతోడన్।
సేవింపఁగవలెనటంచుఁ-జెప్పిన నతఁడున్॥ ౧౮౨॥

క. విరులక్షతలును ఫలములు।
పరిచారకవితతిచేతఁ-బట్టించి మహీ।
వరుని వెనువెంట నేగను।
సరసాగ్రణియైన సర్వ-సచివుఁడు ప్రీతిన్॥ ౧౮౩॥

గీ. సర్వసచివుఁడు వెనువెంట-నడువఁ బాద।
చారియై భూవిభుండు ప్రా-కారగోపు।
రోపవనతోరణముల స-ముజ్జ్వలాకృ।
తులకు విస్మయమంది లో-పలకుఁజనియె॥ ౧౮౪॥

క. బంగారముగను పేరగ।
తింగాసారంబుఁజూచు-తృష్ణార్తుగతిన్।
లింగాకృతిఁ దగుశివునిఁ గ।
నుంగొని ముదమందె విభుఁ డ-నూన ప్రీతిన్॥ ౧౮౫॥

క. ఈచందంబున నృపుఁడా।
సేచనకంబయి చెలంగు-శివలింగమ్మున్।
జూచి కరంబులు మోడ్చుచు।
వాచాలత వెలయ భూమి-వరుఁడిట్లనియెన్॥ ౧౮౬॥

సీ. శ్రీమన్నగేంద్రక-న్యామానసాంభోరు,
హభ్రమరాయతు-భ్యంనమోస్తు।
బ్రహ్మాదిసుర శిరో-రత్ననీరాజిత,
పాదపద్మాయతు-భ్యంనమోస్తు।
కరుణాకటాక్షవీ-క్షణ పరిరక్షిత,
భక్తలోకాయతు-భ్యంనమోస్తు।
సకలజగత్సర్గ-సంస్థితిప్రళయ ప్ర,
బలకారణాయతు-భ్యంనమోస్తు।

గీ. పరమముక్తిప్రదాయతు-భ్యంనమోస్తు।
పాలితాదితిజాయతు-భ్యంనమోస్తు।
భద్రసంధాయకాయతు-భ్యంనమోస్తు।
ప్రమథగణనాయకాయతు-భ్యంనమోస్తు॥ ౧౯౮॥

సీ. దండంబుపార్వతీ-మండితవామాంగ,
దండంబు సకలాబ్జ-జాండనాథ।
దండంబు వహ్నిమా-ర్తాండేందులోచన,
దండంబు మేరుకో-దండహస్త।
దండంబు నాగేంద్ర-కుండలాలంకృత,
దండంబు దళిత వే-దండదనుజ।
దండంబు ధారుణీ-మండలస్యందన,
దండంబు శుభ్రాంశు-ఖండభూష।

గీ. దండమంభోజసంభవా-ఖండలనుత।
దండమమరాంభీకరా-ఖండతేజ।
దండమబ్జాక్షసన్నుతో-ద్దండచరిత।
దండమంధకభయదప్ర-చండశూల॥ ౧౯౯॥

## గండకము.

శ్రీమత్తుషారావనీభృత్కుమారీ మణీపీనవక్షోరుహద్వంద్వనిస్తంద్రలిప్తోజ్జ్వలచ్చందనామోద సంతుష్టహారాయితాశీవిషేంద్రోత్తమాంగస్ఫురద్రత్న నీరాజితోరః ప్రదేశా। మహేశా। సరోజాసనాంభోజనాభామరేంద్రాది నానాదివౌకశ్శిరోభాగ భాస్వత్కిరీటాగ్రనిక్షిప్త పౌరందరగ్రావ మత్తద్విరేఫోత్కరాస్వాది తప్రోజ్జ్వలత్పాద పంకేరుహద్వంద్వ దత్తాపవర్గామృతామోదితోత్కృష్టభక్తా। విరక్తానురక్తా। శరన్నీరదైరావణాకాశగంగా మరాళేందు మందార కుందోరగాధీశ పాటీర కర్పూర నీహార హారావళీహీరతారావనీభృత్త్వయస్సాగరప్రోజ్జ్వలత్కీర్తి మూర్తి ద్యుతివ్రాతసంపూరితాజాండభాండా। పినాకస్ఫురద్బాహుదండా। నిశాతత్రిశూలాది దివ్యాయుధానీక జాజ్వల్యమాన ప్రభాపూరవిధ్వస్త దుష్టేభదైత్యాదినక్తంచరవ్రాత గాఢాంధకార స్ఫుటీభూత భాస్వత్ప్రతాపార్కబింబప్రహృష్టేంద్ర ముఖ్యాదితేయాంతరంగాంబుజాతా। భవానీసమేతా। శిరస్సంచలద్వ్యోమకల్లోలినీవీచికానేకరేఖాయితాత్మీయచూడామణీభూత బాలోడురాట్సన్నిభాకారదీపా। చిత్ప్రపంచీకృతస్వ స్వరూపా స్ఫురద్విశ్వసర్గావనాంత ప్రవీణాబ్జగర్భాచ్యుతేశాన సంస్తూయమానప్రభావా। మహాదేవదేవా। భవద్దివ్యలీలావిశేషంబులెన్నన్సు వర్ణాద్రిముఖ్యాగముల్ చిత్రసేనాది గంధర్వులున్ రాజరాజాదియక్షుల్ విదేహావనీశాది విజ్ఞానులున్ శేషముఖ్యోరగుల్ కుంభజన్మాదిభక్తుల్ మహేంద్రాదిదిక్పాలకుల్ పద్మగర్భాదిమౌనుల్ సనందాదియోగీశ్వరుల్ జాలరే నెంతవాఁడన్ మహాధాత్రి తేరైతగన్ వేదముల్ వాజులైయుండ మార్తాండజైవాతృకుల్ చక్రరూపంబునుం జెంద వాణీమనోభర్త సారథ్యముం జేయ వారాశితూణీరమైయొప్ప హేమాద్రిబాణాసనంబై వెలుంగన్ భుజంగేంద్రుఁడు ద్యద్గుణంబై చెలంగన్ముకుందుండు బాణాకృతింబూ

నలోకంబులం జాలఁ బీడించుచుం జక్రహస్తాజ సంక్రందనా సాధ్యులై బాహుగర్వంబుచే నెందుదుర్వారతన్నీఁగు శశ్వత్పురక్రవ్యభుగ్వైరులంగూల్పవే వేల్మిడిన్నిర్జరుల్ దానవుల్ వేడ్కతో మందరాగంబు కవ్వంబుగావించి నాగాధిపుం ద్రాఁడుగాఁ జుట్టి దుగ్ధాంబురాశి న్మథింపం జగద్భీకరంబై నిజజ్వాలలన్ లోకముల్ గాల్చుచున్నచ్చుహాలాహలోద్వృత్తి సైరింపఁగాలేక శక్రాదులెల్లన్ భయభ్రాంతులై రాజతాహార్యరాజంబుపై నెక్కి రక్షింపు రక్షింపుమంచు న్నుతింపం గృపాశాలివై కేలఁగీలించియా కాలకూటంబునుం గంఠవీథి న్నిరోధింపవే భీషణాకారుఁడై యష్టదిక్పాలురన్ సంగరక్షోణి నోడించి దుర్వారుఁడైయున్న యాయంధకాఖ్యాసురున్ శూలధారన్ విదారింపవే దక్షయాగంబు భగ్నంబుఁగావింపవే భక్తులన్నిత్యముల్ సత్కృపంబ్రోవవే శాత్రవశ్రేణులన్ ధాత్రిపైఁగూల్పవే। మన్మథున్ లోచనాగ్ని స్ఫురజ్జ్వాలలంగాల్పవే। క్రమ్మరం దత్క్షేత్రంబు నిన్వేడినం బూర్వరూపంబుగాఁ గాము నిన్నిల్పవే నీవుపూర్వంబున న్నిర్గుణఖ్యాతిఁ జెన్నొందియు న్వ్యగమాయానుషంగంబునన్ వేగ సత్త్వాదులంగూడి పంకేజగర్భుండవై పంచభూతాత్మకంబైన సర్వప్రపంచంబుఁ జిత్రంబుగా శక్తినిపింపనిర్మింపవే। చక్రముఖ్యాయుధశ్రేణులంబూని విష్ణుండవై దుష్టదైతేయులంబట్టి పల్మారు శిక్షింపుచున్ సాధుసంఘంబులన్వేడ్క రక్షింపుచుం బెక్కు దివ్యావతారంబులన్ ధాత్రిదీపించుచున్ వైదికాచార తంత్రంబులన్వృద్ధిఁబొందింపుచుం దత్ప్రపంచంబునుం బ్రోవవే రుద్రరూపంబునం గేలశూలంబుఁ గీలించి కల్పావసానంబునం జంగమస్థావరోపేతమైయున్న తద్విశ్వమెల్లన్ లయంబందఁగాఁజేసి జ్యోతిస్స్వరూపంబునం బ్రాజ్ఞసంజ్ఞోన్నతిన్ సర్వమున్నీవయై యొంటిదీపింపవే భేదవాదుల్ భవత్తత్త్వముంగానఁగాలేక జీవుండొకం డీశ్వరుండొక్కరుం డీప్రపంచంబు సత్యంబు సాయుజ్యసౌఖ్యంబు లేదేరికిన్

ద్వైతమార్గంబె సద్గ్రాహ్యమంచుం గుతర్కోక్తుల౯ లౌకికాచారరీ
తిన్వివాదింతు రీవిశ్వమెల్ల౯ భవద్బింబితంబంచు వేదాంతులెల్ల౯
శరీరాభిమానంబు వర్జించి సర్వజ్ఞులై సచ్చిదానందసంజ్ఞంబ్రకాశించు
నీయందు నిత్యంబును న్నామరూపంబులం బాసి క్రీండింతురీశా మ
హేశా జగత్కారణా శంకరా చంద్రమౌళీ పినాకీశివా శర్వపా
థోధితూణా భవాభర్గసర్వజ్ఞ భక్తామరక్ష్మారుహా నందివాహా హరా
ధూర్జటీ దేవదేవా త్రిశూలాయుధా వామదేవామృడా కాలకంఠా
కపర్దీ మహాదేవ కైలాసవాసా గిరీంద్రాత్మజా మానసాంభోజమిత్రా
సుధాధామ పాథోరుహాప్తాగ్ని నేత్రా భుజంగాదిరాడ్భూషితప్రాం
శుగాత్రా సనందాదియోగిస్తుతోద్యచ్చరిత్రా జటాజూట భాస్వత్ప
యోదాధ్వగంగానిశానాథ భాస్వద్రథాంగా శుభాంగా ధరిత్రీర
థాంగా కరాంచత్కురంగా కుబేరానుషంగా విశుద్ధాంతరంగా ధృ
తానేక మార్తాండదీప్యత్కిరీటా ప్రతాపానలోద్ధూత దుష్టారికీటా
సితాహార్యకూటా నతేంద్రాదిఖేటా శ్రుతివ్రాతఘోటా పరిపశ్య
ల్లలాటా హృతారాతివీరావలేపానమస్తే సువర్ణాచలాధీశచాపానమ
స్తే సముద్యత్ప్రతాపా నమస్తే నమస్తే సమస్తస్వరూపా నమస్తే
నమస్తే నమస్తే.

పాదగోపనచంపకమాల.

చ. పురహరహీరకుందహిమ-పూతశరీరవిపక్షశిక్షకా।
సరసబలాకరాఫలద-సాహసవర్షవినోదశిక్షితా।
సురరథిహంసనూత పరి-శుద్ధగుణాతిశయాస్తుతాశ్రితా।
హరహితరక్షకాసకల-హర్షయుతారసపద్ధతిస్తుతా॥ ౧౯౦॥

బహువిధత్రికందగర్భితసీసము.

సీ. శారదనీరద-పారదనారద,
మందారచందన-మహితకీర్తి।

హార మృణాళ మృ-గాంక సుధారస,
తారాద్రి రాజిత-ధవళమూర్తి!
వారిజసంభవ-వాసవనీరజ,
నయనాదిసురముని-చయనుతాఖ్య!
తారణ రాక్షస-వారిదమారుత,
విద్యావిదుత్తమ-విపులసౌఖ్య!

గీ. భూరికరుణాసమేతని-వారితభవ!
బంధగిరిశవరదపశు-పతిపినాకి!
మేరుగిరిచాప సత్యవి-చార సకల!
కారణాలసదమలదీ-ప్తామహేశ!! ౧౯౧॥

## నాగబంధచంపకమాల.

చ. శివహరలోకమోదకర-సేవకవత్సలశైలధీరదా!
నవహరధూతనిర్జరగ-ణప్రణుదాంధకదర్పనిశ్చల!
స్తవపరశంకరా హరిను-తానుతిమన్మనిలోకచోదకా!
రవినిభలక్ష్యవర్ణరణ-రక్షణగౌరవభూభవచ్ఛివా॥ ౧౯౨॥

## చక్రబంధశార్దూలము.

శా. విశ్వామిత్రమునీంద్రసన్నుత జగ-ద్విఖ్యాతచారిత్ర వే
దశ్వాశకశ్రీముఖామరార్చితశివా-ద్రైత్యాంతకాశంకరా!
విశ్వాకారమహాగుణాంచితభవా-వీరారిభూభృత్పవీ!
విశ్వేశావిధినందనూనువినుతా-వేద్యాహరాభారవీ॥ ౧౯౩॥

## చతుర్విధకందగర్భితచంపకము.

చ. హరవనజాక్షులాలసగు-ణాంబునిధిపరమేశశూలిభూ!
ధరశరణాహిమాచలసు-తాహృదయాంబుజభృంగధైర్యమం!
దరవనజారిపద్మజను-తామునిపాకరుణాసమేతమో!
దరసరతామహేశసత-తంబుకృపంగనిబ్రోవుమిక్కిదన్॥

## షోడశవిధకందము.

క. శూలజితకాలపశ్య।
త్ఫాలా త్రైలోక్యమూల-పండితపాలా।
కైలాసలోకపాణిక।
పాలాలీలావిశాల-పాపవిఘాలా॥ ౧౯౫॥

క. హరతరుణామృతకిరణా।
భరణాకరుణాపయోధి-పర్వతశరణా।
శరణాగతవత్సలనీ।
చరణములకు మ్రొక్కెదం బ్ర-సన్నుఁడవగుమీ॥ ౧౯౬॥

శా. పుత్రజ్యేష్ఠజఘన్యపుత్రదివిష-త్త్రాణ్యాపగాంభోజజా।
గాత్రస్వాంతశిరశ్శరీరహరణో-త్రాక్రాంతాంబుధిస్థేక్షణ।
శ్రోత్రాధీశ్వరతల్పకోపదహనో-ద్యుభ్రాంతికృత్కాలకూ।
టత్రాణంకరశంకరాకరుణతో-డంబ్రోవుమీ మ్రొక్కెదన్॥

గీ. ఛందములలోన బ్రణవంబు-చందమునను।
భూతములలోన గగనంబు-పోలె గేశ।
వాబ్జగర్భాదిసురలలో-నాద్యుఁడైన।
ఫాలలోచనునీరీతిఁ-బ్రస్తుతించి। ౧౯౮॥

క. భూరమణుఁడు శ్రుతివిహితా।
చారముదగ షోడశోప-చారంబులగా।
రీరమణుఁ దనిపి చనియెను।
శ్రీరంజిలుచుండ నాత్మ-శిబిరంబునకున్॥ ౧౯౯॥

క. సేనలతో నరపతిబ।
ద్ధానేకపసేతుమార్గుఁ-డై కాళింగు।
స్నానసమున బెదరఁగఁగఁపి।
శానదిఁ దదనంతరమున-సరభసవృత్తిన్॥ ౨౦౦॥

క. తరియించిమహేంద్రమహీ।
ధరనికటస్థలమునందుఁ-దగవిడిసి సమి।
ద్ధరణింగళింగమను జే।
శ్వరునింజెరలించికరము-వడిగైకొనియెన్॥ ౨౦౧॥

క. వంగక్షితినాయకునిఁగ।
ళింగోర్వవల్లభునిది-లీపుఁడుగడిమిన్।
సంగరమునన్నిర్జించిన।
సంగతులుక్రమక్రమునఁ-జారముఖమునన్॥ ౨౦౨॥

క. వినిదుర్జయుండుహరిహర।
వనరుహగర్భాదిదివిజ-వర్గంబులకీ।
మనవంశోద్భవుఁడనుచున్।
మనమునఁదలపోసి వేగ-మంత్రులతోడన్॥ ౨౦౩॥

సీ. నాటభోజాంధ్రక-ర్ణాటమహారాష్ట్ర,
మరహాటమత్స్యాంగ-మగధపతులు।
కాశ్మీరకాంభోజ-గాంధారకరహాట,
కోసలకేకయ-కుతలపతులు।
చోళపాంచాలనే-పాళబర్బరగౌళ,
బంగాళమలయాళ-పార్థివులును।
ద్రావిడద్రవిడవి-దర్భవిదేహబా,
హ్లీకనావీరఘా-త్రీశమణులు।
గీ. యవనసౌరాష్ట్రసింధుమా-ళవకిరాత।
ఘూర్జరదశార్ణచేంకణ-కొంకణకురు।
పాండ్యకుంతలసింహళ-పౌండ్రశూర।
సేనహూణాదిసకలభూ-జానులెల్ల॥ ౨౦౪॥

క, వినయముదళుకొత్తునుపా।
యనములుగొనిదిక్పతులుబ-లారినిగొలువం।

జనుదెంచు తెరంగునన
వ్వనజాప్తాన్వయునిఁ గొల్వ - వచ్చిరి వేడ్కన్ ॥ ౨౦౫॥

క. వచ్చి తమరర్ఘ్యపద్ధతిఁ
దెచ్చినరత్నోపదలు వి - ధేయులగుచుము
న్నిచ్చి నిజపురులకరుగఁగఁ
బుచ్చుకొని రనుజ్ఞ మగధ - భూపతిదకన్ ॥ ౨౦౬॥

శా. వంగేంద్రుండు కళింగభూవిభుఁడు దు - ర్వారప్రతాపుల్ రణో
ర్వంగామాంతకు నైన లెక్కఁ గొనరా - వీరుల్ తృణప్రాయులై
భంగంబందసముద్రముద్రితమహీ - భర్తల్ భయంబందిసా
రంగాశ్వప్రముఖోపదల్ ఘనకుఁ జే - రన్ వచ్చి యర్పించుటన్ ॥

గీ. అవనినాయకుఁ డనధికా - యాసలబ్ధ
సకలదిగ్విజయాగతై - శ్వర్యధుర్యుఁ,
డగుచుమితపరిజనముతో - నమ్మహేంద్ర
పర్వతోపత్యకారామ - పద్ధతులను॥ ౨౦౮॥

క. హల్లకవాసనలన్ వెదఁ
జల్లెడుచల్లని మరుద్వి - సరములవసుధా
వల్లభుఁడు మోదమందుచుఁ
బల్లవితాగములనీడఁ - బచరించు నెడన్ ॥ ౨౦౯॥

క. చేతులు మొగిడ్చి నిజవా
క్చాతుర్యము వెలయ నర్మ - సచివాగ్రణిసం
జాతప్రమదంబున వసు
ధాతలనాయకునితోడఁ - దగ నిట్లనియెన్ ॥ ౨౧౦॥

మ. సుమనోవాసితవల్లికాక్షితిరుహ - స్తోమాదృతానిత్యకా
భ్రమదభ్రభ్రమకృన్మదభ్రమరశో - భాపూరసందష్టమా
త్తమయూరామితచిత్రనర్తనసము - ద్యద్రంగసీమాయితో

త్తమరత్నాంచితసానుసాంద్ర మమహేం-ద్రంబీనగేంద్రం
బిలన్॥ ౨౧౧॥

మ. చమరీవాలజవాయుకంపితవిరా-జద్వల్లికాప్రస్తపు
ష్పమరందార్ద్రిసమున్నతోపలసమీ-ప్రక్రీడనాప్రేమేడితో
త్తమమత్తేభవిభాసమానకటకో-ద్యద్వాసనాహూతనా
కమహీజాతచలద్ద్విరేఫమగుచుం-గన్పట్టుభూవల్లభా॥ ౨౧౨॥

సీ. శృంగారతిలకవా-సితమైనముఖముతోc,
జందనాస్తోకవా-సనలతోడ
మణికటకప్రభా-మహితపాదములతోc,
జామలోపేతపా-ర్శ్వములతోడ
సరసాళిసన్నుత-సౌమనస్యంబుతో,
భరితకాంచనకలా-పములతోడ
ప్రబలంబులైనధై-ర్యస్థైర్యములతోడc,
బరభయంకరఖడ్గ-పటిమతోడ

గీ. హరులతో భీకరోన్నత్త-కరులతోడc
దనరిభూభృచ్ఛిరోమణి-త్వమువహించె
ధరణినీపోల్కె నీమహీ-హేంద్రముదిలీప
భానువంశప్రదీపదీ-న్యత్ప్రతాప॥ ౨౧౩॥

చ. పులులుజవాదిపిల్లులుcగ-పుల్ శరభంబులు లేళ్ళుగండకం
బులుచమరుల్ కిరుల్ గవయ-ముల్ నకులంబులుఖడ్గముల్ వృకం
బులుశశముల్ మదద్విరద-ముల్ మహిషంబులుభల్లుకంబులే
దులుహరుకీగిరింబలిమి-దోపcజరించునసేకభంగులన్॥ ౨౧౪॥

చ. అతనుమహాహవేచ్ఛలతి-కాయలసీమలcగామినీమణి
ప్రతతులతోడcద్రిమ్మరుకి-రాతులకోపధులీమహేంద్రప

ర్వతమున శేలుదీపికలు-శైఖరి వేడుక సేయు వేసవం।
బతగపత్త్రవారములు-బాపుఁ దదీయవ తాంతఘూర్ణమున్॥ ౨౧౫॥

మ. మనచేరత్నముఖోపహారచయమీ-మార్తాండవంశుండునై।
కొనమే గైకొననీకుతారిగృహమీ-గోత్రంబుదీనిన్మనం।
బునశంకింపక చూడఁగ లైననిస-మ్మోదంబుతోఁ గ్రమ్మరం।
జనిరాత్మన్నిను మెచ్చుచున్వినతులై-చత్వన్న దేశాధిపుల్॥ ౨౧౬॥

క. ధరనీదోర్దండము చే।
ధరియింపంబడిన శిఖర-తతి చే నీభూ।
ధరము బుసుపోక నింగిని।
ధరియించెననంగ నున్న-తస్ఫూర్తిఁ డగున్॥ ౨౧౭॥

సీ. గైరికధాతుని-కాయంబువిద్యుద్ద్వి,
తానంబుపోలికఁ-బూనియరయ।
వరవరాహోద్ధూత-వంశమౌక్తికములు,
పడువడగండ్లకై-వడి వెలుంగ।
నిర్మలినానేక-నిర్ఝరదారులు,
వరవర్ష ధారల-కరణిఁ జెలఁగ।
శరభాదివనజంతు-జాలనినాదముల్,
గర్జారవంబుల గతివహింప।

గీ. భిల్లహృద్గయమయూరముదు-బ్రీతినొంద।
మేచకచ్ఛవులుడువీధి-మెండుకొనఁగఁ:
దనరుఘనవృత్తి నీమహేం-ద్రంబుదీని।
కబ్బెజీమూతనామమ-న్వర్థమగుచు॥ ౨౧౮॥

మ. కిరియంచున్న్రపభిల్లుఁ డొక్కఁ డిషువా-ఖేటేచ్ఛనచ్ఛోభయుం।
శరభల్లూకము పైనిగుడ్చనదియా-క్రందించెఁదోడ్తోడన।

గ్దరులాక్రందనమాచరించెఁ బ్రతిసా-దస్ఫూర్తిచే నాశ్రితుల్।
పరితాపంబును జెందధీరత వహిం-పన్వచ్చునే యేరికిన్॥ ౨౧౯॥

ఉ. భిల్లుఁడొకండు పొంచితన-పెంపుడు లేడిని బట్టెనంచుఁ జే।
బల్లెముఁ బూని పెద్దపులి-పైకిఁ జనం జననీక మోముజా।
బిల్లిఁబటాగ్రమానివిల-పించెఁ దదంగన కీరశారికా।
పల్లవభుజ్మయూరమధు-పస్వరసోదరమాధురీధ్వనిన్॥ ౨౨౦॥

క. మానవవర చూడుము గిరి।
కాననమున నొక్క-పల్లి-కామిని దిరుగున్।
దానికరంబు అగతిఁగడు।
దానితొడల్ దానిగతులె-దానిగతులగున్॥ ౨౨౧॥

చ. తరిమి కిరాతుఁడొక్కఁడుగ-దందన పెంపుడు రావిగుంపుపై।
కరుగుమతంగజంబునన-హంకృతి మోదఁగఁ దద్గజంబుత।
త్తరమునఁ బారి తామరలఁ-దత్తరు వాటికిఁ బోవు ధాత్రియం।
దరయఁగ గల్గునే విశద-మైన వివేకము మందబుద్ధికిన్॥ ౨౨౨॥

క. అనుచుం బెక్కువిధంబులఁ।
జనవున వచియించు నర్మ-సచివునితోడన్।
మనుజేంద్రుండు రహస్యం।
బున నిట్లని పల్కె విజయ-మోదితుఁడగుచున్॥ ౨౨3॥

సీ. సకలదేశస్థులు-చతురంగబలముల,
సందడిచేఁ బీడ-జెందకుండ।
వంగకళింగభూ-వరుల నోడించిన,
పగిది నన్యుల నోడు-పరచకుండ।
వీరజనక్షయ-కారణంబైన సం.
గరమనవరతంబు-జరుగకుండ।

మనస్సైనుకులు పెక్కు-దినములు పరదేశ,
గురుపరిశ్రమమునఁ-గుందకుండ।

గీ. మత్తమాతంగ సైంధవ-మణిసువర్ణ।
ముఖ్యవివిధోపధలున్న ప-ముఖ్యులిటకు।
వచ్చి ప్రియపూర్వకంబుగా-నిచ్చిచనిరి।
కంటిదిగ్విజయాగత-ఘనయశంబు॥ ౨౨౪॥

చ. కరమనురక్తుఁడైయొసఁగెఁ-గాని నిజాలయసీమనంగ భూ।
వరనివహంబులో మగధ-వర్యుఁడనుజ్ఞకు రాకతక్కనీ।
వెరిఁగినఁ దెల్పుమాతనియ-భీష్మమటంచు వచింపమేదినీ।
వరుని మొగంబు నర్మసచి-వప్రవరుండొగిఁ జూచియిట్లనున్॥ ౨౨౫

క. సగరుండాదిగ మీవా।
రగుదురు బంధువులు వారికది హేతువుగా।
మగధోర్వీనాథుఁడు తన।
నగరికి మిముఁ దోడుకొనిచ-నఁగఁ దలఁచెన్నృపా॥ ౨౨౬॥

మ. మిగులం బంధువుఁడుత్తమోత్తముఁడు నీ-మేలెప్పుడుం గోరు ధ।
ర్మగుణోపేతుఁడు సత్యసంధుఁడమితౌ-దార్యుండు సద్వంశుఁడీ।
మగధక్ష్మావరుఁడీతఁడాత్మనగరీ-మార్గంబునన్ వేడ్కరాఁ।
దగునంచుం బిలువంగఁ గాదనుట బాం-ధవ్యంబె భూవల్లభా॥

క. కావున మీరా మగధో।
ర్వీవిభుపురికేగి పిదప-విచ్చేయవలెన్।
భూవల్లభ సాకేతపు।
రీవర మునకనిఁ బలికె-నృపుఁడాతనితోన్॥ ౨౨౭॥

ఉ. చెచ్చెర నీవు మాగధుని-చెంతకు వేడుకతోడ నేగి తా।
వచ్చు మదీయ భూపతిభ-వన్నగరంబున కెల్లియంచు మబెం।

పచ్చుపడంగఁ జెప్పి తెలి-యంగను జాటఁగఁ బంపు రేపురా।
జిచ్చటనుండి పుష్పపురి-కేగునటంచును సేనకున్నతిన్॥ ౨౨౯॥

చ. అనివచియింపసర్మసచి-వాగ్రణిమానవసాధుఁ డానతి।
చ్చిన తెరఁగంపయున్మగధ-సింహళునకేర్పడఁ దెల్పి తగ్గవా।
రిశివడిఁ బంపె సేనలకు-రేపు నరేంద్రుఁడు పుష్పపట్టణం।
బునకరుఁగందలంచెనని-భూరిరవంబునఁ జాటిచెప్పఁగన్॥ ౨౩౦॥

ఉ. ఆమరునాఁడు సైనికచ-యంబులు దేవగణంబు లెల్లసు।
త్రామునిఁ జేరవచ్చిన తె-రంగలరం దనవెంట రాసము।
ద్దామవిభుత్వమొప్పుఱగ-థస్తుతుఁ డైరవివంశవార్ధిరా।
కామృతధాముఁడేగెనుర-యంబునఁ బుష్పపురంబు చెంతకున్

మ. మనుజాధీశుఁడు జూచెఁ బుష్పనగరిన్-మత్తద్విపేంద్రావళీ।
ఘనకర్ణత్వజనానిలోద్ధతమగు-త్కల్లోలినీక్రమకాం।
చనకంజాతపరాగవాసితసమం-చత్పాంథవీథీచర।
ద్వనితాగానరసప్రమోదితసుప-ర్వన్ నేత్రపర్వంబుగన్॥ ౨౩౨

సీ. ప్రాకారరత్నశా-ఖా కాంతులుడువీథిఁ,
గంకణగ్రహణవై-ఖరులఁ బూన।
సౌధాగ్రనిహితకాం-చనకుంభరుచిమిన్న,
వాకతమ్ములకుఁ బై-వన్నెయొసఁగఁ।
జలదురథ్వజపటా-నిలమునందనఖేల,
దమరదంపతులకాహ్లాదమొసఁగ।
గోపురాగ్రస్థవజ్రోపలచ్ఛవులభ్ర,
కరిమేనికాంతులు-గలసిమెలఁగ।

గీ. చైత్రరథసన్నిభారామ-సరసకుసుమ।
సమితిసౌలభ్యలహరిని-ర్జరమహీజ

చరదళులవిందునకుఁబిల్వఁ-బరగుపుష్ప।
పురము నేత్రోత్సవము జేసె-భూమిపతికి॥ ౨౩౩॥

సీ. చంద్రికాంతోన్నత-సౌధవీధులనుశా,
తక్రతవాశ్మవి-తర్దికలను।
విలసిల్లుగరుడప-చ్చలరచ్చలనువిద్రు,
మస్తంభఘనకాయ-మానములను।
వైడూర్యవర్ణిత-ద్వారబంధములను,
గోమేధికాంచిత-కుట్టిమములఁ।
గలితకార్తస్వరా-గారరాజంబుల,
మరకతసోపాన-మార్గములను।

గీ. ప్రబలతరవజ్రఖచితగో-పానసులను।
రత్నదీపికలనుపుష్య-రాగతోర।
ణములమౌక్తికసితవితా-నములదనరు।
మగధభూపతినగరమా-మనుజవిభుఁడు॥ ౨౩౪॥

క. చూచ్చెన్నిజసౌందర్యస।
ముచ్చయములుజూచిమోద-మునసులతాంగుల్।
మెచ్చికరపల్లవంబుల।
విచ్చలవిడిమేడలెక్కి-విరులాగిజల్లన్॥ ౨౩౫॥

శా. కాకుస్థాన్వయదుగ్ధవారినిధిరా-కాచంద్రునింగాంచిన।
ప్రాకారాంచితమైజెలంగువిపుల-ప్రాసాదసీమన్సము।
త్సేకంబొప్పగనిల్పిమాగధుఁడుమం-త్రిశ్రేణితోనిత్యమ।
స్తోకప్రీతిభజించువజ్రిసురయు-క్తుండైయుపేంద్రుఁబలెన్॥

మ. భయమున్భక్తియుఁగల్గిమాగధుఁడుస-న్మానింపఁదన్మంత్రిసం।
చయమెల్లంగనుసౌజ్ఞతోమెలఁగవై-చక్షణ్యమొప్పంబురీ।
నయవిద్బృందమువందులట్లుబొలుపొం-దంజేరికీర్తింపదు।
ర్జయశౌర్యుండుదిలీపుఁడుండెనుసము-త్సాహంబుతోసప్పురిన్॥

శా. పారావారభయంకరానమితదృప్యచ్చాపశృంగారశృం।
గారాంచత్పదధూతమౌనిలలనో-గ్రప్రస్ఫురాకారరా।
కారాతీశ్రసదృగ్యశోహృతతమః-కల్పక్షమాభారమా।
భారత్యాదిస్రుతావరాదిదివిజ-ప్రస్తూయమానాకృతీ॥ ౨౩౮॥

క. వామాంకనివిష్టమహీ।
జామూర్ధకలాపకాంతి-సంయుతవిలస।
ద్వామభుజాంగదవంచిత।
వామేతరబాహులగ్న-వరకేయూరా॥ ౨౩౯॥

## మణిగణనికరము.

దినకరకులజల-ధితుహినకిరణా।
వనరుహభవసుర-వరనతచరణా।
దనుజసముదయహృ-దయభయదరణా।
ఘనతరహితముని-గణభవహరణా॥ ౨౪౦॥

గద్య — ఇది శ్రీజానకీరమణచరణార్పిత మనశ్శతపత్త్రి హరిసగోత్త్ర పవిత్త్ర కొటకలపూడి వేంకటరామపుత్త్ర విద్వద్విధేయ సరస కవితాధేయ వేంటకృష్ణనామధేయప్రణీతంబైన దిలీప చరిత్త్రంబను మహాప్రబంధంబునందుఁ

ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

---

# దిలీపచరిత్రము.

---

## తృతీయాశ్వాసము.



మద్వైదేహీహృ।
త్తామరసమిళిందనతశ-తక్రతుముఖనా।
నామర్త్యబృందనిశితో।
ద్ధామాస్త్రిసమీరదళిత-దానకవందా॥ ౧॥

గీ. అవధరింపుము శౌనకా-ద్యఖిలమునుల।
తోడనిట్లనిపలికెసూ-తుండుమగధ।
మనుజనాయకకులమున-మనుకులీఁను।
డాప్తతతితోడవసియించె-నతిముదమున॥ ౨॥

ఉ. అంతవసంతకాలమల-రారెసమస్తవియోగిమానినీ।
స్వాంతదురంతకృద్భ్రమర-సంఘగరున్మరుదుచ్ఛలద్వనో।

పాంతనితాంతనూతనల-తాంతపరాగపరంపరాసమా।
క్రాంతదిగంతరాంచదతి-కాంతరసాలనవప్రవాళమై॥ ౩॥

మ. సుమగుచ్ఛస్తనపాళితో మధుకర-స్తోకాలకశ్రేణితో।
రమణీయారుణపల్లవాధరముతో-రాజన్మరాళేంద్రయా।
నముతోఁ గాంచనకాంతితోఁ బికవధూ-నాదంబుతో సేవితో।
త్తమవల్లీప్రమదాళితోఁ దగెవసం-తశ్రీధరామండలిన్॥ ౪॥

శా. కాంతారాంతరసీమలన్దరుచు గాఁ-గన్పట్టెవల్లీమహీ।
జాంతప్రస్థలతాంతసంతతివసం-తాశాంతకంఠీరవా।
త్యంతక్రూరపలాశకోరకనఖా-గ్రానీకనిర్భిన్నసా।
మంతానేకపకుంభనిర్గళితకుం-భస్థౌక్తికప్రక్రియన్॥ ౫॥

సీ. కలకంఠ[redacted]దంబు-కాహళధ్వనిగాఁగ,
దగుమరందమువసం-తంబుగాఁగఁ।
జిలుకపలుకు-లుద్విజా-శీర్వాదములుగాఁగ,
ప్రాలుపూవులుదలఁ బ్రాలుగాఁగఁ।
దుమ్మెదల్ హోమాగ్ని-ధూమరేఖలుగాఁగ।
లతలుపుణ్యాంగనా-తతులుగాఁగఁ।
వెలయు లేఁజిగురుటా-కులునివాళులుగాఁగఁ,
గుసుమరజంబుభ-గ్గుండిగాఁగ।

గీ. స్థలసరోజాతతతులుగం-ధచషకములు।
గాఁగ మీనధ్వజుఁడుయాజ్ఞి-కతవహించి।
కడిమిమీఱఁగఁ గావించె-ఘనవివాహ।
విధులుమాధవవనరమా-మిథునమునకు॥ ౬॥

మ. ధరణీభాగమునన్వసంతుఁడనువ్ర-తప్రధ్వంసికోపించిభీ।
కరవాతూలపవిత్రహారములవ్ర-క్షక్ష్మాధరశ్రేణికిం।
గరమొప్పారెడుపండుటాకులను జె-క్కల్ద్రుంపఁదోతెంచునె।
త్తురుబోట్లోయునబాలపల్లవముల-స్తోకప్రభన్భాసిలెన్॥ ౭॥

సీ. సలలితచందనా-చలకూటములయందుఁ,
బలుచందములఁ గ్రీడ-సలిపిసలిపి।
సాలతమాలకం-కేళీపలాశాది,
నిఖిలాగములనీడ-నిలచినిలచి;
కలితమాకందకం-దళగళన్మకరంద,
ధారాజలంబులఁ-దడసిదడసి।
మల్లికాదిలతామ-తల్లికావళులందు,
బాగుగానుయ్యాల-లూగియూగి।
గీ. యఖిలసరసులయందీత-లాడియాడి।
పుష్పాదులదిన్నియలయందుఁ-బొరలిపొరలి।
మందగంధవహార్భక-బృందమిపుడు।
సంచరించునువనులవ-సంతములను॥ ౮॥

క. దక్షిత హేమంతహిర।
ణ్యాక్షాగ్రజుబ్రచ్చివెలయు-నట్టిమధునృహ।
ర్యక్షునినఖరములోయన।
వీక్షింపపలాశముకుళ-వితతులుదనరెన్॥ ౯॥

శా. వచ్చెన్ భాస్కరుఁడుత్తరంబునకుఁగ-ర్వస్ఫూర్తితోఁ గూయఁగా।
జొచ్చెంగీరములున్బికంబులునహో-స్తోమంబులుద్వృత్తిచే।
హెచ్చెంగెంజిగురాకుబాకుఁగొనిపు-ష్పేషుండుదుర్వారుఁడై।
వ్రచ్చెంబాంథమనస్సరోజములుస-ర్వంబైనయయ్యామనిన్॥ ౧౦॥

మ. తరుణాపుష్పితకింశుకంబులుమరం-దస్నేహసాంద్రంబులై।
చరదిందిందిరకజ్జలోజ్జ్వలములై-ఛాయాసమాచ్ఛాదిత।
స్ఫురదంఘ్రిస్థలులైదగంతరనట-చ్ఛోభాతిహృద్యంబులై।
కరదీపంబులవంగనయ్యెడఁదగెం-గాంతారభాగంబులన్॥ ౧౧॥

శా. కీరంబుల్ మృదువైనశబ్దములుగు-ల్కింపంబికంబుల్ మనో।
జ్ఞారావంబునఁ జూడమందపవనుం-డత్యాదరస్ఫూర్తిఁ జె।
న్నారన్దీరిక లెల్లదిద్దగనుమ-త్తాళుల్ ప్రశంసింపక।
న్నారన్స్మారుఁడుజూడ నాడిరిలతా-బ్జాస్యల్ మరుత్ప్రీతిగన్॥

మ. అరుణాస్తోకపలాశదర్శితసము-ద్యత్సాంధ్యరాగంబుభా।
సురరోలంబగరుత్ప్రకల్పితతమ-స్తుత్యంబుసత్కోరకో।
త్కరనక్షత్రసమేతమైతనరెకాం-తారంబకాలక్షప।
న్వరుసంగోకిలసచ్ఛకోరతతికా-నందంబుగావింపుచున్॥ ౧౩

సీ. ప్రసవితాశోకస్మ-రప్రతాపోజ్వల,
జ్వలనంబులకుధూమ-సమితులగుచుఁ।
గమనీయమల్లికా-కాంతోపకంఠసీ,
మలకునీలాచ్ఛధా-మంబులగుచుఁ।
బ్రవహితనవపుష్ప-రసతటినీప్రక,
రంబులకిందీవ-రంబులగుచుఁ।
గానలక్ష్మీము-ఖప్రదేశములకు,
ఘనతరకుటిలాల-కంబులగుచు।

గీ. విరహిణీమానసంబులు-గరుగ పంచ।
శరునికీర్తింపు మనుసము-త్సాహమునను।
సకలవనముల నెప్పుడు-సంచరిఁచు।
సమదషట్పదచయములా-సమయమునను॥ ౧౪॥

చ. అనుమతుఁ డైవసంతుఁడుర-యంబునవచ్చెనటంచుఁదత్తరం।
బునమకరందగంధజల-పూరముకుంజగృహంబులన్వనాం।
గనలాగిచల్లితీర్చెనని-గారవుముత్తెపుముగ్గులోయనం।
గనదగునయ్యెడన్ మలయ-గంధవహచ్యుతపుష్పబృందముల్॥

మ. కలితోరుస్తబకస్తనాగ్రములభృం-గంబుల్ నవేంద్రోపలో।
జ్జ్వలధామచ్ఛవిభాసిలంగిసలయో-ష్ఠంబుల్ చలింపన్ మరు।
చ్చలదుత్కృష్టలతాంగనామణులులా-స్యక్రీడలం దేలిరిం।
పలరారంగవికస్వరోచ్ఛవననా-ట్యాగారభాగంబునన్ ॥ ౧౬॥

మ. తిలకాంచన్ముఖసంచరద్భ్రమరకో-త్సేకంబుతో గుబ్బగు।
త్తులపైపల్లవకంచుకాంచలములాం-దోళింపఁ దెల్లంబుగా।
వలపుల్ మీరవసంతునిన్ రతులశే-వం దేల్చుచున్నానన।
స్థలిసిట్టూర్పునిగుడ్చె నో యనజగ-త్ప్రాణంబు వీచెన్గడున్ ॥ ౧౭॥

మ. తలపన్భూమిరుహంబులత్తరినిని-స్తంద్రంబుగాఁ బువ్వు తే।
నెలువర్షింపరజోమలీమసత చే-నిర్యుక్తయై పల్లవా।
మలహస్తంబులపుష్పజాలకతతిం-బ్రాపించు నీరార్పుచున్।
బిలుచున్మాధవు నింబికస్వరములోఁ-బ్రీతిన్ వనశ్రీదగన్ ॥ ౧౮॥

మ. కలకంఠీరవమొక్కచోటనొకవం-కన్శారికాబాలికా।
కలనాదంబొకచెంత మత్తమధులి-డ్గానంబు వేఱొక్కచో।
విలసత్కీరవధూవచోవిభవము-ర్విన్ భాసిలెం బాంథులన్।
గెలువన్వచ్చినశంబరాంతకచమూ-క్ష్వేళానినాదంబులై ॥ ౧౯॥

మ. సుమనస్పల్లవజాలభూషితములై-సొంపొంది హేమాభిరా।
మ్యములజ్జారుతరేంద్రవైభవముల-న్మందారకల్పోత్తమ।
ద్రుమసౌరభ్యపరంపరోన్నతమరు-త్స్తోమప్రచారంబులం।
గమనీయాతనుసంపదం గనియెస్వ-ర్గస్ఫూర్తి నారామముల్ ౨౦॥

చ. తనయునివైభవోన్నతిము-దంబునఁ జూచుచు దక్షిణాశ నే।
ననయము సంచరింపఁ బ్రియు-లైనసరోజినులన్ గ్రమక్రమం।
బునఁ గృశియింపఁ జేయుహిమ-పుంజమటంచు రథంబు క్రమ్మరన్।
దినమణి ద్రిప్పె నో యనను-దీచికి రాదొణగెన్ రయంబునన్ ! ౨౧॥

చ. వనరుహబాంధవుండుహిమ-వర్గములన్విదలింపనుత్తరం
బునకరదంబువిక్రమస-ముజ్జ్వలులైనడిపింపమారుడు।
న్వదఘుతేరుదీచికిను-దగ్రగతిన్నడిపించునోయనం।
గొనగొనివీచెబాంధులెదఁ-గుందఁగగండపుకొండగాడ్పొగిన్॥

ఉ. కేళిసరంబులన్మదన-కేళులుదేలురథాంగదంపతుల్।
తాలిమిలేకసాంధ్యసము-దంచితరశ్ములటంచుఁజూడఁగం।
కేళులుకర్ణికారములు-కింశుకముల్ మహినుల్లసిల్లెహా।
రాశముగాబహుప్రసవ-రక్తరుచిస్థగితాంబరంబులై॥ ౨౩॥

ఉ. కోరకదంతపఙ్క్తులను-గుచ్ఛకుచంబులబాలపల్లవో।
ద్గారరదాంశుకంబులను-దంచితపుష్పరుచిస్మితంబులన్।
భూరివసంతయౌవనవి-భూతిమదభ్రమరాలకంబులన్।
సారసపత్త్రిలోచనల-చందములన్గనుపట్టెమల్లికల్॥ ౨౪॥

శా. పూచెంగింశుకకింకిరాతవిటపుల్-పూదీవెలల్లాడఁగా।
వీచెంజందనశైలమారుతములు-న్వృత్తిన్ధనుర్గపాణియై।
లేచెంబాంధులనేచదర్పకుఁడుప్రా-లేయాంబుసంహారియై।
కాచెందమ్ములనుత్తరాభిముఖతం-గంజాప్తుఁడయ్యామనిన్॥ ౨౫॥

క. ఈరీతివసంతముజగ।
దారాధ్యతదనరసార-సాననమగధ।
క్ష్మారమణసుతసుదక్షిణ।
నారీమణికేళికావ-నంబునకెలమిన్॥ ౨౬॥

చ. తనసుకుమారరూపలలి-తద్యుతులన్ప్రియపూర్వకంబుగాఁ।
గనుగొనియాడిగంపుచెలి-కత్తెలునెమ్మదిసంతసిల్లఁగాం।
చనసిబికన్వసిం[illegible]పెలు-చన్జనియెన్మధులక్ష్మిజూడఁగా।
ననుమతినేగుసావయువ-యైనమనోజునిమాయయోయనన్॥ ౨౭॥

క. ఈకరిణింజనిచనినా।
ళీకానన హేమసిబిక-లీలావనిసు।
త్సేకమునడిగ్గరత్నతు।
లాకోటినినాదములు జె-లంగంగడిమిన్॥ ౨౮॥

గీ. అందలముడిగ్గి గురుతరా-నందమునను।
గామినీమణి గోస్తనీ-కాయమాన।
సలలితచ్ఛాయనిలిచె నె-చ్చెలులు దాను।
సురుచిరారామవిభవంబుఁ-జూచుచుండ॥ ౨౯॥

చ. ఇరుదెసలంజెలంగెడుమ-హీజములన్వసించునీడజో;
త్కరములమంజులార్భటులు-దారగతిందనరారెఁగానసేం।
దిరలుసమీపమందనుమ-తిస్మగధాత్మజసంచరింపఁగా।
వరుసనొనర్చుతత్కుశల-వార్తలొకోయనుచుండనయ్యెడన్॥ ౩౦॥

ఉ. పల్లవపాణిపైయుభయ-పార్శ్వలతల్ పవనప్రయుక్తలై।
తెల్లనిక్రొవ్విరుల్ కొడమ-తేఁటులపాటలునీటుఁజూపుచుం।
జల్లెలతాంసలీకరణి-సమ్మతిభావివివాహవేళల।
న్దెల్లముగాఁగఁజల్లుదురు-దీవనప్రాలని తెల్పుకైవడిన్॥ ౩౧॥

క. వీకన్జెలికత్తెలతో।
నీకరణింజిత్రగతిమ-హిందనరెడుకే।
ళీకానన్తముననవనా।
ళీకాననముదముమదిఁద-లిర్పందిరుగన్॥ ౩౨॥

చ. చికురముజారనిక్కియిరు-జేతులగేదగిపువ్వులింపుగా।
నొకచెలిగోయుచుండిగళ-హుంకృతిఁబల్లవబింబబంధుజీ।
వకుసుమశేముషిందనదు-వాతెరపైకరుదెంచుచున్నయా।
పికశుకబంభరావళుల-బెగ్గిలఁజేయునుమాటిమాటికిన్॥ ౩౩॥

ఉ. బాలరసాలభూరుహము-పైకెగఁబ్రాఁకినమల్లికాలతం।
గేలటుసాచివేఱొకస-ఖీమణిపువ్వులుగోయుచుండ వా।

చాలతనొప్పఁగోయిలల-సద్గతిపల్లవమంచువచ్చియా।
కేలుపయిన్బడన్విదల-కించెనుకంకణపఙ్క్తిమ్రోయఁగన్॥ ౩౪॥

శా. నాళీకాయతలోచనాహృతలతాం-తంబైనకంకేళిను।
తేఁకిందాచిలతాంగియోరుతనుర-క్తింబువ్వదేరంగమ।
త్తాళుల్ కైరవబుద్ధిఁగన్నుఁగవడా-యన్నాసతత్పుష్పాలి।
ట్పాళింబారఁగఁదోలెగంధఫలిసౌ-భ్రాత్రంబువాటింపుచున్॥

ఉ. చెన్నఁగవేడ్కతోనిరవ-శేషముగాముగువల్నమేరువుం।
గ్రొన్ననలన్నియున్విదకి-కోయఁగనందొకకాంతనవ్వియా।
పొన్ననెక్రొవ్విరుల్మరలఁ-బుట్టఁగఁజేసెనుబువ్వులేరఁగాఁ।
గన్నియలన్యభూరుహని-కాయముచెంతకుఁబోవకుండఁగన్॥

చ. అతివలతోడనొక్కజల-జాననయీతిలకావనీరుహం।
చితకుసుమంబులన్నిరవ-శేషముజేసెదనంచుపంతముల్।
కుతుకముతోడఁబల్కివడిఁగోయఁగఁజొచ్చెనుబువ్వులాత్మదృ।
గ్వితతులనంతకంతకభి-వృద్ధములౌటయెఱుంగదక్కటా॥ ౩౭॥

గీ. అభినవప్రసవశ్రేణు-లాత్మపాణి।
పల్లవస్పర్శనమునను-ద్భవముజెందఁ।
గామినీమణులెల్లమా-కందములను।
గోయఁజొచ్చిరివేడ్కతోఁ-గుసుమములను॥ ౩౮॥

క. ఒకచెలియశేషముగఁజం।
పకమునఁగ్రొన్ననలుఁగోసె-మధుజృంభణమా।
మకముఖరాగముపేక్షిం।
పకపూనెనటంచుఁగోప-పడెనోయనఁగన్॥ ౩౯॥

క. వనలీభూమిరుహంబున।
మనముంగల్లుమియకుండ-మాధవునికృపన్।
జనియించెననుచుఁగోసిరి।
వనితారత్నములువిరులు-వకుళమునందున్॥ ౪౦॥

క. తరుణులు వసంతలక్ష్మి।
పరిరంభితమగుచు మిగుల-భాసిల్లులస।
త్కురవకమునఁ గోసిరి మృదు।
కరములుఁ గ్రొన్ననలు తనువు-గందక యుండన్॥ ౪౧॥

గీ. పల్కులనుకర్ణికారముల్-పాటలనుఁ బ్రి।
యాళువుల్ సింధువారము-లాస్యపవన।
ముల నపేక్షింపక వ్వేళఁ-బూచె ననుచుఁ।
గొమ్మలందంద పువ్వులఁ-గోసిరిట్లు॥ ౪౨॥

## రగడ.

కన్నె రమ్మమా-కందము నీడకుఁ।
బొన్న పువ్వులా-బోటిని వేఁడకు।
ముదమునఁ జక్కని-మొగ్గలు గోయుము।
మదషట్పదముల-మరలఁగఁ జేయుము।
కేలుఁ జాచి కం-కేళిని ముట్టకు।
బాల నెలంతుక-పాదము మెట్టకు।
కుందజాలముల-కుం జెయిఁ జాపుము।
మందయాన ద్రో-మగుడు పుకోపము।
దూరము పోకిఁక-దొరకదు కీరము।
వారిజాస్య నీ-వంక నై నేరము।
కొండగోఁగులవి-గోయకు మిక్కిలి।
కొండెము జెప్పను-కొట్టకు మిక్కిలి।
పుష మితమ్ములా-బోటికొసంగుము।
గడుసుతనంబది-కాదు దొలంగుము।
చానవేగఁ జను-సంపఁగి తీగకుఁ।
దేనె వానలా-తెరవున నేగకు।
వారిజాస్య మన-వారినిఁ జీరుము।

కోరిమల్లికా-కుసుమము లేరుము।
ఇందువదననీ-వెంచకు నేరము।
కందెనెుగంచే-గనుకఁడుదూరము।
కోరకంబులవి-గోయుటఁగూడదు।
మారువల్కకా-మానినిబాడదు।
మోవిబింబమని-మొగిసెనుకీరము।
మావిగున్నకిఁక-మానువిచారము।
బాలకింశుక-ప్రసవము లేటికి।
కేలుసాచియొసఁ-గెదవా బోటికిఁ।
బొగడపువ్వులా-బోటికిఁజూపకు।
మిగులదొరకెనం-పెఁగలితేపకు।
సింధువారముల-శేషముగోయను।
బంధుజీవములు-బహుళములాయెను।
కలికికబ్బెతిల-కంబునఁబువ్వులు।
మొలకలెత్తెమో-మునఁజిఱునవ్వులు।
పసరుమొగ్గలా-పజ్జకుఁబోవకు।
ప్రసవరజమునీ-పైఁబడులేవకు।
గరితప్రియాళువు-గాదదిబోకుము।
కురువకంబులవి-గోయఁగరాకుము।
వకుళాగమునకు-వడినాకొమ్మను।
పకపకనగకీ-బాటనబొమ్మను।
బొండుమల్లెలా-పొలఁతినివేఁడకు।
నిండుమూటలివి-నెలఁతుకవాడకు॥ ౮౩॥

క. లలనామణులీరీతిని।
బలుకుచుఁబుష్పంబులేరి-పరమప్రీతిన్।
జలజాకరమునకేగిరి।
సలిలక్రీడేచ్ఛమాన-సంబులఁబొడమన్॥ ౮౪॥

మ. స్వనదున్మత్తమధువ్రతోత్కరగరు-త్సంభూతవాతోన్నమ।
ద్ఘనపాథోజపరంపరోజ్జ్వలపరా-గచ్ఛన్నతీరంబుకో।
కనదోత్కృష్టవిభారుణీకృతకన-ద్గంభీరవాఃపూరమం।
గనలెల్లన్గనిచూచిరత్తరినిత-త్కాసారముత్కంఠచేఁ॥ ౪౫॥

చ. లలితలతాంతరేణుపట-లస్థగితావయవాభిరాములై।
పోలఁతుకలందఱుంబటిక-బూసినభర్మశలాకలన్ శర।
జ్జలధరలేశసంహృతని-శాకరరేఖలఁగేణిసేయుచున్।
నిలిచిరితత్సరోవరవి-నిర్మలతీరమునన్ముదంబునన్॥ ౪౬॥

ఉ. ఆసమయంబునం బ్రియవ-యస్యసుదక్షుణఁజేరిపల్కెను।
ల్లాసముతోడఁజూడుకమ-లచ్యుతమంజుమరందబృందసం।
వాసితశీతలప్రబల-వాఃపిహితైకమహాప్రదేశమై।
భాసిలుఁజక్రవాళగిరి-పద్ధతినీసరసీతటంబిలన్॥ ౪౭॥

మ. అరవిందంబులుతావకాననవిలా-సావాప్తికైయీసరో।
వరమధ్యంబునభానుగూరిచితపో-వ్యావృత్తిచేనిల్చువై।
ఝరిఁగన్పట్టుభవన్నిశారమణసం-కాశాస్యమెచ్చోటతా।
మరలెచ్చోటఖరాంశుఁడెచ్చటనసం-బంధంబుబింబాధరా॥ ౪౮॥

చ. లలనవినమ్రకంజముకు-ళంబులువాఃప్రతిబింబితంబులై।
కలితభవత్పయోధరయు-గచ్ఛవిఁబూనఁదలంచెఁగాననీ।
సలలితపాదపల్లవము-సాటికిరాదగవంచుఁదోఁచుఁగే।
వలమగుసౌమనస్యవిభ-వంబిటమీఁదటఁగల్గకుండినన్॥ ౪౯॥

క. కూలవిరాజత్కుంజర।
సాలాశోకమయిభరిత-జలజోత్పలమై।
బాలామారునితూణము।
పోలికనేతత్సరంబు-పొలుపొందుఁజుమీ॥ ౫౦॥

మ. రమణీత్వత్త్వపదచ్ఛవింబరగుకూ-ర్మంబుల్ భవన్నేత్రవి।
భ్రమతన్భాసిలుమీలుతావకకుచ-ప్రత్యర్థులౌచక్రివా।

కములత్యంతవినీలయుష్మదలక-ఖ్యాతంబులౌ పుప్పలి।
ట్సముదాయంబులుగల్గియీకొలనునీ-చందంబునన్ రాజిలున్।

చ. లలితగతిన్జెలంగుసలి-లభ్రమసన్నిధినొప్పుబాలశై।
వలలతవీచికాతతుల-వక్రతఁగైకొనినాభిచెంగటం।
బొలుపగునీదు నెత్తురుల-భుగ్నతఁబూనినరోమరాజితోఁ।
గలికిసమానమైతనరెఁ-గన్గొను నెమ్మొగమెత్తియద్దెసన్॥ ౫౨॥

క. అంబుధినీరమతిక్షా।
రంబనుచున్రోసియీస-రస్సనకామో।
దంబునఁజనుదెంచినకా।
దంబినియననీలకుముద-తతిరుచిదనరున్॥ ౫౩॥

క. ఏతత్కాసారజలో।
ద్భూతంబగుశైవలంబు-భువితావక జీ।
మూతశ్యామలకచ వి।
ఖ్యాతిం జెన్నారువికసి-తాంబుజవదనా॥ ౫౪॥

ఆ. అనుచుఁబ్రియవయస్య-యగుసుభాషిణిబల్క।
విని ధరాధినాధ-తనయమెచ్చి।
చెలులతోడఁగూడి-వెలిపావడలుగట్టి।
శయములందుశృంగ-సమితిఁబూని. ౫౫॥

క. ఆతరువాతంగడఁగి గృ।
హీతపరస్పరకరద్వ-యీభాసురలై।
సాతులుమత్తమరాళుల।
రీతిఁజలములోనఁజొచ్చి-క్రీడించిరొగిన్॥ ౫౬॥

మ. అకలంకేందునిభాస్యలీకరణినా-హ్లాదంబుతోనిర్మలో।
దకకేళీనిరతిన్జెలంగఁగనుద-ద్వక్షోజహస్తాస్యదృ।
క్చికురామ్రేడితకోకకోకనదరా-జీవాళిశైవాలవ।
ల్లికమైపంకరుహాకరంబువిలసి-ల్లెంబెంపురెట్టించుటన్॥ ౫౭॥

ఉ. నీరములోన నొక్క తరు-ణీమణి గ్రక్కున మున్గి లేచి శృం
గారముగాఁగఁ గొప్పు కర-కంజములెత్తి విదల్చుచుండ యా
సారసపత్రలోచన క-చంబుఁ గనుంగొని పారఁ జొచ్చె కా
సారమరాళముల్ చినుకు-సాగిన మేఘమటంచు భీతితోన్ ॥ ౫౮॥

ఉ. వేరొక బాల కేలనర-విందము గ్రక్కనఁ బూని మున్న నీ
హారకరోజ్వలంబగు ని-జాస్యము పై సలిలంబు చల్లరం
భోరు పరంపరం బటు త-రోద్ధతి బెగ్గిలఁ జేయుదృక్తిం
జారుతరోరు కాంతి పెలు-చం బెదరించు మెఱుంగు పోలికన్ ॥ ౫౯

శా. వారి న్వేఱొక వారిజాస్య చతుర-త్వం బొప్పఁ గామున్గి కేల్
పైరం జిల్లఁగఁ జేయ వేఱొక తెత-త్పాణిన్నిరీక్షించి క
ల్హారభ్రాంతిని లాగి లాగు నెడ న-య్యబ్జాస్య పూఁబోళ్ళ కుం
బారావార సముద్ధతేందిరగతిం-బ్రత్యక్షయై రాజిలెన్ ॥ ౬౦॥

చ. పొలఁతుక లందఱొక్క విరి-బోణి మొగంబు పయిం గరంబులం
దిలకముఁ జారఁ జల్లుకమ-నీయ జలంబల రారె పద్మినుల్
లలితసరోరుహంబులక-ళానిధి పై సహజన్ముఁ డౌటలో
పలఁగను పట్టుమచ్చ విడఁ-బారఁగఁ జల్లు మరంద మోయనన్ ॥ ౬౧॥

ఉ. బారులు గట్టియొండొరుల-పై లతికాంగులు జల్లులాడు కా
సారపయఃకణంబు లాగి-సారసపత్త్రములందు నిల్చి పా
ల్పారె సుదక్షిణాముఖ సు-ధాంశుని వేడుకతోడఁ జూడఁగాఁ
జేరగ వచ్చి యచ్చట వ-సించిన చక్కని చుక్కలో యనన్ ॥ ౬౨॥

క. ఒక రంభోరువు పై వే
ఱొక మదగజయాననీర-మొగి జల్లినఁ జా
లక యా బాలిక తా వే
ఱొక కేసరిమధ్య చెంత-కొయ్యనఁ జనియెన్ ॥ ౬౩॥

చ. శిరమున కల్వ రేకొక తె-జేర్చి భవానిగతిం జెలంగ తా
మరసము కేలబూని యొక-మానిని భార్గవిరీతి భాసిలెన్।

సరసిజసంభవేందుముఖి-చందమునన్ విలసన్మరాళికా।
పరివృతయౌచు వేఱొక తె-భాసిలె తజ్జలజాకరంబునన్॥ ౬౪॥

ఉ. చేడియలయ్యెడం గనక-శృంగములెత్తి జలంబుమీఁదికిన్।
వేడుకతోడఁ జిమ్మవిను-వీధికిఁ దత్సలిలంబు వోవుచుం।
జూడఁగ నొప్పెఁ గాంతలిటు-జొచ్చి కలంపక నందు నిల్వఁగా।
నోడి సుపర్వలోకనది-కొయ్యనఁగా పురమేగు కైవడిన్॥ ౬౫॥

సీ. ఒకహంసయాన వే-ఱొక బిసభుజమీఁద,
నుదిరిఱొమ్మున నీరు-వోదివిజల్ల।
నొక కీరవాణి వే-ఱొక్క బింబాధరి,
నంబుజాతమున వే-యంగనరుగ।
నొకయలివేణి వే-ఱొక పువ్వుబోఁడితోఁ,
జెలఁగి వాక్కలహంబు-సేయుచుండ।
నొకపికకంఠి వే-ఱొక పల్లవాంఘ్రినిఁ,
దెంపున నీటిలో-ముంపఁబోవ।

ఆ. నొకపయోదవేణి-యొక సాంకవామోద।
యొక్క కాంచనాంగి-యొక్క రామ।
వలదటంచు వారి-వారినివారింప।
వారివెడలె మగధ-వరతనూజ॥ ౬౬॥

క. పేలవమగు కౌనుకుచా।
భీలోన్నతి వణఁక బిరుదు-పెంపు వహింపం।
జాలక పదములు దొట్రిల।
బాలిక యొక చెలియ కేలి-పైఁ గేలిడుచున్॥ ౬౭

వ. ఇవ్విధంబున నీరధారాసమావృతయై ధారాధరమండలంబు వెలువడి విలసిల్లు క్రొక్కారు మెఱుంగు తెఱంగున తారకలనుసరింప తరణికిరణావరోధంబు పరిహరించి రంజిల్లు సాకారయగు శాకార జనిపోలిక సామాన్యవల్లికా వేల్లితయై సంక్రందనవనంబుననుండక

వెలికరుగుదెంచి కనుపట్టు జంగమకల్పలతికకై వడి శర పరంపర లతోఁ దరకసంబుననుండక బైకెక్కిన పంచబాణుని కృపాణిక పగిది నచ్చరవువ్వఁబోండ్లు గొలువపాలకడలి వెడలి వెలుంగు వెలిదమ్మియింటివెలందిచందంబునఁ బ్రియవయస్యలతో జలజాకరంబు వెలువడి పులిగడిగినముత్తియంపువడువున మెఱుంగు దోమిన కనకశలాకకరణి మార్తాండమయూఖలాలసయగుపద్మినిభంగి సానఁబట్టినమానికంబురీతి, శరదాగమంబునఁజూపట్టుచంద్రరేఖసరణి, సానయవయగు శంబరారాతిమాయతీరున, మత్స్య కచ్ఛపమకరకుళీరాది జలజంతుసముల్లసితంబై పంచబాణప్రతాపపావకసముద్ధితధూమమాలికావిరాజమానరక్తరాజీవరాజీసముద్గతసమదషట్పదరేఖాసమంచితంబై బాలశైవాలవల్లికాపరివృతంబైగంగత్తరంగడోలికాందోళిత మరాళ రథాంగ విహంగాది సకలసలిలాండజ కోలాహలమనోహరంబై కనుపట్టు నిజవారిపూరంబు నిరీక్షించనేతెంచిన జలాధిదేవతయనఁ దీపించుచు కాసారతటంబున నిలువ నమ్మత్తకాశిని యనుంగుచెలియలు శరచ్చంద్రచంద్రికా ధవళంబులగు మఱుంగుచీరలఁదడియొత్తి నఖరంబులఁజికురంబులచిక్కువాపి చందనాగురుధూప ధూమంబులఁ గ్రొవ్వెద నీరార్చుచుఁ గొప్పువెట్టి కుసుమదామంబులుజుట్టి నిటలతటంబున దిలకంబుఁదీరుగాఁబెట్టి చందనంబందంబుగా మేననలంది మణిమయాఖిల మహనీయభూషణంబులఁ దత్తదుచితప్రదేశంబుల నలంకరించి బంగరుచెఱంగులఁజెలంగు చెంగావిరంగుమెఱుంగుదువ్వలువ లొసంగఁ దదీయాంశుకాభిరామయై మగధరాజనందన మనోహరాకారయై పల్లవితవల్లికలనుల్లంఘించు తెరంగుసంధ్యారాగసమంచిత శశాంకరేఖనాక్షేపించుకైవడి బాలాతప విభాసమానయగుపద్మిని నుల్లసంబాడు వడువున వెలుంగుచు సఖీజన పరివృతయై కార్తస్వరగోపానసీఖచితవజ్రోపల మాలికా ప్రతిబిం

బద్ధ్వీగుణీకృత మౌక్తికరంగవల్లికావేల్లిత మరకత మణిమయ సోపానమార్గంబును, కస్తూరికాకర్దమసంగతగోమేధిక కుట్టిమంబును, ప్రాగ్ద్వారప్రాంతవిభాసమాన శాతకుంభకుంభగుంభిత విధుశిలామయ వితర్దికోపరి విలంబమానవిద్రుమ పంజరబద్ధకీర శారికా కలరవమందీకృత పరిచారికాప్రాగల్భ్యంబును, చిత్రితసుర సంగరసమంచిత భిత్తికాభిరామంబును, గారుత్మతశిలాకల్పిత గవాక్షమార్గసమాగత కాలాగురుధూపధూమమాలికామలినీకృత వితానప్రాంతవిలంబమాన విమలముక్తాఫలగుళుచ్ఛంబును, కటాస్తరణారాజ్యమాన మధ్యప్రదేశంబును, స్ఫటికస్తంభసంఘటిత కాంచనపాంచాలికాంచత్కరాగ్రవిరాజమాన మహితమాణిక్య దీపికానికాయతిరోహిత తమిస్రపటలంబును, తళతళాయమాన తపనీయాదర్శదర్శనీయంబును, శృంగారరసతరంగిత వైడూర్య వలభివర్ణితంబును నై తదారామాంతరంబునం దనరారు మహనీయమందిరంబుఁ బ్రవేశించి సమంచితప్రదేశంబున సుఖాసీనయై వీణావినోదంబునఁ బ్రొద్దుపుచ్చుచుండెనయ్యవసరంబున. ౭౮॥

ఉ. వైరిధరాధినాథమద-వారణకేసరియై ధరిత్రిఁ జె
న్నారు దిలీపునర్మసచి-వాగ్రణి తత్ప్రమదావనంబుఁగ
న్నారఁగఁ జూడ వచ్చి మధు-రాయితమైన తదీయచారువీ
ణారవమాలకింపుచు మ-నంబున సంతసమందెఁ గన్కొనన్॥ ౭౯॥

ఉ. అందములుల్లసిల్లఁగ స-మంచితవృత్తులనట్లు వీణ నే
కొందలి రాకఁ బోణి బలి-కించు నొ వీను లెకయ్యె వింతగా
విందిపుడాతలోదరిని- వేగ మెచూతునటంచుఁ బోయి మా
కందము మాటునన్నిలిచి-కన్గొనెన త్తరుణీలలామమున్॥ ౮౦॥

క. కనుఁగొనె నితఁ డుజగజ్జన
వినుతములగు తద్విలాస-విభవంబులకున్

మనమున వెరఁగందితలం।
చెనుమహి కరుదెంచె వేల్పు-చేడియయుం చున్॥ ౭౧॥

వ. తదనంతరంబ. ౭౨॥

క. అనిమేషత్వము లేదీ।
కనకాంగిసుపర్వకాంత-కాదూహింపన్।
మనుజాంబుజదళాక్షియె।
యనుచున్నిర్ణీతబుద్ధి-యైయా వెనుకన్॥ ౭౩॥

చ. సురుచిరరూపసంపదల-శోభిలుటన్ వరసౌకుమార్యవి।
స్ఫురణ జెలంగుటన్ బ్రబల-భూషలు దాల్చుట భామినీమణీ।
పరివృతయౌటయా మగధ-పార్థివుపట్టియ కాఁదలంచి తా।
నరిగని జావనీపతిబృ-ధ్మాగ్రణి చెంతకు వింతఁదోపఁగన్॥ ౭౪॥

క. ఈకరణినరిగి శక్రకరి।
లాకల్పితమగుసముజ్జ్వ-లస్థలిచిత్రా।
లోకనపరుఁడగుతద్ధర।
ణీకాంతునిఁజూచియిట్ల-నెన్వేడుకతోన్॥ ౭౫॥

చ. నరవర యీపురాంతికము-నన్ దనరారెడు పుష్పదోఁటకే।
వరిగి సుధారసంబుగల-యంబ్రవహించినరీతి వల్లకీ।
వరరవముల్ల సిల్లఁజెలు-వంబుగ నిట్లువిపంచి మీటుచుం।
దరిసాబగట్టి దోకనుగొ-నన్వలెనం చుఁదలంచి చెచ్చెరన్॥ ౭౬॥

క. చనియొక మాకందము చెం।
తను పొంచితదీయరూప-తారుణ్యములం।
గని వెరగందుచు నీకున్।
వినుపింపఁగవచ్చితి నివి-వేకధురీణా॥ ౭౭॥

క. నరకిన్నర విద్యాధర।
గరుడోరగ సిద్ధసాధ్య-గంధర్వముల।

త్తరుణీమణులా బింబా।
ధరికిఁ సరిరారుచారు-తరరూపమునన్॥ ౭౮॥

సీ. అంకురితత్రపా-సంకలితస్మితం,
బతిసితాపాంగలా-లితవిలాస।
మసదృశాభ్యుదితరో-మావళీతారుణ్య,
మత్యంతసౌకుమా-ర్యాస్పదాంగ।
మసమసాయకవికా-రాక్రాంతమానసం,
బనుదినసంవర్ధి-తాభిరామ్య।
మాలోకనీయస్ధ-నాతిశయోదయం,
బపహృతబాల్యచే-ష్టానుమోద।
గీ. మభ్యసితమితచతురవా-గమృతసార।
మంచితాగణ్యలావణ్య-మతులరమ్య।
మఖిలలోకైకసంస్తుత్య-మగుచుఁబొడమె।
నభినవంబైనయౌవనం-బజ్జముఖికి॥ ౭౯॥

క. వరచైత్రంబునదగులతి।
సరణిందొలకరినిదనరు-చంచలరీతిన్।
శరదాగమమునదగుహిమ।
కరకళగతిజవ్వనమునఁ-గలికిచెలంగెన్॥ ౮౦॥

చ. తరగలఁబొరఁదోలునుస-దావళులొరసదావళిందిర।
స్ఫురణముసేయునెప్పుడున-ఖద్యుతిఖద్యుతికానుకొప్పుకో।
ప్పురువడిఁగాంచుకంధరస-మున్నతికంధరయుజ్వలాకృతిం।
దరముదరంబునుందరమె-తత్తరుణీమణిరూపమెన్నఁగన్॥ ౮౧॥

ఉ.. తమ్ములుపాదముల్ మధుహి-తమ్ములుపల్కులుగందుతేఁటిమొ।
త్తమ్ములుముంగురుల్ సునిశి-తమ్ములుచూపులుచక్రవాకపో।
తమ్ములుచన్నులచ్చలలి-తమ్ములుకన్నులుమల్లికాలతాం।
తమ్ములులేఁతనవ్వులమి-తమ్ములుతత్తరుణీవిలాసముల్॥ ౮౨॥

గీ. హంసగమనోజ్జ్వలఖ్యాతి-నలరునడలు।
కలితకమలాభిరామవిఖ్యాతిఁ గాంచుఁ।
గన్నుఁగవనీలకంధర-ఖ్యాతినొప్పు।
కచమువినుతింపవశమెయ-క్కాంతసొబగు॥ ౧౩॥

చ. దరఘనశేషవాశ్చరమ-తంగజపంచకమాలతాంగికం।
ధరకచరోమరాజినయ-నద్వయమానములంజయింపఁగా।
తరతను వేఱు వేఱుగఁబ-దంబులఁగానుకఁగాఁగ నిల్పినం।
బరగిన తేటముత్తెముల-పఙ్క్తియనన్ నఖరాజిభాసిలెన్॥ ౧౪॥

క. వదనాబ్జంబున సోముని।
మదమణఁగింపకుమతండు-మాధవుఁడనుచున్।
మదవతిపదములపైఁబడి।
కదలనితారకలవన్ న-ఖంబులుదనరున్॥ ౧౫॥

ఉ. ఆరమణీలలామకులి-శాంకుశకార్ముకచక్రముఖ్యరే।
ఖారుచిరంబులైనపద-కంజములన్ మధుమత్తతన్మొన।
ల్దీరినపల్లవంబులమ-దింపఁగఁబోలటుగానఁబోదవన్।
చేరునశింపఁగానవిత-పింపఁగ నేటికిమాటిమాటికిన్॥ ౧౬॥

క. సుమనఃకదంబసన్నుత।
కమనీయరుచిం జెలంగి-కంతునితూణీ।
రములతెఱంగునవినుమా।
కమలాననకలితజంఘి-కలుగనుపట్టున్॥ ౧౭॥

క. పొరలఁబెనంగెడుకదలీ।
తరువులుసతతంబుచపల-తంగదలుహరి।
త్కరికరములుచేఁజిక్కిన।
కరభంబులుసమమెకంబు-కంఠితొడలకున్॥ ౧౮॥

మ. విలసద్యౌవనవార్ధి కాగమమునన్-వేమారులావణ్యధా।
రలుతత్కేశపయోధరంబులుసమ-గ్రస్ఫూర్తివర్షింపని।

శ్చలమూలంబయి నిల్వ దూరుకదళీ-స్తంభద్వయంబంచుఁ బూ।
విలుతుం డెత్తినదీవె నాజఘనము-ద్వృత్తిం దగెం దన్వికిన్॥ ౮౯॥

క. శోషమునఁ జక్రవర్తుల।
వేషము గైకొనియఖండ-విభవమున మహిం।
బోషించుక లికి కటితో।
ద్వేషింపఁగవశమె యి సుక-దిన్నెలకెల్లన్॥ ౯౦॥

మ. అవికల్పస్తనభూరిభారజనితా-యాసార్తినో జవ్వనం।
బవమానింపసహింపలేక తనక-త్యంతావనంబైన శై।
శవమం తర్హితమాట నోమదనదీ-క్షాదీక్షితం జాటనో।
యవలగ్నంబు క్రమక్రమంబునఁ గృశం-బయ్యెన్ సరోజాక్షికిన్॥

సీ. అతులనిశ్వాసమా-రుతమాననాభికా,
బిలము వెల్వడి వచ్చు-చిలువయనఁగఁ।
దలుకుదేనియఁ గ్రోలఁ-దలచి మెల్లెల్లనఁ,
బరతెంచు చీమల-బారనంగఁ।
గానుమిన్నాననుండి- ఘనకుచాద్రుల రెంటి,
మధ్యంబుఁ జేరిన-మబ్బనంగ।
లావణ్యనిర్ఝర-లలితవళీభంగ,
ములనాడు బాలశై-వలమనంగ।

గీ. హృదయపద్మంబులకు వచ్చు-కొదమతేఁటి।
జాలనంగ వియోగుల-చలమణంపఁ।
జాలు మారుని మేలైన-వాలనంగఁ।
దలిరుబోణికి నూగారు-దనరు నధిప॥ ౯౨॥

గీ. బాలికామణి పొక్కిలి-బావి చెంత।
వలపు సోపానముల రీతి-వళు లుదనరుఁ।
దదుపరిస్థలిఁ దగు చక్ర-దంపతులన।
వెలుదగు బ్బలుదనరారు-వసుమతీశ॥ ౯౩॥

చ. ప్రకటవయోమదంబునసురస్థలి వే బెకలించి లోననుం।
డకవెలికేగుదెంచుచుఁద-టాలునఁబొక్కిలిఁగాంచినిల్చిదీ।
ఱికయనుబుద్ధిదప్పిగొని-కేలటుజాచుమనోజకుంభికుం।
భకరములోయనంజెలికి-భాసిలెఁజన్నులురోమరాజియున్ ॥ ౯౪

చ. సలలితమౌక్తికాభరణ-సంయుతమైమృదునాదమాధురీ।
విలసితమైసువర్ణరుచి-వేష్టితమైతనరారుచున్నయ।
చ్చిలుకలకొల్కికంధరరు-చింగయికొందునటంచువచ్చిదా।
వెలవెలబోవఁజొచ్చెఁబృథి-వీస్థలిలోనదరంబుభూవరా॥ ౯౫॥

చ. పొలఁతుకసోయగంబనెడు-పూవిలుదాల్పువనంబులోనభా।
సిలుగళపూగపార్శ్వములఁ-జెన్నలరారుమెఱుంగుసోగదీ।
గెలుభుజముల్ నిజంబుపరి-కించుటకుంగనుపట్టునేమహా।
జ్వలరుచిజవ్వనంబనువ-సంతమునంగుచనూనగుచ్ఛముల్ ॥ ౯౬॥

చ. లలితనవీనపల్లవవి-లాసవిశేషమువిద్రుమారుణో।
జ్జ్వలరుచిపక్వబింబఫల-చారుతరాకృతిబంధుజీవమంకేన-
జులసుకుమారవైఖరివి-శుద్ధసుధామధురత్వమాచల।
జ్జలజదళాక్షివాతెఱదె-సన్నరికింపఁగఁగానవయ్యెడున్ ॥ ౯౭॥

చ. భువనములొక్కటన్ గెలిచి-పూవిలుదాలుపుకంబెరెట్టిగా।
రవమువహింతునంచుఁజతు-రత్వముమీఱమనోహరాస్యకై।
రవహిత్తుఁడెత్తుసింగిణిలు-రామబొమల్నిజమట్లుగానిచోఁ।
దివిరికటాక్షబాణముల-తిస్ఫురణంబ్రిసరింపఁజాలునే॥ ౯౮॥

ఉ. చందనగంధిమోముజల-జంబునఁజారువిలోచనంబులిం।
పొందుసితోత్పలంబులస-మున్నతిఁజేసిపయోజసంభవుం।
డందముగాఁగనచ్చటమ-దాళులుతావికిఁజేరిత్రొక్కినం।
గందునటంచునిల్పఁదగు-గంధఫలీక్రియనాసభాసిలెన్ ॥ ౯౯॥

మ. అమలంబైతిలకాంకసంకలితమై-యబ్జప్రభాభంజనో।
ద్యమమైసంతతవాక్సుధాపరివృతం-బైతారకాహృద్యమై।

రమణీయస్మితచంద్రికాసహితమై-రాజత్కళాపూర్ణమై।
రమణీరత్నము నెమ్మొగంబు దనరున్-రాకేందుబింబాకృతిన్॥

ఉ. శేలువసింపరాదు వివ-రింపఁబవల్ మధుసేవ సేయుచుం।
డాలులమూకలిందివియ-నర్హములుండుటకంచుతమ్ములం।
జాలపరిత్యజించివిల-సన్నయనాంబురుహాంతికంబులన్।
వ్రాలినశ్రీలనాననవ-వచ్ఛవిభాసి లెవీమలింతికిన్॥ ౧౦౧॥

సీ. ఆస్యేందుమండలం-బాక్రమింపఁగఁబూని,
వచ్చినవారిజ-ద్వయమనంగ।
స్మితకౌముదీసేవఁ-జేయ నేతెంచిన,
మత్తచకోరయు-గ్మంబనంగ।
శ్రవణకూపాంతవి-శ్రాంత్యర్థమైచను,
దెంచినయనిమిష-ద్వితయమనఁగ।
ఫాలార్ధచంద్రవై-భవముఁ జూడఁగవచ్చు,
కలితోత్పలంబుల-కవయనంగఁ।

గీ. దనరుసుమనశ్శరాసనో-ద్దండకార్ము।
కాయతభ్రూసమీపని-ర్యద్దృగమల।
శాతనారాచశతసహ-స్రములనీను।
కామినీమణినిడువాలు-కన్నుదోయి॥ ౧౦౨॥

సీ. బహుభంగములఁజిక్కఁ-బడు మనప్పులలోన,
సంతతంబునునుంగు-శైవలంబు।
కలకాలమొకరీతిఁ-గలుగదున్నతియని,
జీవనత్యాగంబుఁ-జేయుఘనము।
పారలేనివిభవమె-ప్పుడులేకతలవంచు,
కొనిలాగఁబడియున్న-గూఢపదము।
ఇనకరస్పర్శనం-బునకోర్వఁగాలేక,
చెదరిగహ్వరములం-దొదుగుతమము।

గీ. భవ్యకాంచనమాలికా-ప్రావృతాతి।
శయమెఱుంగనిమత్తష-ట్చరణపఙ్క్తి।
సాటిరానేర్చునేపరా-జయములేక।
వినుతికెక్కెనశుకవాణి-వేణితోడ॥ ౧౦౩॥

సీ. చెలియపాదములురా-జీవచ్ఛవిఁ జెలంగుఁ,
బ్రపదముల్ కూర్మరూ-పమున వెలుఁగు।
కటిసీమ భూదార-పటిమ సన్నుతికెక్కెఁ,
బురుషసింహాకృతిఁ-బరగుఁ గౌను।
వివరింప వళులు త్రి-విక్రమోన్నతిఁ గాంచు,
క్ష్మాభృజ్జయఖ్యాతిఁ-జన్నులమరు।
రామచంద్రాకార-మైమోము రాజిల్లుఁ,
జూపుసితాసిత-స్ఫూర్తిఁ దనరు!

గీ. నీలజీమూతధామమై-నెగడు కేశ।
మతనుహాయశీక్షణోద్వృత్తి-నలరుపలుకు।
నావెలఁదిసోయగంబింది-రావరావ।
తారదశకంబురీతిఁ జె-న్నారు నధిప॥ ౧౦౪॥

మ. అవికల్పంబులగుం గుచంబులరుణం-బౌపక్వబింబాధరం।
బవలగ్నంబు హరిప్రకారమునఁ జె-న్నారున్ ముఖంబబ్జబాం।
ధవమైభాసిలుహంసవైఖరిని యా-నంబొప్పు భూపాలక।
న్గవసాఫల్యముఁ జెందెఁ దత్సుదతిసౌం-దర్యంబు వీక్షింపఁగన్॥

ఉ. పాదములబ్జవిస్ఫురణ-భాసిలుఁ జన్గవ కోకగర్వవి।
చ్ఛేదకమై తగున్వ్యధుని-చెన్నున మోములరున్సుధాకరం।
బైదశనాంశుకంబు దన-రారు సితద్యుతిఁ గన్నులొప్పునా।
హ్లాదకరంబు గాదెకన-కాంగివిలాసముఁ జూడ-నేరికిన్॥ ౧౦౬॥

సీ. పరగనితంబబిం-బము విపులాకృతి,
లలితామృతఖ్యాతి-నలరుమోవి।

శిఖికలాపస్ఫూర్తిఁ-జెన్నొందె వేనలి,
గగనంబుకైవడిఁ-గౌను దనరెఁ।
బోలుపారె మారుత-మ్ములరీతిఁ గన్నులు,
కనుపట్టెనబ్జవై-ఖరిని మోము।
పొక్కిలి విలసిల్లెఁ-బున్నాగసంపదఁ,
కరములు భాసిల్లె-నరుణరుచిని।

గీ. బూర్వవైరంబు మఱవక-పుష్పబాణుఁ।
డభవుమూర్త్యష్టకంబును-నపహరించి।
కలికి నిర్మించెఁ గాఁబోలు-కల దె యధిప।
ఛాందసుండైననలువ కా-చతురిమంబు॥ ౧౦౭॥

మ. అలకానీకము శైవలంబయి ముఖం-బంభోజమై లోచనం।
బులు మీనాలై కటి సైకతంబయి కుచం-బుల్చక్రవాకంబులై।
కలితాంఘ్రుల్కమఠంబులై గళము శం-ఖంబై వళుల్వీచులై।
చెలిలావణ్యరసప్రవాహమనరం-జిల్లున్ మహీవల్లభా॥ ౧౦౮॥

సీ. కచము ఘనాసిత-ప్రచురమై తనరారు,
నగు మోము విధుసమ-న్నతిఁ జెలంగు।
నయనముల్కమలాభి-నందితద్యుతినొప్పు,
నూగారు చక్రిచె-న్నున వెలుంగు।
గురుకుచద్వయము మం-దరధరచ్ఛవిఁ బోలు,
వళులు త్రివిక్రమో-జ్జ్వలతఁ గాంచుఁ।
గౌననంతాకృతిఁ-గమనీయమై యొప్పుఁ,
బిరుదు విశ్వంభరా-భినుతిఁ దనరుఁ।

గీ. బాదములు పంకజోదర-ప్రభఁ జెలంగు।
మేను ప్రద్యుమ్న దీధితిఁ-బూను మఱియు।
రాజశేఖర నీవను-రక్తి నిప్ప।
డాజగన్మోహనాకార-నరయవలయు॥ ౧౦౯॥

చ. వదనము చంద్రకాంతము ప్ర-వాళము వాతెర జాతివజ్రముల్।
రదములు ముంగురుల్ ద్విజ-రాజమణుల్ తెలిగోళ్ళు ముత్తెముల్।
పదములు పద్మరాగములు-బాలిక నెన్నఁ దరంబె భాసిలెన్।
మదనుఁడమూల్యరత్నముల-మర్చి సృజంచినబొమ్మకై వడిన్॥ ౧౧౦॥

సీ. పాదంబులబ్జభ-వచ్ఛవిభాసిల్ల,
శారదాకృతితోడఁల్-మీరుటరుదె।
కటియనంతాకార-గరిమ గన్పట్టంగ,
సారహిచ్ఛాయఁ జె-న్నారుటరుదె।
కానుపంచాస్యమై-ఖరినొప్ప వక్షోరు,
హములు దుర్గోన్నతి-నలరుటరుదె।
కన్నులు కమలాప్త-కాంతి రాజిల మోము,
పద్మానుగుణ్యమై-పరగుటరుదె।
గీ. కచము ధారాధరోజ్వల-ఖ్యాతిఁ బరగఁ।
జంచలాకృతి సీమంత-సరణిఁ దనరు।
టరుదె లోకోత్తరంబులా-సరసిజాస్య।
చారుసౌందర్యవిభవముల్-జనవరేణ్య॥ ౧౧౧॥
గీ. మోము హిమకరబింబాభి-రామమన్న।
సంశయింపఁగ నేటికి-సరసమతుల।
కరయుత హిమకరబింబంబు-లై చెలంగు।
నబలరోమావళీజంఘి-కాధరములు॥ ౧౧౨॥
సీ. వనద వైఖరి నొప్పు-వనిత కొప్పు చకోర,
కములకు పెన్ప్రాపు-కలికి చూపు।
హిమకరద్యుతి దీము-హేమాంగి నెమ్మోము,
శంఖరూపవిరోధి-సతి శిరోధి।
పన్నగోన్నతి మీఱు-బాలిక నూగాఱు,
వసుధ సొంపందు జ-వ్వని పిరుందు।

రంభాకృతిఁ జెలంగు-రమణీయోరుపురంగు,
సారసాస్పదములు-చానపదము।

గీ. లబలపోక్కిలిదంతచ-యంబుజంఘి।
కలునదుముచన్నులధరంబు-కరరుహములు।
నగవులాద్యక్షరోచ్చార-ణంబుమాన।
కచముఖావయవంబుల-కరణిఁదనరు॥ ౧౧౩॥

మ. అనుచున్నర్మసఖుండు మోదమునన-య్యబ్జాస్య సౌందర్యమున్।
వినుతింపంబుల కాంకితావయవుఁడై-వేఁలోకకర్ణంబునన్।
స్వనదున్మత్తలతాంతపాయకధను-ష్టంకారమాలింపుచున్।
వినియెన్భూవిభుఁడొక్కకర్ణమునఁద-ద్వృత్తాంతమాద్యంతమున్॥

గీ. వినినశేశ్వరుఁడానంద-వనధిమగ్న।
మానసాంభోరుహుండయి-మందహాస।
మానసంబున మొలువహ-స్తాంబుజమున।
నతనికేలుగ్రహించియి-ట్లనుచుఁబలికె॥ ౧౧౪॥

చ. సురుచిరరూపసంపదల-శోభిలుమాగధదేవకాంతలా।
తరుణికిసాటిరారితర-తన్వులనెన్నఁగనేలయుంచుచా।
తురిగదియంగఁదొల్లియతి-ధుల్ వినుతింపఁగవింటనిప్పుడా।
గరితయెనీవుగన్గొనిన-కామినిసందియమందనేటికిన్॥ ౧౧౫॥

ఉ. ఆవనమెంతదవ్వసచి-వాగ్రణియచ్చటికెంతలోపలం।
బోవఁగవచ్చునాతలిరు-బోణులుగొల్వఁగనెంతపొద్దురా।
జీవదళాక్షియయ్యెడవ-సించురహస్యముగాఁగనన్నునీ।
వావిరిబోఁడిచెంతకురఁ-యంబునఁదోడ్కొనిపొమ్ముపచ్చెదన్॥

ఉ. మానవతీవిలా-సముస-మంచితవైఖరినీవుదెల్పఁగా।
వీనులకయ్యెపర్వమిఁక-వేననుదోడ్కొనిపోయియాసఖో।
జానఁజూపిసేయుముమ-దంబకపర్వమటంచుధారుణీ।
శానివచింపనింగితవి-చారుఁడునర్మసఖుండుగ్రక్కునన్॥ ౧౧౬॥

శా. కేలుర్విస్థలియందు మోపి యతఁడు-త్రిప్పాంగుఁడై కుండల।
పాళిం బాంగదకంకణంబులు చలిం-పన్ లేచి హస్తంబులాం।
దోళింపన్ లలి నింపు రాంకవము పై-దూగాడ చిత్రాంచిత।
శ్రీలం జెన్నగు వాజిశాలకు సము-త్సేకంబుతో నేగుచున్॥ ౧౧౯॥

క. తురగాధ్యక్షునిఁ గనుఁగొని।
నరనాయకుఁ డేసు నివ్వ-నస్థలి కీవి।
త్వరినతిశీఘ్రముగ నలం।
కరణంబొనరించి తెమ్మొ-క హయంబనఁగన్॥

ఉ. చిక్కని కళ్ళెమాస్యమున-జేర్చి మణీమయమైన మేల్ హలువా।
పక్కిసిరంబు పైనిలిపి-పచ్చలటంగు బిగించి జాళువా।
పక్కెర వైచి చేయఁగల-భంగి నలంకృతిఁ జేసి వేడ్కతో।
నొక్క తురంగరత్నమతఁ-డొయ్యన దెచ్చె నృపాలు పాలికిన్॥

క. అవనీనాయకుఁ డుచ్చై।
శ్రవమున కెనయైన యత్తు-రంగము పైవా।
సవునిగతి నెక్కి చనియెను।
పవనమునకు భటులుఁ గొలువ-పవనజవమునన్॥ ౧౨౨॥

చ. నరవరుఁ డీవిధంబునన-నస్థలి కేగి హయంబు డిగ్గి కిం।
కరతతి నొక్కచో నిలువఁ-గా నియమింపుచుఁ బాదచారియై।
యరిగెఁ గరంబు నర్మసచి-వాగ్రణి పాణి నమర్చి దాక్షుపం।
దిరులరహిం జెలంగు సర-ణిం దరుణీమణి యున్నచోటికిన్॥ ౧౨౩॥

మ. చని చూచెం జెయిఁ జాచి నర్మసఖుఁ డు-త్సాహంబుతోఁ జూపఁగా।
జననాథాగ్రణి భర్మపంజరవిరా-జత్కీరశారీకల।
స్వనసంవృద్ధవిపంచికామధురని-క్వాణప్రభూతప్రతి।
ధ్వనిసందోహ మనేకవిద్రుమమయ-స్తంభోల్లసద్గేహమున్॥ ౧౨౪

చ. సలలితకుంజపుంజముల-చాటున నిల్చి ధరాధినాథుఁడా।
నిలయములోపలం గనుఁగొ-నెం గనకాంగినిఁ గందుకస్తనిం।

కలికిఁగరీంద్రయానకల-కంఠినిగంజవిశాలలోచనం
గలితఘనాలకం గమల-గంధినొ కానొక కామినీమణిన్॥ ౧౨౫॥

మ. అనురాగోదకమంతకంతకధికం-బై పూరితాత్మీయహృ
ద్వనజాతాకరమై చువెల్వడి మెయి-న్వ్యాపింపఁగా నంకురిం
చిన వాంఛామయబీజరాసులనఁ దోఁ-చెన్ రోమహర్షావళుల్
జననాథాగ్రణికవ్వధూటి నిటులు-త్సాహంబుతోఁ జూడఁగన్॥

ఉ. నాతికచంబు సంగను ఘ-నస్ఫురణంబు మృతత్వమిచ్చెన
త్యాతతశీలమో వికమ-లాంచితవృత్తి నొసంగెఁ బాదముల్
చేతులు కన్నులాస్యమిది-చిత్రమెయుంచు కుటీరమారసం
తాతిశయంబు సంగమను-జాధిపు చూడ్కికిఁ గాను కైవడిన్॥

సీ. పదపల్లవముల పైఁ-బలుమారుఁ బొరలినఁ
గందునటంచు జం-ఘలకుఁ బ్రాఁకుఁ
దరుణోరుకదళిపై-నిరతమనుష్ఠింపఁ
జెడునటంచు నితంబ-సీమ కేగు
సతతంబు నాభికా-సరసిలోఁ గ్రీడింపఁ
గలుగు భంగమటంచు-వళులకెగయుఁ
గలశాలమును బేద-కౌను పైవసియింప
నిలువదటంచు గు-బ్బలకుఁ బోవు

గీ. సంతతము మోవి రతనంబు-చెంతఁ దిరుగ
మాటవచ్చునటంచుల-లాటవీధి
కరుగునవ్వృపు చూపు కానిచో-నంతలోన
వదలనేయట్టి మోహనా-వయవములను॥ ౧౨౭॥

చ. ఘనకచవైభవంబు కటి-గౌరవమాస్యవిలాసమంచిత
స్తనయుగళోన్నతత్వము వి-శాలవిలోచనలైగనైగ్యమా
జనపతి చూడ్కికిన్ ముదమొ-సంగుటచిత్రమె శైశవంబుతోఁ
గొనకొని తాఁగృశత్వమునఁ-గుందు వలగ్నము విందుసేయఁగన్॥

సీ. అంగనవదనపు-ల్లాంభోరుహము మీఁద,
వనితలోచనకైర-వములమీఁదఁ।
జందనగంధినా-సాగ్రఫలిమీఁదఁ,
దరళాక్షిదశనకుం-దములమీఁద।
బాలరదాంశుక-బంధుజీవముమీఁదఁ,
గలికికుచస్తబ-కములమీఁద।
సుందరీమణిభుజా-సుమనోలతలమీఁదఁ,
బాలతిపాక్కి-లిపొన్న-పువ్వుమీఁద।
గీ. ఘనచికురహస్తసౌగంధి-కములమీఁద।
సంచరింపుచుమాన వే-శ్వరుని చూపు।
లనిమిషములయ్యె సౌమన-స్యాతిశయముఁ।
జెందువారలకెల్లఁ-సందియంబె॥ ౧౩౦॥
గీ. కొమ్మగళశంఖమునదంత-కుందములను।
బ్రపదకచ్ఛపములముఖ-పద్మమునను।
జంఘికామకరములభూ-జానిఁజూచి।
హర్షమునఁజెందెనిధులప్వ-డబ్బినట్లు॥ ౧౩౧॥
క. కన్నియచారువిలాసము।
లన్నరనాథునకురోమ-హర్షములొదవం।
గన్నులపండువు సేయఁగ।
సన్నుతులొనరించెనతఁడు-చతురతనాత్మన్॥ ౧౩౨॥
శా. చిందంబైకనుపట్టికంఠముబొమల్-సింగాణులైయొప్పెఁజె।
న్నొంచెందూణములట్లజంఘలుపిరుం-దూహించఁజక్రాకృతిం।
జెందెంజూపులుతూపులైతగనశి-శ్రీఁగాంచెనూగారహా।
కందర్పాయుధశాలకాదుగదయ-క్కంజాక్షియూహింపఁగన్॥
సీ. అచలాతిశయలక్ష్మి-నలరునితంబంబు,
పటుసైకతమురీతిఁ-బరగుటరుదె।

చక్రవర్తులవిలా-సముగన్న చన్నులు,
భూమిభృచ్ఛిఖరిఁ-బోలుచుటరు దే।
కమలాభిరామవి-ఖ్యాతిభాసిలుకన్ను,
లనిమిషవిస్ఫూర్తి-నలరుటరు దే।
చంద్రకాంతప్రభా-సలలితంబగు మోము,
మించుటద్దమురీతి-మెరయుటరు దే।

గీ. నీలకంధరసదృశమై-నెగడుకచము।
శిఖికలాపసమున్నతిఁ-జెలఁగుడరు దే।
కంటిమేదినివంటివా-ల్గంటినక్షి।
పర్వముగ నీవిరించిప్ర-పంచమునను॥ ౧౩౪॥

క. ఈవెలఁది యౌవనపువ।
ర్షావేశఁ జెలంగు సజల-జలదము మాడ్కిన్।
లావణ్యసరసిఁ దనరెడు।
శైవాలము చందమునఁగ-చంబల రారున్॥ ౧౩౫॥

మ. చెలి నెమ్మోము నిజాకృతిం జెలఁగ రా-జీవంబు లెల్లన్వనం।
బులలోఁ బ్రొద్దులు బుచ్చుచున్నిదపసం-పూర్ణోడురాడ్బింబమా।
కులతంగన్గొని తన్ముఖభ్రమమునుం-గుంగాకఛండాంశుర।
శ్మలచేఁగందనిపూర్ణవు వాడు నెసుధాం-శుస్ఫారరమ్యద్యుతిన్॥

క. కంతునిశరములలోనా।
ద్యంతములగు కమలకువల-యములరుచులెన్న।
త్రాంతంబులఁగైకొనియి।
కాంతత్రియంబకునిఁ జేసెఁ-గాఁబోలుఁ జుమీ॥ ౧౩౭॥

శా. కౌనభ్రాకృతిభాసిలన్విషధరా-కారంబు జెన్నారుఁ బెం।
పూనన్నోవిరసప్రదంబగుచుఁ జె-న్నొందన్ స్మితాంకూరమున్।
నానాటన్ ఘనసారవైఖరుల నె-న్నంగొప్ప మేఘుచ్ఛవిం।
బూనన్బాలపయోధరంబులిఁక జీ-మూతంబులౌటబ్రమే॥ ౧౩౮॥

క. అంగజునినీవిజాలెతె।
రంగునఁబరికింపరోమ-రాజిదనరుఁద।
న్వంగికుచకుట్మలములుమె।
రంగిడినపసిండిబొంగ-రాలొఁగదరా॥ ౧౩౯॥

క. ఘనకుచకుంభాంతరసీ।
మనువెలువడిజాలుకొనిన-మదధారగతిం।
దనరున్నూగారిచ్చెలి।
ననవిల్తునిమత్తవార-ణముకాదుగదా॥ ౧౪౦॥

క. చన్నులకాఠిన్యమువా।
ల్గన్నులచంచలతబొమల-కౌటిల్యంబే।
కన్నియకానుగనుంగొని।
సన్నగిలెననంగమిగుల-సన్నంబయ్యెన్॥ ౧౪౧॥

క. పుడమినితంబముకాదా।
తొడలుహరికరికరముల-తోసరిరావా।
నడుమభ్రమ్మగుఁగాదా।
పడఁతినవీనాత్మభూప్ర-పంచమునఁదగున్॥ ౧౪౨॥

మ. లలితాఖండవిభూతిఁబూనిమహిను-ల్లంఘించుచుంజక్రవ।
ర్తులవేషంబువహించునట్టికరభో-రుశ్రోణితోనక్రటా।
తులఁదూగంగలవేభయంకరకుభృ-ద్దోషన్పృహాలబ్ధకే।
వలదౌర్గత్యవినిందితంబులగుదే-వగ్రావముఖ్యాగముల్॥ ౧౪౩॥

ఆ. బాలపల్లవముల-పగిదికోమలములై।
విద్రుమారుణచ్ఛ-వింబదములు।
గేళిసేయుమహిఁబ్ర-వాళాంఘ్రినామము।
న్వర్థమయ్యెనీల-తాంగియందు॥ ౧౪౪॥

చ. ధరణినితంబమూరులుమ-తంగజహస్తములబ్జమాస్యమున్।
శరధులుజంఘలస్త్రిములు-చారువిలోకనముల్సుధారస।

స్ఫురణము మోవి గుబ్బలగ-ముల్వ సువంగ ముగ్ధీలగుఁ గ్రుశుతుల్।
తరుణినుతింపఁగానగణి-తప్రతిభాధుర్యునకైన శక్యమే॥ ౧౪౫॥

ఉ. వాతెఱబంధుజీవరుచి-వర్ణితమైతగెఁగన్నులుత్పల।
ఖ్యాతివహించెఁగుందముల-కైవడిదంతములుల్లసిల్లెఁగం।
జాతమురీతి మోమలరె-సంపఁగిమాడ్కిఁజెలంగె నాసయా।
నాతివిలాసమొప్పసుమ-నస్తుతమైస్మరశాస్త్రిమోయనన్ ॥౧౪౬

సీ. జలరుహంబులరీతి-నలరు చేతులు తూండ్లు,
కావుగ దానీల-కచభుజములు।
తరగలగతివళుల్-దనరు కాసారంబు,
కాదుగ దాకంబు-కంఠినాభి।
పరగుఁబూగుత్తుల-పగిదిఁజన్నులులత,
కాదుగ దాపద్మ-గంధియూరు!
నగవుచంద్రికలాగు-దగఁజంద్రబింబంబు,
గాదుగ దాగజ-గమనమోము।

గీ. చూపులలరారుక్రొవ్విరి-తూపులట్లు।
కన్బొమలు గావుగ దమారు-కార్ముకములు।
చంచలాకృతిసీమంత-సరణిఁదనరుఁ।
దరుణిక్రొవ్వెద గాదుగ-దాఘనంబు॥ ౧౪౭॥

సీ. తరుణి వేనలిజల-ధరవిభ్రమముఁగాంచు,
సకియ ముంగురులళి-చ్ఛాయ నెంచు।
నెలఁతముఖంబిందు-నిభదీప్తిఁజెన్నారు,
సుదతిబొమల్ ధను-స్ఫూర్తి మీఱుఁ;
గలికిపాలిండ్లవి-కలోత్పన్నతులఁజెందు,
బాలమధ్యము హరి-లీలనందుఁ।
గొమ్మకటీరంబు-గోసంపదల నేలు.
రమణిజంఘలు మకరములఁబోలుఁ।

గీ. బరగు కాంతాంబుచరయుగ్మ-పటిమ కన్ను।
దోయి యతులంబులైనయా-తోయజాస్య।
తనువిలాసంబులం గజో-త్సాహ రాసు।
లవని మూర్తిభవించెనో-యనఁ జెలంగె॥ ౧౪౮॥

ఉ. చన్నుల విచ్ఛవిన్ మొగము-చంద్రత వక్రత కన్బొమల్ నాసల్।
క్రొన్నెలకూన నాకటిగు-రుత్వము నన్నఖముల్ సితద్యుతిన్।
నెన్నడ మందవైఖరిఫ-ణిప్రభ నారత మధ్వజాకృతిం।
గన్నులు భాసిలుం గలికి-కైకొనెనో ఖచరోరుసంపదన్॥ ౧౪౯॥

క. తలిరుల గతినధరకరాం।
ఘ్రిలు గుత్తుల చందమునను-గుచములు రదముల్।
కళికల పోలికఁ దగు నీ।
లలనమహిం దిరుగు కల్ప-లత గాదు గదా॥ ౧౫౦॥

మ. అనిమేషోరగ మర్త్యమానవతులీ-యబ్జాస్యకున్ సాటిరా।
రనుచున్నా విభుఁడా తలోదరి మనో-జ్ఞాకారముల్ మానసం।
బున వర్ణింపుచు నెట్టకేలకొగి నా-పూబోఁడి పైఁ బ్రాకుచూ।
డ్కిని బల్మిన్ మరలించి నర్మసఖునిం-గ్రేగంట నీక్షింపఁగన్॥ ౧౫౧

క. భావభవశరవిదారిత।
భావుండై తనముఖంబుఁ-బతివీక్షింపన్।
భావజ్ఞుఁడగుటయ పుడా।
క్ష్మావల్లభుఁ జూచి నర్మ-సఖుఁ డిట్లనియెన్॥ ౧౫౨॥

క. ఆరామమల్లికాధర।
ణీరుహముల వరుసఁ జూచు-నెపమున నుధరి।
శ్రీరమణా చని చూచెద।
మా రామలభావమనిన-ననుమతుఁడగుచున్॥ ౧౫౩॥

క. వనలక్ష్మిం గనుఁగొనవ।
చ్ఛిన మానవుఁడోయటంచుఁ-జేతోవీధి।

స్వనపాలకులుదలంచఁగ।
జనపాలకుఁడరిగెనర్మ-సఖసహితుండై॥ ౧౫౪॥

క. ఈకరణిం జనిచంపక।
మాకందామలకతిలక-మధుమన్మథబం।
ధూకాశోకాస్తోకా।
నోకహములవై ఖరులుగ-నుంగొనురీతిన్॥ ౧౫౫॥

ఉ. ఆరమణీలలామలున-మంచితవృత్తివసించుకేళికా।
గారముచెంతనొప్పుశశి-కాంతశిలామయమైనభూమిఁజే।
న్నారుసమోరుభూరుహచ-యంబులనీడఁబటీరభూమిభృ।
న్మారుతముల్పథిశ్రమము-మాన్పముదంబుననిల్చెనిల్చినన్॥ ౧౫౬॥

సీ. చివురువాతెరవాని-చిందంబుచందంబు,
నందనరారుకం-ధరమువాని।
నగుమోమువానిఁబ-న్నగరాజయుగరాజ,
దురుతరాజానుదో-ర్యుగమువానిఁ।
గొమరుప్రాయమువానిఁ-గోమలశ్యామల,
ఘనఘనాఘనకాంతి-గలుగువాని।
లలిజూపువానివె-న్నెలత్రేనివలెనిఁ,
బలుమారుఁదెగడురూ-పంబువానిఁ

ఆ. బసిఁడిచేలవాని-భాగ్యేందిరామంది।
రాయతాంబకద్వ-యంబువాని।
నన్నరేంద్రచంద్రు-నాహ్లాదమొదవంగఁ।
జూచిరప్పుడచటి-సుదతులెల్ల॥ ౧౫౭॥

క. రాకొమరుఁగొమరుతమరు।
త్సేకముతోఁగొమ్మలీగ-తిన్ గ్రక్కునసా।
లోకించిలేచిరుద్ధతతు।
లాకోటీరవముదిక్కు-లంబికగ్రొటిలన్॥ ౧౫౮॥

చ. తనచెలికత్తెలీగతిము-దంబునఁ జేయుటకేమి హేతువో।
యనుచుఁ దలంచిహస్తజల-జాంచితహేమవిపంచిపార్శ్వ వే।
దినినిడి లేచియానరప-తింబులకల్ మెయిఁదోపఁగన్నులా।
ననశశిసాక్రమింపలల-నామణికన్గొనెనిందువేడుకన్॥ ౧౫౯॥

క. రాజీవగంధియపుడా।
రాజవతంసునిద్ర్యధాను-రాగమధూళీ।
రాజత్కటాక్షవీక్షం।
భోజంబులఁగొఱ్ఱలలరఁ-బూజలొనర్చెన్॥ ౧౬౦॥

ఉ. ఆలలితాంగిచూపులున్న-పాగ్రణిపాదసరోరుహంబులన్।
వ్రాలునెడన్ద్విరేఫముల-వైఖరినొప్పవళిత్రయోర్మలం।
దేలునెడన్ఝుషంబులగ-తిందనరారుముఖేందుచంద్రికం।
గ్రోలునెడన్సముజ్జ్వలచ-కోరకిశోరములట్లభాసిలున్॥ ౧౬౧॥

క. ఆరాజన్యునకపుడం।
భోరుహరాగోపహార-ములుచొక్కపుగ।
ర్వ్వారపునీరాజనములుఁ।
గైరవతోరణములయ్యెఁ-గామినిచూపుల్॥ ౧౬౨॥

సీ. పదపల్లవంబుల-పైఁబవ్వళింపుచు,
జంఘికాచ్ఛవితోడ-సరసమాడు!
సలలితోరుస్తంభ-ములకెగఁబ్రాఁకుచు,
నాభికావర్తంబు-నస్మునుంగు।
రోమరాజీలతా-సీమఁగ్రీడింపుచు,
ఘనతరోరస్థలం-బునవసించుఁ।
గమనీయబాహుశా-ఖలనధిష్ఠింపుచుఁ,
జెక్కుటద్దంబుల-చెంతనిలుచు।

గీ. మోవిరతనంబుపైసటిం-పుచువిలోచ।
నాబ్జములనాక్రమించుచు-ఘాలాంతరమునఁ।

గూర్తిఁదిరుగుచు వేగముం-గురులకరుగు।
బాలికామణి చూపుచా-పల్యమునను॥ ౧౬౩॥

క. ఆనాతివీక్షణముధా।
త్రీనాయకమూర్తిచిత్ర-రేఖాసైపు।
జ్యానూనత చేతనపూ।
ర్వానందమునం జెలంగు-ననిరుద్ధగతిన్॥ ౧౬౪॥

చ. ఉవిదవిలోచనాంబురుహ-యుగ్మమునన్ వికసింపఁజేయు భూ।
ధవునినఖోడుదీప్తులు ప-దద్వయరాగరుచుల్ కచాంధకా।
రవితతులానవామృతక-రద్యుతులంచితహాసచంద్రికల్।
చివురుజిరావజీరునివి-చిత్రవిదగ్ధత నెన్న శక్యమే॥ ౧౬౫॥

ఆ. మంజులానురాగ-మకరందసహితంబు।
లైనయావధూటి-కావలోక।
నాంబుజములు గృహము-లయ్యె నరేంద్రుని।
లలితసౌకుమార్య-లక్ష్మికపుడు॥ ౧౬౬॥

క. నరపతియధరామృతరుచి।
తరుణపదాబ్జములునఖసి-తచ్ఛవులాసుం।
దరిదృక్చకోరములక।
త్తరివిందోనరించెముఖసు-ధాకరునిగతిన్॥ ౧౬౭॥

శా. ఆరేఖారమణీయుఁడా కువలయా-హ్లాదప్రదుండాకళా।
సౌరభ్యాన్వితుఁడా మనోజ్ఞకరుఁడా-జైవాతృకుండా మహా।
శారుండా రిపుచక్రగర్వహరుఁడా-శ్యామామనోరంజనుం।
డా రాజాత్మభవుతత్పలంబులకనుం-దానందముం జేయఁగన్॥

చ. తలఁపునఁ గోర్కులన్ బహువి-ధంబుల సందడిసేయుచుండఁగాఁ
బలుచని చెక్కుటద్దముల-పైని శ్రమాంబువులంకురింపఁగాఁ।
గులుకుమిటారిగుబ్బలుగ-గుర్పొడవంగ నకాంగియమ్మహీ।
తలపతిఁజూచిమన్మథసి-తప్రదరత్రుటితాంతరంగయై॥ ౧౬౮॥

క. సుమనోభూషితమై శ।
క్రమణిచ్ఛవిరుచిరమై స-రసమైయతను।
ప్రమదప్రదమై యీభూ।
రమణునిచికురంబు ఘనత-రస్ఫూర్తిఁ దగున్॥ ౧౭౦॥

శా. కస్తూరీతిలకాంకసంకలితమై-గాంతామణీదృక్చకో।
రస్తుత్యస్మితకౌముదీముదితమై-రారజ్యమానాంశువై।
ద్వస్తాంభోరుహచక్రగర్వచయమై-వైశద్యసంయుక్తమై।
యస్తోకచ్ఛవివీనిమోమలరునీ-హారాంశుబింబంబనన్॥ ౧౭౧॥

చ. కళలుకపోలపాలికల-కౌముదినవ్వనవాతెరన్సుధా।
విలసనమింపుతో నెసఁగి-వీనిముఖాంబుజమాకృశేందునిన్।
నిలిపెనుగాకఁ గ్రమ్మరవ-నీపకులైనవాలుతాశనాదిభో।
క్తలుగ్రసితాన్నమిత్తురెస్వ-దత్తము రాజుప్రతిగ్రహించునే॥

ఉ. సందడిసేయుచున్మధుర-సస్పృహతేంట్లనయంబుఁ ద్రిమ్మరం।
బొందుగపద్మపద్మముల-పొంతవసించునెయంచుఁ గ్రొత్తగా।
నిందిరకబ్జసంభవుఁడ-హీనచమత్కృతితో సృజింపఁ జె।
న్నొందునవాబ్జమందిరము-లోయనభాసిలువీని నేత్రముల్॥ ౧౭౩॥

గీ. ఆమృతరుచి నేలుకొనిమంగ-ళానురక్తిఁ।
జెలఁగిబుధసుతమైబంధు-జీవసేవఁ।
దగిసితాజితమగువీని-తొగరుమోవి।
యరుణబింబంబురీతిఁ జె-న్నారుటరుదె॥ ౧౭౪॥

గీ. మూఁడులోకములోకచాప-మునఁ జయింపఁ।
దరముగాదనిచింతించు-చెరకువింటి।
దొరకుచాపదరిద్రతఁ-దొలఁగఁ జేయు।
నోయనందగనీతని-భ్రూయుగంబు॥ ౧౭౫॥

క. ఈనరనాథునికన్బొమ।
లానంగశరాసనంబు-లౌఁ గాకున్నం।

బూనికుటిలంబులగుచును।
మానవతీమణులధైర్య-మహిమఁగలఁచునే॥ ౧౭౬॥

చ॥ హిమకరునిన్ సముల్లసద-హీనకళాంచితమైజయించిహా।
సమునసెతస్మయూఖధన-సంచయమెల్లహరించువీనియా।
స్యమునకుసంభవించెరభ-సంబునమీసపురేకమచ్చతె।
ల్లముగలభించకుండునెక-శంకుహృతద్విజరాజరశ్మికిన్॥ ౧౭౭॥

ఉ. జానువరస్పృగంగుళులు-చందనపంకసమన్వితంబులం।
సానతకర్ణముల్ గుణకి-ణాంకితచారుతరప్రకోష్ఠముల్।
పీనములుద్ధతారినృప-భీషణముల్ వలయాంగదోర్త్రికా।
స్థానములీనశేంద్రునిభు-జంబులహీనతఁబూనవేమహిన్॥ ౧౭౮॥

గీ. రంగవల్లులపోల్కెహా-రంబులలరు।
తెరతెరంగునఁబైచేల-చెరఁగుఁదనరు।
యౌవనశ్రీవిలాసలా-స్యార్హనాట్య।
వేదిగాదుగదావీని-వెడదయురము॥ ౧౭౯॥

క. అంగనలనేచఁదలఁచియ।
నంగుండీనృపతిసుంద-రాకృతిదోమా।
శింగన్బొమలంగ్రమ్మర।
సాంగుఁడుసగుణుఁడుసధర్ముఁ-డైతనరునొకో॥ ౧౮౦॥

చ. తొలఁగెనుబాల్యమింకపొరఁ-దొట్రిలునంచునువామదక్షిణం।
బులకుమనోభవుండుసమ-బుద్ధివయోనుమతంబుగానుర।
స్థలమొగిపంచితెల్లముగఁ-దద్విధమేర్పడనిల్పువాసవో।
త్పలములచేతనాసరస-పద్ధతిభాసిలెనారువీనికిన్॥ ౧౮౧॥

చ. కనుఁగొనివారినెమ్మనము-కౌతుకమందఁగఁజేయమించుడా।
లునమిగులంజెలంగిమహి-లోనవకంబులచెన్నుదాల్చుచున్।
స్తనితగభీరనాదచకి-తప్రచురాహితరాజహంసమై।
ఘనతవహించెనీనృపశి-ఖామణికంధరకంధరాకృతిన్॥ ౧౮౨॥

క. కమనీయబాలశైవా।
లముగ తనూగారుదనరు-లలితోర్మ్మిలచం।
దమునందగెడివళుల్ భూ।
రమణుని పొక్కిలిసరోవ-రము గాదుగదా॥ ౧౭౩॥

క. దిగనేకపకరరుచిరము।
లగుచు నితంబోర్వి భార-మశ్రమమునఁ బూ।
నఁగనోపు వీనితొడలం।
దగు నేమించంగ బాహు-దండంబులకున్॥ ౧౭౪॥

గీ. తమ్ములకుఁ దమ్ములీ నృపో-త్తమునిమృదుప।
దమ్ములత్యంతసుకుమార-తాసమృద్ధి।
తమ్ములీతనిపాదప-ద్మములకును।
తమ్ములధికప్రభాసంప-దలగణింప॥ ౧౭౫॥

సీ. వర్ణించుకచములా-వణ్యరసమ్మును,
నెమ్మోముపండువె-న్నెలలుగాయు।
కుటిలంబులయ్యును-గోమరారుకనుబ్బొమ,
లమృతంబొసంగుబిం-బాధరంబు।
విషమాంబకునిమార్వి-విధమునఁదగునారు,
నాభికాసారసుం-దరతఁదనరు।
కృశతఁగైకొనియుఁ శ్రీ-దశనొప్పులేగౌను,
తరుణారుణస్ఫూర్తిఁ-దనరుపదము।

గీ. లీఘనుండీకళాధాముఁ-డీసధర్ముఁ।
డీమధురవిగ్రహుండీయ-హీనుఁడీగ।
భీరుఁడీరాజసింహుఁడీ-సారసహితుఁ।
డమరులకునైనవినుతింప-నర్హుఁడరయ॥ ౧౭౬॥

క. చిందమ్ములకుందమ్ముల।
కందమ్ములగెల్చువీని-గళరదకచముల్।

కెందమ్ములకుందమ్ముల।
చందమ్ములదనరు వీని-చరణము లెన్నన్॥ ౧౮౪॥

క. సలలితసౌందర్యమునన్।
నలకూబరునిన్ సురేంద్ర-నందనునింగ।
ల్వలరాజున్నలరాజున్।
వలరాజుం గెలువఁజాలు-వాఁడీతఁడగున్॥ ౧౮౫॥

క. అరుణము లైయానరపతి।
చరణములలరారవిరహి-సతులమనోవి।
స్ఫురణములు గలపమరునకుఁ।
దరుణములగు పల్లవాయు-ధములిఁకనేలా॥ ౧౮౬॥

ఉ. వీనిముఖంబు చందురుని-వెల్వెలఁబారఁగఁ జేయుచుండఁగా।
వీనివిలోకనంబులర-విందములన్ ముకుళింపఁజేయఁగా।
వీనిభుజాయుగంబు ఫణి-వృద్ధుని నౌదలవంపఁజేయఁగా।
వీనివిలాససంపద త్రి-విష్టపసన్నుతమాటచిత్రమే॥ ౧౯౦॥

చ. కనుగవ నూతనాంబుజయు-గచ్ఛవిఁ గైకొను కార్ముకంబులం।
గనుబొమ లెన్నఁ జక్రనిమొ-గంబు మ్రుగాంకునిఁ గేరుమానికం।
బునకెనవచ్చు మోవి భుజ-ముల్ భుజగంబులఁ గేళి సేయునీ।
యనఘుఁడు సింహసంహననుఁ-డై జగతిన్నుతికెక్కఁ జాలఁడే॥

క. ఈచందంబునఁ జెలియా।
రాచూలివిలాసమూర్తిఁ-బ్రణుతింపుచుఁ దాఁ।
జూచెం గ్రమ్మర సుమనా।
రాచర్ధనుర్నిషదమంత-రంగముఁ గలఁపన్॥ ౧౯౨॥

చ. మదవతిచూపు భూధవుని-మై మహినాథవరేణ్యు చూపున।
మ్మదవతిమై విచిత్రమహి-మంబ్రసరింపఁగఁ జూడనొప్పెదు।
ర్మదుఁడయి కన్యకాన్నృపుల-మానధనంబులు గొల్లలాడఁగా।
మదనుఁడు మై చు నైజచర-మప్రథమప్రదరంబులాయన్॥ ౧౯౩

క. మానవతీమానవపతి।
మానసవారణములతను-మదజృంభణపెం।
పూనుచులజ్జాధీరా।
హీనాంకుశహతులఁ మరల-వించుకయ్యెన్॥ ౧౯౪॥

క. అన్యోన్యప్రకటీభూ।
తాన్యోన్యమనోనురాగు-లైకన్యారా।
జన్యులలరారిరయ్యెడ।
నన్యోన్యప్రణయగర్భి-తాలోకములన్॥ ౧౯౫॥

చ. పొలఁతుకసానురాగయయి-భూపతిఁజూచుటకున్ మహీశుఁడా।
నెలఁతనుసాభిలాషుఁడయి-నేర్పునఁజూచుటకింతులాత్మలో।
పలవలరారమాగధిసు-భాషిణిఁగన్గొనిపల్కెనీతఁడో।
కలికిదిలీపుఁడన్యులకుఁ-గల్గునెయిట్టివిలాసమెన్నఁగన్॥ ౧౯౬॥

చ. దినకరవంశ్యుఁడీనృపతి-దిగ్విజయంబొనరించిక్రమ్మరం।
దనపురికేగుచుండమగ-ధక్షితిభర్తమదీయపట్టణా।
యనమునమీదురావలెన-టంచువిధేయతవిన్నవించినన్।
వనరుహగంధిపుష్పపురి-వచ్చివసించుటనీవెఱుంగవే॥ ౧౯౭॥

ఉ. కంతునికంటెనైషధుని-కంటెవసంతునికంటెయామినీ।
కాంతునికంటెఁదత్సుతుని-కంటెఁగుబేరునిపట్టికంటెఁబా।
కాంతకసూతికంటెలలి-తాకృతినొప్పుదిలీపమేదినీ।
కాంతుఁడటంచునీకుఁజెలికత్తెలుదెల్పరెపెక్కుభంగులన్॥

చ. కలికిదిలీపుఁడేతగిన-కాంతుఁడునీకనిమున్నెచ్చెలు।
ల్బలుకఁగఁబూర్వజన్మకృత-భవ్యతపఃపరిపూర్ణులైనకో।
మలులనుగాకమత్స్యదృశ-మానినినాన్నృపమౌళిచూడఁగాఁ।
దలఁచునెయంచుఁబల్కితివ-తండెసుమీయితఁడంబుజాననా॥

చ. ముదమునఁజూచెనీనృపుఁడే-మూల్యతరావయవాభిరామసం।
పదగలనిన్నునీవితని-బంధురరూపవిలాసవైఖరు।

ల్పదఁపడిలోచనద్వితయ-పర్వముగాఁగనుఁగొంటివల్పమే।
మదవతినీపురాకృతస-మగ్రతపఃపరిపాకమెన్నఁగన్॥ ౨౦౦॥

ఉ. వేడుకపువ్వుబోఁడులను-వెల్వలఁబారఁగఁజేయఁజాలునీ।
లాలితరూపయౌవనవి-లాసములారడిబోవకుండనీ।
పాలిఁటిభాగ్యదేవతను-భస్థితిఁబుష్పపురంబులోనికిన్।
బాలికయీదిలీపనర-పాలునిఁదోడ్కొనివచ్చెఁజెచ్చెలున్॥ ౨౦౧॥

క. ఈవిధమునను సుభాషిణి।
భూవరునివిధంబుఁదెలుపఁ-బొలఁతుకమతిపూ।
ర్వావిర్భూతవ్రీడా।
భావజులకుఁజిత్రకలహ-పద్ధతిజరిగెన్॥ ౨౦౨॥

మ. చిరునవ్వొప్పఁగఁగాంతవేఱొకతెరా-జీవాక్షులారాభయం।
కరశత్రుక్షితిపాంబకంబులఁదోలం-గంజేసితానక్షతాం।
గరథాశ్వధ్వజనూతుఁడైజయమనిం-గైకొన్నభూజానివే।
మరుకాంతాంబకమగ్నుఁడయ్యెననిన-ర్మస్ఫూర్తిఁగాఁబల్కెఁగన్

చ. గరితమనంబునాటనొక-కామినినవ్వుచుఁదేరిచూడనె।
వ్వరికివశంబుగానిగరు-వంపుఁబ్రతాపముగల్గియుండితా।
సురుచిరదక్షిణాభిగతిఁ-జొక్కెనొకోయిపుడీయునుండుచూ।
పరులవిలోచనంబులకుఁ-బర్వముసేయునటంచుఁబల్కెఁగన్॥

సీ. జవ్వనులారయీ-సర్వజ్ఞుఁడార్యాంత,
రంగకుండనియొక-రమణిబలుకఁ।
జెలులారయీఘనుం-డిలసితాపాంగోత్స,
వప్రదుండనియొక-వనితబలుక।
వనజాక్షులారయీ-యినుఁడుపద్మినివేడ్క,
నలరించుననియొక-కలికిబలుక।
సఖులారయీరాజ-శ్యామానుషంగుఁడై,
విలసిల్లుననియొక-వెలఁదిబలికె।

గీ. భాసమానేందుముఖులార-యీసు రాఁగ।
డహహాలతమూనలాలించు-ననుచునొక్క।
లలనబలుకంగబలితంబు-లజ్జకతన।
తరుణిప్రతిసీరచాటున-కరఁగఁదలఁచె॥ ౨౦౫॥

ఉ. అత్తరిఁబల్కెనర్మసచి-వాగ్రణిభూపతితో నెఱింగనీ।
చిత్తముతన్వినీవచల-చిత్తమెఱింగితినీకులాఖ్యలా।
బిత్తరితోడనెచ్చెలులు-పెంపుగఁదెల్పుదురంతకంటెము।
న్నుత్తరలాక్షిమాగధియ-టంచునెఱింగితివీవుబుద్ధిమై॥ ౨౦౬॥

క. భావిశుభంబునకేనుమ।
హీవరమాగధునిపాలి-కేగదనీకా।
భూవరుఁడుకూకుదుండై।
వావిరిసిరిహరికోసంగు-వార్థిగతిఁదగున్॥ ౨౦౭॥

క. కావునవిడదికిఁగ్రమ్మర।
వేవేగఁజనంగవలెఁబ్ర-వీనత్వమెరా।
జీవాత్ములున్నయెడదా।
శ్రీవల్లభతడవుసంచ-రించుటఁజెపుమా॥ ౨౦౮॥

మ. అనుచున్నర్మసఖుందుదెల్పవినియా-యాసంబునన్వామలో।
చనపైచూడ్కిమరల్చిభావమునయా-చంద్రాస్యసౌందర్యమే।
య్యనవర్ణింపుచునేగెఁగ్రమ్మరతురం-గారూఢుఁడైవందులిం।
పునఁగీర్తింపఁగఁబూర్వగేహమునకా-భూనాథసింహుండోగిన్॥

గీ. చనినరేంద్రుండుపరివార-జనులునిలిపి।
కామినీమణిరూపురే-ఖావిలాస।
గతులుకన్నులఁగట్టిన-కరణిఁదవర।
నతనుసంతప్తమానసుం-డయ్యెనపుడు॥ ౨౧౦॥

క. మానవతీలావణ్యప।
యోనిధిమగ్నాత్ముఁడయ్యె-నొవరించెహితా।

నూనప్రార్థనమునను మ।
హీనాథుఁడు మజ్జనాది-కృత్యములెల్లన్॥ ౨౧౧॥

క. తానపుడొవరించినసం।
ధ్యానతిమొదలైననిత్య-మగుకర్మముదో।
డ్తోనరపతిమరచెమది।
స్త్రీనాక్షివిలాసమాక్ర-మించుటకతనన్॥ ౨౧౨॥

గీ. భావమొకరీతితత్తర-పడహితంబు।
గావటంచునుగసిగాటు-గాభుజించి।
వేగఘనసారమధికంబుఁ-గాఁగనపుడు।
చేసెతాంబూలమారాజ-శేఖరుండు॥ ౨౧౩॥

ఉ. సూటిగనెమ్మది న్నగుని-సూనశరంబులుమాటిమాటికిన్।
నాటవనాటసాయకగ-ణక్షుభితద్విపరాజవైఖరిం।
బాటవహీనుఁడైచివురు-పాన్పుపయిన్ మెయిగీలుకొల్పియా।
బోటిఁదలంచుచు న్నరచె-భూవరుఁడన్యములైనకృత్యముల్॥

సీ. ఉవిదలావణ్యాబ్ధి-నోలలాడకయున్న,
కాయజతాపమే-కరణిఁదొలఁగుఁ।
కలికివాతెరపాన-కముఁగ్రోలకుండిన,
నతనుదుర్దాహమే-గతినణంగు।
రమణివచస్సుధా-రసమబ్బకుండిన,
మన్మథోన్మాదమే-మాడ్కిఁదరుగు।
నెలఁతలేనగవువె-న్నెలలుసోకకయున్నఁ,
జేతోజతిమిరమే-రీతిఁబోవుఁ।

గీ. బడఁతికుచశాతకుంభకుం-భద్వయంబు।
గైకొనకయున్న చెఱుకు-విల్కానివిషమ।
మైనబునమెట్లుదీరున-టంచువిభుఁడు।
ప్రబలతరమైనచింతాభ-రమునఁజిక్కె॥ ౨౧౫॥

ఉ. చక్కదనంబునందనకు-సాధ్యుఁడుగానిమహీవిభుండు చేఁ।
జిక్కి సుదక్షిణాకృతివి-శేషవిభూతిని నేడటంచుఁ బెం।
పెక్కిన వేడ్కతోఁ జిలుక-నెక్కిగుణధ్వనిపిక్కటిల్లఁగాఁ।
జక్కరవింటివాఁడుసుమ-సాయకముల్బరగించెఁ గక్కునన్॥

చ. లసితవళక్షపక్షవిధు-లక్ష్మివిధంబున వాసరాపరా।
వసరవుఛాయపోల్కె గుణ-వత్ప్రభ విష్ణువిభూతి వైఖరిన్।
రసయుత వార్షికాపగఝు-రంబు తెరంగుననంతకంతకున్।
బ్రసవశిలీముఖవ్యథనృ-పాలునకగ్గలమయ్యెనయ్యెడన్॥ ౨౧౭॥

శా. తాంబూలంబుపయిన్ మనంబిడఁడు గం-ధంబందమొప్పారమే।
నం బూయండు విపంచికాధ్వనుల నా-నందంబునం జెందఁడా।
స్యం బాదర్శమునం గనుంగొనఁడు భూ-షల్ దాల్పఁ డప్పంకజా।
స్యం బల్మారుఁదలంచుచున్విభుఁడు మీ-నాంకాంబకభ్రాంతుఁడై॥

శా. అంతర్వాణులు వేడ్కతోఁ దెలుపు కా-వ్యాలంక్రియావృత్తులన్।
సంతోషింపఁడు గాయకాగ్రణిసమం-చద్గానమాధుర్యమం।
త్యంతప్రీతిని వీనులం గొనఁడు గో-త్రాధీశసింహుండుత।
త్కాంతాపీనపయోధరద్వితయల-గ్నస్వాంతుఁడై యయ్యెడన్॥

చ. నిరతముమాగధిన్నృపుఁడు-నెమ్మదినిల్పనతండు నూతనా।
భిరతుఁడటంచు నూతనతఁ-బెంపునమూర్ఖపుమూర్ఛమాత్రమా।
నరపతికేగ్రణం గెనుగ-ణంగునగాక వివర్ణగాదెమా।
త్రిభుచిదొలంగ దేనిదుర-ధీరతతోఁ ద్రపకార్శ్యమందదే॥ ౨౨౦॥

సీ. బాలికామణిముఖా-బ్జము రీతిభాసిల్లు,
 రమణీయరత్నద-ర్పణమె కాని।
కామినీమణి మేని-కై వడి వాసించు,
 చాంపేయకుసుమరా-జంబె కాని।
కలికిగళధ్వని-గతిమధురంబైన,
 వల్లకీమృదులర-వంబె కాని।

కనకాంగిహస్తకో-కనదచ్ఛవిఁ జెలంగు,
లలితనవీనప-ల్లవమె కాని।

గీ. గరితపాలిండ్లగతినొప్పు-కందుకములె।
గానివిభుఁడుతదన్యంబుఁ-గన్నదోయిఁ।
జూడఁడాఘ్రాణమొనరింపఁ-జొరఁడువినఁడు।
చేతనంటఁడురమ్మునఁ-జేర్చుకొనఁడు॥ ౨౨౧॥

మ. సకలాశావిజయంబుగైకొనినరా-జన్యుండనంగుండుమా।
ధుకరజ్యాసహితేక్షుకార్ముకముపూఁ-దూపుల్ ప్రవాళాళికే।
తకకుంతంబెలమిన్ వహించితనపై-దండెత్తిరాసాత్త్వక।
ప్రకృతిన్వేల్వేలఁబారఁజొచ్చెమెయికం-పంబందచిత్రంబిలన్॥

గీ. కామినీమణిమోహనా-కారసహిత।
మానసాబ్జంబుమాతృక-యైనకతన।
ధారుణీపతిమగధసు-తాస్వరూప।
మొక్కఫలకంబుననుచిత్ర-మొప్పవ్రాసి॥ ౨౨౩॥

ఉ. కమ్మనివింటివాఁడుతమ-కంబునవైచులతాంతబాణముల్।
నెమ్మెయినాటకుండఁగను-నేర్పుననొడ్డుకొనందలంచుచం।
దమ్మునమేదినీవిభుఁడు-తత్ఫలకంబువహించివేడ్కతో।
నమ్మదిరాక్షిచిత్రలిఖి-తాకృతిఁజూచుచునుండెనయ్యెడన్॥

ఉ. కామినులున్నచోటడయఁ-గాఁదగదంచుసఖుండుదెల్పినన్।
భూమివిభుండుతద్వచన-ముల్వినికాదనలేకక్రమ్మరన్।
హేమవిభాసియావిడిఁది-కేగమనోజశిలీముఖార్త్తియై।
కోమలివేడియూర్పులని-గుడ్చెవాతెరకందువాఁరగన్॥ ౨౨౫।

మ. చివురుంగైదువజోదురాచిలుకతే-జీనెక్కిపాంథావళీ।
శ్రవణద్వంద్వకఠోరమత్తమధురా-జ్యారావమంతంతకున్।
దివిముట్టన్వలయాకృతిందనువుప-ర్తింపన్వినమ్రాంగుఁడై।
పువుములుక్కల్ విరిబోఁడిపైనిగుడిచెన్-పుంఖానుపుంఖంబుగన్

ఉ. ఆచిగురాకుబోణిహృద-యాంబురుహంబునశంబరారి నా।
రాచములట్లునాటఁగ కు-రంగి తెరంగుననార్తయై దెసల్।
జూచుచు రాజమౌళికృపఁ-జూడక నేఁగెనటంచునిందపై।
వైచెనహో యతండతను-వంచితుఁడౌటయెఱుంగ దేమియున్॥

ఉ. ముట్టదు చెప్పు పద్యమును-మున్ వచియించి శుకార్భకంబులం।
బెట్టదు పంచదారతన-పెంపుడు శారిక కెంత వేడినం।
బట్టదు మేళవించినవి-పంచికరంబున పుష్పమాలికల్।
జుట్టదు క్రొవ్వెదజ్జెలియ-సూనధనుర్దళితాంతరంగయై॥ ౨౨౭॥

సీ. అలిశిలీముఖముకో-మలికయ్యె నెత్తమ్మి,
మృగలోచనకుఁ బుండ-రీకమయ్యెఁ।
దన్వికి వాతపో-తము ప్రభంజనమయ్యె,
శిఖియయ్యె బూర్ణేందు-ముఖికి నెమలి।
నీహారమయ్యె ప-న్నీరబ్జగంధికి,
గ్రహమయ్యె నబలకు-తుహినకరుఁడు।
పున్నాగమయ్యెను-పొన్న కొమ్మకుమాల,
యయ్యె కళావతి-కలరుదండ।

గీ. ముగుదకమృతంబు విషమయ్యె-మృగమదంబు।
మందయానకుఁదరగని-మార్గమయ్యె।
చెలియకరియయ్యె కోకంబు-తలిరుబాల।
కతనునిశితాసియయ్యెన-య్యవసరమున॥ ౨౨౯॥

చ. మొదలదిలీపభూరమణ-ముఖ్యనిఁజూపితదీక్షణంబులం।
గుదురుపడంగఁజేసిమది-కూర్మిజనింపఁధదీయరూపసం।
పదవడివారకంబొసఁగి-బాలికమానధనంబుఁగ్రోధమున్।
గదురమనోజుఁడన్మణియ-గాడుహరింపఁదొణంగెనుద్దతిన్॥ ౨౩౦॥

ఆ. అమ్ములయ్యెతమ్ము-లనిలపోతముభూత।
మయ్యెభారమయ్యె-హారమపుడు।

కొమ్మకాంతరంగి-కుండైనచిత్తజుం।
డరసిఁజూడఁబగతుఁ-డయ్యెఁదుదకు॥ ౨౩౧॥

చ. గళనినదాభిభూతకల-కంఠమపాంగతిరస్కృతాళివా।
క్చలితశుకవ్రజంబుకర-కంకణనాదవిధూతశారికా।
కులమబలంగలంపగమి-గూడెనుదుర్బలులొక్క వేళన।
త్యలఘుబలాఢ్యులౌదురుబ-లాఢ్యులుదుర్బలులౌదురేగదా॥ ౨౩౨

సీ. పాటీరగిరిజగ-త్ప్రాణపోతముమహా,
భూతమయ్యెనుపయో-జాతముఖికిఁ।
గమనీయచూతాది-సుమనఃకదంబంబు,
లతనుకదంబంబు-లయ్యెఁజెలికిఁ।
బృథులోపవనదన-ప్రియసమూహముపర,
భృద్వ్యూహమయ్యెఁజం-బీరకుచకు।
మకరందసంపర్ద్ధ-మానభృంగములుసా,
రంగములయ్యెమ-రాళయాన।

గీ. కాంతరంగకుఁడైతన-రారుచిత్తి।
సంభవుండభియాతియై-సరభసమున।
వనజలోచననపుడుమా-ర్కొన్నఁదలంచె।
నింకఁదక్కినవారల-నెన్న నేల॥ ౨౩౩॥

ఉ. అంగజబాణభగ్నహృద-యాంబుజయైనిలుపోపలేకత।
న్వంగితదీయగేహమురు-యాగ్బునబాసిచనంగమత్తసా।
రంగములూర్పుతావికను-రాగముతోఁజనుదేరతన్మిళిం।
దాంగరుచుల్ఘనచ్ఛవుల-టంచుశిఖుల్నటియింపనుద్ధతిన్॥

క. తరుణీమణియపుడుపవన।
సరసవసుందరలయెడల-సఖిసఖులయెడన్।
కరమలిగివిరక్తిన్భీ।
కరకేతకబర్హమొకటి-కరమునఁబూనెన్॥ ౨౩౪॥

ఉ. తోనరుదెంచు నెచ్చెలులు-తోయజలోచన తెంపుఁ జూచి హా।
హానినదంబు సేయుచు మఱి-యంబున బాలక రాంబుజంబునం।
బూనిన కేతకీదళము-పొంకము గానటులుచ్చి వైచియ।
మ్మానవతీలలామ యగు-మాగధిఁ గన్గొని బల్కి రీగతిన్॥ ౨౩౬॥

సీ తగునె సాహసమీవి-ధంబున నృపపుత్త్రి,
కలుసు సేయఁగనంచుఁ బలికెనొకతె।
యడుగులు కరుకుపు-ప్పొడి గందెని చొప్పట,
మెలఁగ నేటికటంచుఁ-బలికెనొకతె।
కంటకాన్విత కేత-కం బెట్లు కెంగేలఁ,
బట్టుకుంటి వటంచుఁ-బలికెనొకతె।
మగధభూనాథుఁడీ-మాటవింటేమమ్ము,
పరిహరించ డేయంచుఁ-బలికెనొకతె।

గీ. వలదు వలవంత నీకని-పలికెనొకతె।
తలఁపు లీడేరఁగలవని-పలికెనొకతె।
జాసి దేటికి మమ్మంచుఁ-బలికెనొకతె।
ఫలితమా సీతపంబని-పలికెనొకతె॥ ౨౩౭॥

సీ. పదపల్లవము బట్టి-బ్రతిమాలెనొక్కతె,
బోధించెఁ జుబుకంబు బుడికి యొకతె।
చక్కఁగఁ బయ్యెద-సవరించెనొక్కతె,
దోరఁ గద్దుకన్నీరుఁ-దుడిచెనొకతె।
పొలుపొంద బ్రియ వాక్య-ములు జెప్పెనొక్కతె,
యొరపుగాఁ గేలూత-నొసఁగెనొకతె।
గొనబైన విరులవీ-వన వీచెనొక్కతె,
తెచ్చి రాచిల్కనం-దిచ్చెనొకతె।

గీ. ప్రేమతో శారికలను జూ-పించెనొకతె।
పేర్చి పాత్రిలంబములచిక్కుఁ-దీర్చెనొకతె।

వేగిరించుటఁదగదంచు-వేగనొకతె।
కినుకఁబొడమినరీతివీ-క్షించెనొకతె॥ ౨౩౮.

క. ఈరీతిఁ జెలులు వేడిన।
నారీతిలకంబు సిగ్గు-నంబలుకంగా।
నేరకయున్న సుభాషిణి।
తోరంబుగనపుడు వారి-తోనిట్లనియెన్॥ ౨౩౯.

ఉ. పాటలగంధినెమ్మొగము-పజ్జకు వేడుకనూర్పుతావికై।
తేటులు తెంపుఁగూడిజను-దెంచినసంచలితాంతరంగయై।
సూటిదలిర్పనప్పుడొక-చొక్కపుకేతకబర్హమూనినన్।
మాటికిమాటికిన్మిగుల-మానినిదూరెదరేలగోలలై॥ ౨౪౦.

ఉ. ఈయబలావతంసమున-నంతటిలోనదిలీపమేదినీ।
నాయకశేఖరుండుకరు-ణన్వరియించులతాంగులారమీ।
రాయవనీశుఁడీవనరు-హాక్షిపరస్పరమాలిసీమలన్।
బాయకజల్లులాడుతలఁ-బ్రాలోగిఁజూచెదరింపుమీరఁగన్॥

ఉ. ఈనరపాలపుత్రికని-జేశునిఁగూడిముదంబుతోనయో।
ధ్యానగరస్ఫురత్కనక-హర్మ్యములన్సరయూనదీపయః।
పానవిలోలగంధవహ-పాకములన్సురతోదితశ్రమాం।
భోనివహంబుఁబాపికొని-బొల్పలరారెడుమీరుఁజూడఁగన్॥

మ. జయలక్ష్మీసహితుండుకీర్తియుతుఁడా-క్ష్మాభర్తభాస్వత్కళా।
ప్రియుఁడీమాగధిఁబెండ్లియాడునొకొదా-బెళ్లాడడోయంచుసం।
శయమందంబనిలేదిఁకంబరిణయే-చ్ఛంజెందెడున్మాతన।
ప్రియులుర్వీశులటంచుఁదెల్పరెకళా-భిజ్ఞుల్సభాశ్రేణులన్॥

క. తననర్మసచివుఁడీకా।
మినిమందాక్షంబు నేను-మీరుపకంఠం।
బున మెలగుకతనన్నపుఁడీ।
వనితనుగాంధర్వవిధివి-వాహముమానెన్॥ ౨౪౪.

క. ఈరీతితోఁటిచేడెల।
నూరడిలంబలికివినయ-మొప్పారఁగశ్రౄం।
గారవతిగ్యైనమగధమ।
హీరమణకుమారితోఁడ-నిట్లనిపలికెన్॥ ౨౪౫.

ఉ. భావభవాకృతిన్ నయన-పర్వముసేయుచిలీపుఁడీపురిం।
దావకపూర్వజన్మసుకృ-తంబుఫలోన్ముఖమాటఁ జేసిరా।
జీవముఖీసిఖామణివ-సించెమదిన్వ్రతఁ జెందఁ బాడియే।
భావిశుభప్రకారములు-భావమునన్దెలియంగఁజాలమిన్॥ ౨౪౬.

మ. వెలఁదీవిగ్రహహీనుఁడైబ్రతుకుపూ-విల్కాఁడుతన్మిత్రుఁడై।
యలరుంజైత్రుఁడజాతశత్రుఁడటకు-భార్యాంశుండదృశ్యాకృతిం।
గలయన్లోకములోఁజరించునుజగ-త్ప్రాణుండువీరుర్విలోఁ।
జెలులంగొందలమందఁజేతురెమదిం-జింతింపనీకేటికిన్॥ ౨౪౭.

క. భావజుఁడుభామినీమణి।
పూవిలుతుఁడుగాఁడెనీవు-పూఁబోడివిగా।
వేవిగ్రహించునావీ।
తోవిదుషియనంగఁదగువ-ధూమణివిగదే॥ ౨౪౮.

చ. రమణిరొయుష్మదుక్తులతి-రస్కృతమైనహయంబునెక్కినీ।
బొమలకునోడినట్టివిలు-బూనిభవత్కచభరనిర్జిత।
భ్రమరగుణంబమర్చివల-రాజుత్వదీయకటాక్షవంచితా।
స్త్రములనినన్జయించునెవి-చారముమానుమమానసంబునన్॥

ఉ. శంకరలోచనోదితకృ-శానుశిఖాభిహతాంగుఁడైనమా।
వాంకుఁడుయుష్మదీయసము-దంచదపాంగవిలోకనంబులన్।
బంకజగంధిసాంగుఁడుస-బాణుఁడుసధ్వజుఁడౌటనీకుక్షే।
మంకరుఁడౌకృతఘ్నుఁడెర-మాతనరోయుండువిచారమేటికిన్॥

సీ. ప్రబలాగమాంతధ-ర్మప్రవీణుండవుట,
నమృతదీక్షిధికిమే-నల్లుఁడౌట।

సుమనఃకదంబసం-స్తూయమానుండౌట,
మంజులసుగుణాళి-మాన్యుఁడౌట।
శుకముఖద్విజవర-స్తోత్రపాత్రుండౌట,
శ్రితవనప్రియగణ-సేవ్యుఁడౌట।
ఘనతరానిమిషలాం-ఛనసమేతుండౌట,
పాలితాఖిలజగ-త్ప్రాణుఁడౌట।
గీ. భువిని పురుషోత్తమునికిసు-పుత్రుఁడౌటఁ।
జైత్రునకుఁ బ్రాణసఖుఁడౌట-సకలజనుల।
స్వాంతరంగికుఁడౌటనూ-సాంబకుండు।
తెగువసేయఁడునీమీఁద-మగువవినుము॥ ౨౫౧॥

ఉ. నీమధురోక్తికీరములు-నీగమనస్ఫురణక్షమరాళముల్।
నీముఖవైఖరిన్ విధుఁడు-నీనటనక్రియలన్మయూరముల్।
నీమృదువేణితుమ్మెదలు-నీగళనాదమునన్పికంబులో।
కామినివంచితోద్ధతులు-గావెమదిన్ భయమందనేటికిన్॥ ౨౫౨॥

చ. గరితమనంబునన్వెతలఁ-గ్రాఁగకుగోలతనంబుమానుకా।
పురములుసేయవాపదలు-బోఁటులకోర్కియొభూషణంబువే।
గిరపడువారువెయ్యేడసు-ఖింతురెనాపలుకాలకింపునీ।
వెరుగనిదానవాచెలుల-నేలగలంచెదవింతయేటికిన్॥ ౨౫౩॥

క. మీతల్లిదండ్రులంభో।
జాతాననభోజనావ-సరమగుటసఖీ।
ప్రీతమతోనీవచటికిఁ।
బ్రీతింజనకున్నమదిని-బెగడరిచెపుమా॥ ౨౫౪॥

క. తడయుగరాదిచ్చోటను।
పడఁతుకనీవనుచువిన్న-పంబొనరిఁచినే।
ర్పడరఁగనంతిపురమునకు।
వడిఁదోడ్కొనిచనియెసాటి-వనితలుబోగడన్॥ ౨౫౫॥

సీ. కందినరదసాంశు-కర్త్రవాళంబుమి,
క్కుటమైననిట్టూర్పు-గాలి వేడి।
వికలీకృతములైన-మకరికాపత్త్రిముల్,
పయినుబ్బిపారిన-భాష్పఝురుల।
సడలినమణిమయాం-చత్కాంకణప్రము,
ఖాకల్పములుగోమ-లాంగకృశత।
వాడినగళవిభా-స్వత్పుష్పమాలికల్,
దీపించుహృదయసం-తాపపటిమ।

గీ. పారవశ్యముపంచాస్త్రి-బాణపీడ।
చూపరులకెల్లఁదెలుపుమో-హోపగాని।
మగ్నమానసయ్యెనిట్లు-మగధతనయ।
జనియెశుద్ధాంతమునకుభా-మినులతోడ॥ ౨౫౬॥

క. భోజనభాజనహస్తాం।
భోజనభాంగుళులుదట్ట-ముగనంటుపడన్।
భోజనమొనరిచెనపుడం।
భోజనయనచెలులునేరు-పునవేడుకొనన్॥ ౨౫౭॥

క. వీణలవినగోరదుఘున।
గానముసేయదువిడెంబు-గన్గొనదొరులన్।
మానవతీతిలకముతన।
మానసమానరపతికిస-మర్పించెనొకో॥ ౨౫౮॥

చ. తరుణిప్రభాతదీపికవి-ధంబునశారదనీరదేందిరా।
స్ఫురణవళక్షపక్షనిశి-పాలికపుష్పితచూతయష్టివై।
ఖరిఁగుముదస్ఫురత్తటిని-కైవడికాంచనగర్భముక్తయా।
కరిగమనాకృతిందవరె-గాటపుపాండిమపూనఁబర్వఁగన్॥

మ. కమనీయాకృతిచేతనన్నుగెలువం-గాఁబూనువర్తించుభూ।
రమణాగ్రేసరుఁడాదిలీపుఁడబలా-రత్నమ్ముచేతన్ సరో।

జమునన్ నిల్పినటంచుచిత్తభవుఁడే-చన్నాగతజ్జన్నదే।
శముతద్వైరికొసంగుచోనతనుడే-చన్మాను నేమానినీ॥ ౨౬౦॥

క. కనుఁగవఁదెరచిన వేళను।
కనుగవమూయు నెడఁదోఁచు-కాముదిలీపా।
వనిపతుల భేదమంగన।
వనవింటగ్రహించిమాయు-నయనము లెపుడున్॥ ౨౬౧॥

క. తనుసంతాపము సైపక।
వనసజ్జను మేనుఁజేర్చి-నన్ మిక్కిలి వే।
దనఁగొల్పెమదతల్పము।
తనుశరతల్పమయిశత్రు-తన్గోమలికిన్। ౨౬౨॥

చ. చిలుకలకెల్లఁబద్యములు-జెప్పుటమానిక రారునాట్యతుల్।
సలలితవృత్తివీణెలకొ-సంగుటమానివిశిష్టలాస్యముల్।
నిలయమయూరసంతతికి-నేర్పుటమానిమ్మదూపచారముల్।
కలుకులు జేయరాదెపుడు-కంటికినిద్దురముద్దరాలికిన్॥ ౨౬౩॥

మ. తనకుంసంభవకారణంబయినచి-త్తంబింతిభూజానికి।
చ్చినతద్దైర్యధనంబుమారుఁడలుకం-జేకొంటచిత్రంబుగా।
దనుమానింపకమధ్యవర్తియగుకా-ర్శ్యంబుదతింగంజలో।
చననర్వాంగములాక్రమించిమణిభూ-షల్ జార్చుటబ్రంబగున్॥

క. మేనంధవళిమబూనెను।
మానవతీమణిదిలీశు-మానవనాథా।
ధీనయశస్త్రిప్రతినిధి।
యై నెగడందలఁచెనొప్రి-యానుకృతినవన్॥ ౨౬౫॥

సీ. దివిజాదినాయక-స్తవనీయవిభవుండు,
లీలావతీమధు-లిద్గుణుండు।
పద్మావధూమణీ-భవనాయితాత్ముండు,
వచనవంచితనిశా-వల్లభుండు।

సుమనస్సమూహసం-స్తుతభుజాశౌర్యుండు,
ధారుణీజనసన్ను-తోరుయశుఁడు।
జానపదీభూత-శత్రురాజన్యుండు,
నిర్మలినస్వాంత-నీరజాతుఁ।

గీ. దేవరేశ్వరుఁడనుచునా-యింతిబలుక।
చెలులునవ్విత్త్వదుక్తవి-శేషణాది।
వర్ణవాచికవాచ్యుఁడే-వనితయనిన।
ముదితప్రత్యాగతీత్రప-మోముపంచె॥ ౨౯-౭॥

చ. చెలులుదిలీపభూవిభుఁడు-చేసినదిగ్విజయప్రభావముల్।
లలితగతిన్వచింపగవి-లాసవతీమణిమోముపంచిదు।
ర్బలుఁడునవంగుఁడుంగుసుమ-బాణుఁడుమార్గానియానరేంద్రునిం।
గలచఁగనోపునాయనుచుఁ-గన్నులనించుకవోష్ణబాష్పముల్॥

ఉ. పంకజనేత్రలాకమల-బాంధవవంశ్యునిసద్యశఃప్రతా।
పాంకితగద్యపద్యనిచ-యంబువచింపఁగఁదన్మయాత్మయై।
సాంకవగంధినేత్రజల-జద్వితయంబొకకొంతమోడ్చిమీ।
నాంకధనుర్విముక్తవిశి-ఖార్తిగణింపకయుండెనయ్యెడన్॥

సీ. కుడ్యచిత్రితములై-కొమరారునిఖిలని,
ర్జరయామినీచర-సంగరములు।
కలితవితానాంశు-కరచితంబైనపా,
రావారమదనీక-ధావిధంబు।
ఫలకభాగలిఖిత-బలియజ్ఞవాటికా,
సంచరద్వామన-స్వామిమహిమ।
నాటకీకృతజగ-న్నాటకసూత్రధా,
రకుఁడైనపార్వతీ-రమణచర్య।

గీ శంబరారాతికార్ముక-జ్యావిముక్త।
శాతనారాచపీడిత-స్వాంతయైన।

కామినీమణి కాశ్చర్య-కరముగాఁగ।
బోఁటులాగిఁ దెల్పుచునుబొ్రిద్దు-బుచ్చిర పుడు॥ ౨౯౯॥

వ. అంత. ౩౦౦॥

శా. రాజీవాయిత నేత్ర శేవితసుమి-తాపుత్త్రినీలాభ్రవి।
భ్రాజద్గాత్ర పురందరాన్వితసుప-ర్వప్రస్తుత శ్చాత్రభా।
పాజానిస్తుతిపాత్రఖండితదశా-స్య పేర్రియసీనూత్రధా।
తీర్రిజామానసపద్మమిత్ర నుతచా-రిత్రాపవిత్రోద్రిదయా॥ ౩౦౧॥

క. సర్గస్థితివిలయాద్భుత।
మార్గనియామక విరించి-మాధవభార్గా।
నీర్గళసన్నుతిశారణ।
దుర్గమభుజశౌర్యదళిత-దుష్టనిశాటా॥ ౩౦౨॥

ఉత్సాహ. మానిహృద్వనీకరా-సమస్తసద్గుణాకరా।
దానవేంద్రభీకరా-నుతప్రభాదివాకరా।
భానువంశసాగర-క్షపాకరాన్నృపార్పితా।
హీనసన్మణీకరా-గృహీతజానకీకరా॥ ౩౦౩॥

గద్య—ఇది శ్రీజానకీరమణ చరణాశ్రిత మనశ్శతపత్త్ర హారితసగోత్ర పవిత్ర కొటికలపూడి వేంకటరామపుత్త్రి విద్వద్విధేయ సరస కవితాధేయ వేంకటకృష్ణనామధేయప్రణీతంబైన దిలీప చరిత్రంబను మహా ప్రబంధంబునందుఁ

దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

---

# దిలీపచరిత్రము.

చతుర్థాశ్వాసము.



శ్రీరంజితభుజసారా।
సూరిస్తుతదివ్యబాణ-శోణితపారా।
వారాకారాసారా।
హారాసారాస్రవక-టాక్షోదారా॥

గీ. అవధరింపుము శౌనకా-ద్యఖిలమునుల।
తోఁడనిట్లనిపలికె సూ-తుండుమగధ।
నృపకుమారిక బోఁటులీ-రీతిఁబలుకు।
పూర్వవృత్తాంతములపొద్దు-బుచ్చుచుండె॥ ౨॥

క. ఈరీతి నాసుదక్షిణ।
మారానలసిఖలఁగ్రాఁగి-మసలుచునుండన్।
నీరేజాప్తుఁడుబశ్చిమ।
వారాకరతటముసరస-వర్తిలుచుండన్॥ ౩॥

మ. అబధీశాశకుమందరస్థితిచయుం-డై భాస్కరుం డేఁగఁగా।
నిబిడస్ఫూర్తిఁ బెరుంగఁజొచ్చెనవని-న్వీక్షింపఁగా నీడదా।
శిబిరంబర్క-కులీనుఁడప్పుడు ప్రవే-శింపన్ స్మరప్రేరణం।
ప్రబలంబైన సుదక్షిణావిరహతా-పజ్వాలచందంబునన్॥ ౪॥
చ. వెలవెలఁబోవుచున్ విరహ-వేదన సైపఁగలేమి చూపులం।
దెలియఁగఁజేయు ప్రేయసుల-దీనత పైకరుదెంచు తేఁటియూ।
ర్పులపొగకందు వారినస-రోజముఖంబులు వచ్చుపద్మినీ।
లలనల దైన్యముంగనిక-లంగుమనంబులు చక్రవాకముల్॥ ౫॥
ఉ. అంబురుహంబులెల్లనల-సాలస వైఖరి వార్తఁ జెందసా।
ఖ్యంబున కైరవాభిముద-మందరథాంగవిహంగముల్ వియో।
గంబు సహింపలేక మది-గంద ప్రతీచి కృశీకృతాంశుపై।
బింబఫలంబుపోల్కి రవి-బింబము గానగ నయ్యె శోణమై॥ ౬॥
మ. వనజాతాప్తునకంతకంతకు బలై-శ్వర్యప్రభావోన్నతుల్।
తనుతం జెందెను రస్మిసంచయముమం-దంబయ్యె మందేహదై।
త్యనికాయవ్యధ సంభవించె భువిన-ట్లౌనెంత తేజస్వికిం।
దనపూర్వస్థితి వారుణీనిరతి చే-తం దప్పి వర్తించుటన్॥ ౭॥
మ. ఇనుఁడస్తంగతుఁడై చనం దలఁచినాఁ-డిచ్చోటికిం జల్వగ।
ల్గినరాజెవ్వటికేగుదెంచునో తమో-లీనంబుగాదే జగం।
బనుచుం బక్షులరాజి కసలినవా-సార్తిన్ వనక్షోణిఘో।
రనినాదంబొనరించెనో యనఁగ-నాక్రందించెనొక్కుమ్మడిన్॥ ౮.
మ. ఉడికించందనవారిభీకరకరో-ద్యోగప్రసక్తిన్ బడల్।
పడజేసెం జటులోదతింగువలయ-ప్రాబల్యమీతండుదా।
నొడయుండైన భరింపరాదనుచు కా-లోద్యోగి ద్రోపింపఁగా।
కడలిన్ మున్గొనినుండనస్మనిగవే-గంబశ్చిమాంభోనిధిన్॥ ౯॥
సీ. ఆశాంతపరిసర్ప-దరుణనటస్మహో,
నటపటుతరజటా-పటలమనఁగ।

యామినీశైలూషి-కాగ్రభాగస్ఫుర,
త్కల్పితమణితిర-స్కరణియనఁగ।
గంధినాయకబాణ-ఖండితమిత్రని,
రోధకమం దేహ-రుధిరమనఁగ।
అస్తమయావస-రాంభోజబాంధవ,
త్యక్తనిజోగ్రప్ర-తాపమనఁగ।

గీ. భావితుహినకరక్షపా-పరిణయోత్స।
వమునకాశావధూటికల్-కమలజాండ।
గృహములంకృతిఁజేయన-ల్కించుసింధు।
రంపుపూతయనన్ సాంధ్య-రాగమలరె.। ౧౦॥

గీ. ఇనునవాయాసమునతన-యింటికడకుఁ।
దెచ్చెనితఁడనివరుణుండు-మెచ్చిసమయ।
కార్యకర్తకుముదమునఁ-గప్పురక్త।
రాంకవంభోయనన్ సాంధ్య-రాగమలరె॥ ౧౧॥

ఉ. హల్లకదంబుజాతము సు-రాగదహార్యముకుంకుమద్రజో।
వెల్లితసత్వధంబుమణి-వేశ్మదగారమురక్తదాపమా।
పల్లవితాగమత్సకల-పాదపమైధరణీతలంబుభా।
సిల్లెనుసాంధ్యదీధితుల-శేషదిగంతములంచుఁబర్వెనన్॥ ౧౨॥

చ. బరఁగెను-చీకువాలిసుని-పర్వమవార్ధినివృద్ధిఁడెందుచువా।
విరిఁబడఁద్రోచిలోకమున-వేళవహించినదుర్యశంబనన్।
వతుఁడరుదెంచునంచుఁజెలు-వంబుగమజ్జనమాడియామినీ।
తరుణితటాలునందడిము-దంబుననార్పఁగవిప్పుకొప్పనన్॥ ౧౩॥

మ. దనరెంజీకటిమూర్తిమత్కమలినీ-దారిద్ర్యవిస్ఫూర్తియో।
జనకాన్వేషణశేముషిందిరుగుభా-స్వత్పుత్త్రియోచందదీ।
ప్తినివెన్నాడిజయించిక్రమ్మరినమం-దేహాసురశ్రేణిన।
ల్లనిదేహచ్ఛవియోయటంచుఁజనులె-ల్లన్ సందియంబందఁగన్॥

ఉ. రాజరుదెంచునంచు ద్విజ-రాజులు నూత్నలెరింగి రాత్రి వి।
భ్రాజిదజాండగేహమును-రక్తితమోమృగనాభినలికి-ధా।
శ్రీజనులెన్న దట్టముగఁ-దీర్చినముత్తెఁపుమ్రుగ్గులో యనన్।
రాజిలెనయ్యెడన్ సురుచి-రంబుగ తారకలంబరంబునన్॥ ౧౫॥

క. తనమణిగగనము పశ్చిమ।
వనిధికి మున్నొసఁగియుతని-వలసం దాగై।
కొనినలసన్మౌక్తికతతు।
లనఁగాఁదనరారె తార-లతిసాంద్రములై॥ ౧౬॥

చ. భ్రములలరారెనయ్యెడము-పాంథుల గెల్వఁగ వచ్చుమారుపై।
సమధికవృత్తి దిక్సతులు-జల్లినముత్తెఁపు శాసలో యనం।
దమసమ్మృతంబొసంగఁగ సు-ధాకిరణుండరుదెంచునంచు మో।
దమున సురల్ కరంబులను-దాల్చినరాజితపాత్రలో యనన్॥ ౧౭॥

చ. అమణితమస్ఫురత్స్నతమ-నాస్యవిలోకమతల్పముప్రదీ।
పమనధికాధరక్షతమ-బంధురబంధమకేళిమందిరం।
బమితభయాన్వితంబనఖ-రాంకమశీత్కరణంబనల్పస్వా।
ఖ్యమచిరముక్తమై సురల-కయ్యెడఁజల్లెవిటీవిటాళికిన్॥ ౧౮॥

చ. కలితవినీలచేలములు-గట్టికటింబిగియంగఁగాంచిని।
శ్చలమతినిల్పియుందెలకుఁ-జాతురిమూకతఁగల్గఁజేసిచే।
తులమణికంకణంబులెగఁ-ద్రోఁచిమనోజసహాయలెంచుపుం।
శ్చలులుపకాంతులన్ సరభ-సంబునఁజేరఁగ నేగిరయ్యెడన్॥ ౧౯॥

ఉ. తల్పములయ్యె బాహ్యవసు-ధల్ విరులయ్యె శిలాలవంబులో।
కల్పములయ్యెఁ గోరికెలు-కన్గవలయ్యె కరంబులుజ్వలా।
నల్పతమిస్రముల్ గృహము-లయ్యె ప్రదీపములయ్యె రాగముల్।
బొల్పలరారు జారిణుల-పుష్పశరాసనకేళికయ్యెడన్॥ ౨౦॥

చ. పరుసదనంబటంచునగు-బాటగునంచునయోగ్యమంచున।
స్థిరమగునంచుతల్పసుమ-దీపనికేతనగంధవీటికా।

విరహితమంచుఁ గొందఱు ప్రవీణులు రోయరు తమ్మిచూలి జా।
రరతిననల్ప సౌఖ్యముప-రాకుననిల్పనొకో గణింపఁగన్॥ ౨౧॥

గీ. అమలినస్నేహమలినంబు-నాటనిఖిల।
కజ్జలఛలమునని జాజ-కంబుఁ బూని।
మిగుల సద్వర్తులగు టత-మిత్రసముదయ।
బ్రోవ వెలుఁగుఁగ తిందీప-ములు జెలంగె॥ ౨౨॥

క. ధవళిమఁ గనఁదగె నంతటఁ।
గువలయహితగర్భభార-కుంఠితయగు వా।
సవదిగ్వనితకు ముఖమునఁ।
దవిలిన దౌహృదపు లెల్ల-దన మోయనఁగన్॥ ౨౩॥

మ. కులటామానసపంకజంబు లతిసం-కోచంబునం గందకే।
వలమోదంబఖిలప్రజానయనసం-జీవముల్ జందవ।
గ్గలమా చిత్తజవేదనం బధికచ-క్రంబుల్ మదిం గందరి।
కళలరేఁడప్పుడు జూడనొప్పె నుదయ-క్ష్మాభృచ్ఛిరోరత్నమై॥ ౨౪॥

మ. తమమెల్లన్ రజనీవరస్ఫురణమ-ర్త్యశ్రేణికిన్ మానసా।
బ్జమునం భీతిజనింపఁ జేయుచుఁ బ్రవం-చంబాక్రమింపం బరా।
క్రమమొప్పన్ సమయాసురాంతకుఁడుత-ద్దర్వంబణంగింపహా।
స్తమునం బాల్చిన చక్రమో యనఁదగెం-జందుఁ డిందుగౌరచ్ఛవిన్॥

క. సాంద్రమయూఖాన్వితుఁడై।
చంద్రుఁడు తనమాళిపైల సద్గతి నిలుపం।
జాంద్రిధవళదుదయాశై।
లేంద్రం బాసమయమున గి-రీశతఁ బూనెన్॥ ౨౬॥

మ. కలితాంకంబుమగా సమీపగతన-క్షత్రంబులెల్లన్ గణం।
బులుగా వారిదమార్గమంబరముగా-భూతేశునింబోలెదా।
నలరారెన్ నెలచంద్రికాధవళితం-బై రాజితాహార్యమం।
జులతం గైకొని జూడనొప్పె నుదయ-క్షోణీధరాగ్రంబుపై॥ ౨౭॥

చ. ఖనదిమృణాలముల్ మెసఁగఁ-గాఁజనుదెంచుమరాళరాజమో।
యనఁగ సురేడ్డిగంగనయ-శంబునఁబూను మెఱుంగుటద్దమో।
యనఁగ కుముద్వతీకృతస-మంచితపుణ్యఫలస్వరూపమో।
యనఁగ సుధాకరుండలరె-యామవతీయువతీముఖాకృతిన్॥ ౨౮॥

చ. చెలఁగెచకోరముల్ వెతలఁ-జెందెరథాంగవిహంగమంబులం।
దొలఁగెఁదమిస్రముల్ మణిఁగె-తోయజముల్ వికసించెనుత్పలం।
బులుగరగెన్ విధూపలస-మూహముదిక్కులపిక్కటిల్లెవె।
న్నెలనెలవేడ్కఁబూర్వధర-ణీధరశృంగమలంకరింపఁగన్ ॥ ౨౯॥

చ. మఱుఁడుజగంబుబాహుపటి-మన్ గెలువంగఁబ్రయాణమైనబం।
ధురగతినల్లగల్వలను-తూపులుకాలుభటుండువెళ్ళిప।
శ్శైరమునినిల్పిపాంథులుచ-లింపఁగదెచ్చిననిర్గమంబునన్।
బరిగనుదర్శితాంకముయి-ప్రాచిసుధాకరబింబమయ్యెడన్॥ 30॥

వ. ఇవ్విధంబునఁ గ్రమక్రమవిముక్తోదయరాగంబై పొరవిడిచిన చిలువరేనిపడగకైవడి శార్దూలచర్మంబు పరిహరించిన కాలకంఠుని కళేబరంబుపగిది, మృణాలపంకాంకిత చంచూచరణంబైన మరాళరాజంబుమాడ్కి, కాళిందీజలప్రక్షాళిత రక్తాంగరాగంబైన నీలాంబరుని శరీరంబుచందంబున, వివర్జితానురాగంబై విష్ణుదేవుని విడువక మెలంగు మానిపుంగవుమానసంబుతెఱంగున ప్రకటితకళంకంబగుచు, కళానిధిబింబంబు మిళిందాన్విత కుందకందుకంబున నధిక్షేపించుచు, సారంగమదతిలకాంకిత శారదాముఖంబునకు సఖంబగుచు, నీలోత్పలశరంబుసంధించి శంబరాంతకుం డాకర్ణాంతంబుగా నాకర్షింపఁ గుండలాకారంబునం జెలఁగు కుసుమకోదండంబుపోలికనలరార కొందఱంగనాపురుషులు గమిగూడి దాకపందిరుల మండలాకారంబునంగూర్చుండి మధ్యప్రదేశంబున మదిరాభాండంబునిలిపి మహనీయగంధపుష్పాక్షతలంబూజించి ధూప దీప నైవేద్యంబులొసంగి మంత్రపుష్పంబులు సమర్పించి తమతమ

వేల్పులకు మ్రొక్కులిడి, శకారిరాతులకు సాష్టాంగ ప్రణామంబులు సేయుచు శాక్తుల సన్నుతింపుచు తాళధ్వజునకు దండంబుఁ బెట్టుచు, వైదికాచారవిరహితుల వర్ణింపుచుఁ బరమానందంబునం బాణితలంబులఁ బానపాత్రంబులుబూని యెడనెడ గోస్తనీఫలంబులుపయోగింపుచు నపరిమితంబుగా నాసవంబుఁ గ్రోలి తదున్మత్తత తత్తరిల్లి వెన్నెల తేనెఁ గన్నుగీటుచు వేమారు నడ్డంబుగాదాటుచు విపంచికల సుస్వరంబుగా మీటుచు వెలవెలం బోక పండ్లుగీటుచు సితాసితోత్పలకల్పిత తల్పంబులని పాదనీడలందనరు గోస్తనీకాయమాన ప్రదేశంబులం బొరలిపొరలి లేచు నవసరంబునఁ గచగ్రహణంబు సేయు కామినులకుచగ్రహణంబు సేసి లికుచంబులబ్బెనని యొబ్బుచు వలదని వారించు వారి కుసుమదామంబులరువ్వుచు, వికృతంబుగా నాడుచు, విచ్చలవిడిం బాడుచు, వెరపించిన వారి వేడుకొనుచు వ్రీడావిరహితులం గూడుచు విద్వద్గర్హితంబులగు మాటలాడుచు వివిధప్రకారంబుల శరీరంబు లెఱుంగక విహరింపుచుండ రథాంగవిహంగాంగనలు విరహవేదనావిహ్వలాంతఃకరణలై విపులపులినప్రదేశంబులం బొరలిపొరలి సమీపసంచరచక్రవాకంబులం జూడక జలంబులలోనికరిగి జలప్రతిబింబితనిజాకృతులు పరాకృతులవైఖరిం గనుపట్టఁ గనుగొని కాలక్షేపము సేయుచుండ మకరందపానపారవశ్యంబున మార్తాండమండలంబు గ్రుంకుసమయంబున మరలక మంజులకంజంబులం జిక్కిన చంచరీకంబులహీనస్వరంబులు సమీపంబులందిఱుగు చక్రవాకులవిరహవ్యథఁ జూచి సహింపఁజాలక పద్మినులు సేయు హరిస్మరణలోయనం బరగుచుండ మౌక్తికకలాపంబులు మణుంగుజీరెలు మల్లికాకుసుమమాలికలు మలయజజంబాలం బభిసారికాసమూహం బభిలషింపుచుండ ఛండాంశుకిరణసముదయ సంతప్తకకోరకోత్కర క్షామావసాన సందర్శనవాంఛానిరీక్షదంబు దేవతావికసిత విలోకనంబులవిధంబున వెలుంగు వినీలోత్పలంబుల వెడలు సమ్మదాశ్రు బిందుసందో

హంబులోయన మకరందబిందువులుజారుచుండ జలజలనెలరాలు
గరంగుచుండ మంత్రించినమాడ్కి మహీధరకంధరంబుల నంధకా
రంబులు కృశీభూతంబులై వసియింపుచుండ సమయభగీరథుండు
జీవంజీవపితృప్రీత్యర్థంబు జేసికొనిమహీతలంబున కపరిమితంబులు
గాఁదెచ్చిన మందాకినీప్రవాహంబులోయనఁ జకోరార్భకావనా
రంబు శరదాయనంబునఁ జంద్రబింబంబను కామధేనువుగనుపట్ట
కమలభవాండభాండంబునిండ నిశావధూటి పితికినదుగ్ధంబులోయ
నఁ బ్రపంచంబంధకారమగ్నంబుగాకుండ నాహ్లాదకరుండైయవ
తరించినవిధుని యశస్స్వరూపంబులోయన యామవతీ హరిణాంక
పరిణయోత్సవంబున హరిద్రమణీమణులెడతెగక దట్టంబుగాజల్లు
లాడిన పటవాసపటంబులోయన మందారమాఘవరమతంగజ మ
ల్లికామహారజితగర్భమానినీ మలయజమాధవాగ్రజ మందాకినీమ
హేశ్వరాచల మహాదేవమరాళమహనీయ విశదంబులై సమున్నత
చంద్రకాంత సౌధోపరిభాగంబుల కొందఱుమందయానలమందా
నందంబున డెందంబులుగరంగఁ బ్రియతములంగూడి పెక్కుచం
దంబులంగ్రీడింపుచుండఁ బండువెన్నెలలెల్లదెసలం బిండారబోసి
నతెరంగున నిండుకొనియుండెనయ్యెడ. ౩౧॥

శా. ఆనీహారమయూఖదీధితులుప-ద్మాక్షీవతంసంబునె।
మ్మేనంజారుతరానిలాధ్వసరణిన్-మీనాంకకుందాస్త్రిరే।
ఖానైపుణ్యముఁబూనిసోకఁగదొణం-గన్మానసాబ్జంబునన్।
దానన్ లేకపరిత్యజించెపటుధై-ర్యంబెల్లనొక్కమ్మడిన్॥ ౩౨॥

ఉ. చిత్తజుఁడిక్షుకార్ముకము-చెచ్చెరకేలనమర్చిదిక్కులన్।
మత్తమధువ్రతప్రకర-మౌర్వీరవంబుచెలంగఁజంద్రికో।
ద్వృత్తికిఁదోడుగాఁబటుగ-తిన్సుమబాణమువేయుచుండగా।
నత్తటిబిత్తరుల్బిసరు-హాననఁగన్గొనితత్తరిల్లుచున్॥ ౩౩॥

వ. అంత. ౩౪॥

సీ. ముత్తియంబులుగోళ్ళ-నత్తించెనొక్కతె,
చిగురాకుపదముఁ-జేర్చెనొకతె;
కదళులూరువులచెం-గటనిల్పెనొక్కతె,
బిసములుభుజములఁ-బెనచెనొకతె।
కరతలంబులహల్ల-కములుంచెనొక్కతె,
కుచములగుచ్ఛముల్-గూర్చెనొకతె।
నూగారుపైనాచు-నూల్గొల్పెనొక్కతె,
చక్కెరపాడిమోవి-జల్లెనొకతె।
గీ. చెక్కులనుకప్పురపునీరు-జిలికెనొకతె।
కన్నుగవనల్లకల్వల-గప్పెనొకతె।
పద్మమాస్యంబుచెంతను-బట్టెనొకతె।
చందనంబందముగమైన-లందెనొకతె॥ ౩౫॥

శా. పన్నీరొక్కతెపైపయిన్ జిలికిని-బ్భంగిన్ లతాంగుల్ సము।
ద్యన్నైపుణ్యముశోభిలన్ శిశిరకృ-త్యంబుల్ దగంజేయుగాఁ।
గన్నీరొక్కవధూటిపయ్యెదను వే-డ్కన్ గేలగీలించియు।
చ్ఛన్నప్రౌఢిమనొత్తగాచెలియకిం-చత్ఫుల్లనేఁత్రాబ్జయై॥ ౩౬॥

క. ఆనారీరత్నంబుప।
ధానముపైయపుడుహస్త-తలమూనుచులే।
గానించుకకౌటిల్యం।
బానగసజ్జన్నివిష్ట-యైబలుచింతన్॥ ౩౭॥

ఉ. అంగనలోర్చిలేనెలవ-రాబ్జమునందనజేర్చిగందరే।
ఖంగరమందుపైటపయి-కంకణదీప్తిదగంబ్రకోష్టము।
త్సంగమునందుబాదుకొన- చారుభుజాగ్రమునందుముద్రికా।
భంగరుచుల్ వెలుంగకర-భంబునముత్తెపునత్తువ్రేలఁగన్॥ ౩౮॥

క. ఈసరణిలేచితామెద।
త్రాసకరకరాకరునిసు-ధాకరునిమనో।

భూసఖునిజాలపదతి।
యాసుందరిజూచిరుపిత-మైయిట్లనియెన్॥ ౩౯॥

సీ. వనములోసతతంబు-వాసంబుజేయుత,
మ్ములసిరుల్ గొన్న దు-ర్బుద్ధినీవె।
నిందకునోడిగట్టి-నిర్భయంబునగురు,
రమణిచేకొన్న దు-ర్నయుఁడవీవె।
విబుధసేవితుఁడైన-విశ్వేశ్వరునిమస్త,
కంబుద్రొక్కినదురా-గ్రహుఁడవీవె।
దినమొకరీతియ-ప్పనబుచ్చుచక్రిద్వి,
జతతిసణచెడు-దుర్జనుడవీవె।

గీ. వసుధరాజపటంబుదై-వజ్ఞలిచ్చ।
కమునకకూ్రరుఁడందురు-గాడనీకు।
గలదెయకూ్రరవృత్తినీ-చెలిమికతన।
శశిజగద్వంద్యుడెకూ్రర-సంజ్ఞదనరె॥ ౪౦॥

ఉ. గాసిలిభార్గవీశుడలు-కన్ దనలోపలనుండనీకను।
ద్వాసనజేయుటున్నను ప-దంపడివాళినికాలకంఠుడు।
ల్లాసముతోవహించుటప్రతి-లంచగవేరొకరీతిదోచెనీ।
శ్రీసహజాఖ్యకర్థముప-చింపగనేమిటికోనిశాకరా॥ ౪౧॥

చ. గరళముతోజనించిశత-కంఠునిమౌళివసించిచక్రవి।
స్ఫురణమణంచిపద్మినుల-సొంపుహరించిగురుప్రయారత।
స్కరతవహించిపాంథులదె-సన్ గలహించిజరించునీకును।
ర్వరగలదేగణింపద్విజ-రాజతరాజితయామినీచరా॥ ౪౨॥

ఉ. నీకళమౌళిశంకరుఁడు-నిల్పుటనేలయకారియయ్యెల।
క్ష్మీకమనుండునీవెడవ-సించుటనేనరసింహుఁడయ్యెర।

త్నాకరనీవునందనుఁడ-వౌటనెదావిషశాయియయోగ్యనా।
ళీకవిరోధిపాంథులఁజ-లిరింగఁజేయుటనీకువింతయే॥ ౪౩॥

సీ. జగతిలోసర్వభ-క్షకతయపూజ్యత,
కర్ణభీకరచండి-కాసమాఖ్య।
విఘ్నకారిత్వంబు-విషపూరితానన,
భీకరత్వముసదా-నేకముఖత।
కువలయద్వేషంబు-క్రూరహాలాహలా,
హారతచటులదు-ర్గాభిధాన।
మంతకత్వమువిము-ఖాభ్యాసమున్నతి,
పూతనాపాణివి-ఘాతృకత్వ।
గీ. మంగహీనతఁగూఁగజఘ-న్యతతిలాన్వి।
తాంబురతిగల్గిపావకా-ద్యమరులెల్ల।
త్వత్రపకుటిలకళానుభ-వమునగాదె।
మహినినిందితులైరితా-మరసవైరి॥ ౪౪॥

ఉ. చారుతరాకృతిన్ జెలగు-చల్లనిరాజితుఁడంచులోకులిం।
పారుచుగన్గొనంగువల-యప్రియవృత్తిమహిన్ వహించిబ్బం।
దారకసన్నుతోన్నతవ-దాన్యుఁడవైదవరారునీవుని।
ష్కారణమేలపాంథులదె-సన్ గలహించెదవోకళానిధీ॥ ౪౫॥

క. తనకన్నుతోడబుట్టని।
తనకన్నెతనమదికిని-తనయుఁడననినున్।
దనపదమునహరినిలిపిన।
తనుమధ్యలనేచనీకు-దగునెమృగాంకా॥ ౪౬॥

చ. అనుమతిసాధుచక్రహృద-యప్రియకారులయందుపాంథబృం।
దనుతచరిత్రులందువని-తాజనతావనతత్పరాళియం
దనిమిషకోటికంచుబుధు-లందురురాజటవంచుచంద్రనీ
వనుమతిమించినందివిజు-లందరునిన్నుకృశింపఁజేయురే ౪౭॥

శా. అన్నం బైయవతంస మైజగిలగా-డైచక్ర మైకాయ మై।
కన్నైపన్న గభూషుగొల్చుచువశీ-క్షుస్ఫూర్తితోనం దెమి।
నొన్నత్యంబుననీకళాలలితుడే-యంచుంజనుల్ వేడ్కని।
న్నెన్నన్వన్నియ కెక్కిచంద్రదగునే-యేచంజకోరాక్షులన్ ॥౪౮॥

క. జాలిక నెలవీరీతిను।
పాలంభించు నెడపంచ-బాణుఁడెదుట కెం।
గేలవిలుబూనినిలచివ।
పోలిక దోచినను కోప-మునఁనిట్లనియెన్ ॥ ౪౯ ॥

ఉ. కొంకక నాదిభిక్షుఁబ్రతి-కూలచరిత్రునధిజ్యచాపమే।
యుంకువగాఁగఁజేసియత-నూన్నతిఁగోరుచుసర్వమంగళా।
లంకృతమూర్తిఁజేసినవ-లక్షయశోనిధివీవెనీవుమీ।
నాంకవియోగినీతతిను-ద్రగతనేచెదవబ్రమయ్యెడుఙ్ ॥ ౫౦॥

చ. సురుచిరశౌర్యనిఙ్గుహుని-సుందరమూర్తిజయంతుసద్గుణా।
కరుణలకూబరుంగనిజ-గంబునశాంకరశక్రకిన్నరే।
శ్వరులెనభాగ్యలంచుముర-వైరిమదిన్వ్వతఁజెందువార్ధివై।
ఖరివలరాజనీవునల-కైవడిపాంథులనేచజాగినఙ్ ॥ ౫౧॥

చ. అకుటిలచర్యయైనజల-జాలయయుండఁగనౌరభక్తపా।
లకుఁడగువిష్ణుడుండఁగవ-శక్షయశోనిధియైచెలంగుపా।
లకడలియుండనీకుఁబది-లంబుగ నెక్కడిమేనమామపో।
లికలభియించెఁబాంధులఁజ-లింపఁగఁజేసెదవిక్షుకార్ముకా॥ ౫౨॥

క. అలుకన్వియోగచక్రం।
బులకరములుచాచియేచఁ-బూనితివహహా।
వలరాజానీవలుక।
ల్వలరాజుంగూడిచెడఁద-లంచితివిగదా॥ ౫౩॥

మ. సకళంకుండగుసారసాళినిసము-త్సాహంబునంగూర్చిజా।
తికిబాహ్యుండగుచైత్రునిం బ్రబలమం-త్రిత్వంబునన్నిల్పికీ।
లికిమిత్రంబగుగాలి నేలివనమా-లిన్ దేవికంకాళుమా।
లికపాలుం డెగడన్ స్మరాపధికపా-ళింబాడియేయేచఁగన్॥ ౫౪॥

క. పండితులెల్లనునిన్నత।
నుండనినుతియింపవారి-నుడిచెడసుమకో।
దండాపాంథాంగనలను।
ఛండాలులగుణముబూని-చను నేయేచన్॥ ౫౫॥

చ. అలుగకుమాంతరంగికుఁడ-వంతియెకాదుమనోజనీవురా।
చిలుకహుమావజీరుఁడవు-చిల్కలకొల్కని నేను పువ్వుదూ।
పులదొరవీవు నేనుపువు-బోణినివీవళిరాడ్గుణుండ వే।
వళికచనీవుమీనలలి-తాంకుఁడ వేనునుమీనలోచనన్॥ ౫౬॥

చ. తనయుఁడుశార్ఙ్గికిన్ మధుర-ధర్మ్యుఁడుసాధుకళానిధిస్తుతుం।
డనిమిషలాంఛనుండుసర-సాళివిభూషితసద్గుణుండుశో।
భనచరితుండితండనిసు-పర్వులెనిన్నునుతింపమీనకే।
తనయతనుండవయ్యువని-తాతతి నేచుటనీకుఁబాడియే॥ ౫౭॥

క. రతిపతినీగతినాక్షితి।
పతిసుతప్రతిమాలుచుండఁ-బాండ్యవసుమతీ।
పతి శేఖరోపవనపవ।
నతతుల్ తనతనువుసోకి-నంబెనుగినుకన్॥ ౫౮॥

క. మలయాచలనిలయానిల।
విలయాచలజాధినాథు-విభమునవిరహా।
జ్వలనాకులకలనాడల।
యొలనాగలమాటిమాటి-కేచందగునా॥ ౫౯॥

మ. అరవిందాసన లెల్లనీకు పగవా-రానిన్ను పద్మారిదా।
పరమామాత్యపదంబునన్నిలిపెనా-పాథాంతకుం డైనశం।
బరవిద్వేషికి నీవు కింకరుడవా-మందుండవై పాంథసుం।
దరులన్ శీతలగంధవాహ దగునే-దండింపనీ బోటికిన్॥ ౬౦॥

చ. ఘనులదొలంగ జేయ వెప్ర-కంపమునందగ జేయవే మహా।
ఘనతరులన్ సదాశుగత-గైకొన వేహుతభుక్సఖుండవై।
అనయనమూర్తి భాజివము-రెండవభూతమవై ప్రభంజనా।
నినువినుతించినన్ విరహి-ణీతతులన్ గరుణింప నేర్తువే॥ ౬౧॥

క. అలుకద్దెమ్మైరనీగతి।
చులకంగానాడి చెవులు-సోకకలకం।
బలుకంజాల్దీన పెంపుడు।
చిలుకంగనుగొని లతాంగి-చిడుముడిపడుచున్॥ ౬౨॥

క సకమారాబ్జముఖైయో।
పకమానుపరాకమాన-పికమా స్మరఫ్రో।
టకమాపథిక స్త్రీవం।
చకమాసుర పాలఘనచ-షకమాశుకమా॥ ౬౩॥

మ అనిమా రాబ్జసమీరకీర ఘలప-ద్మాక్షీవతంసంబుగ్ర।
కుక-ననిందించి సుభాషిణిన్ బిలిచి కా-కుస్థాన్వయాంభోధిపూ।
ర్ణనిశాధీశుని చెంత కేగి మృదువా-గ్నైపుణ్యమే పారయ..
తనిసంకల్పమెరింగిరమ్మను చుకం-దర్పార్తయై బల్కినన్॥ ౬౪॥

చ. పొలతుక యాజ్ఞ యాదలను-బూను విధంబున చేతులెత్తి వే।
ల్పులకనురక్తిమ్రొక్కి పువు-బోణిజనెందనతోటి చేడియల్।
లలనకు మన్మథవ్యథదొ-లంగ దిలీపుని చిత్తవృత్తికిం।
దలఁపుజనింపఁ జేసి శుభ-వార్తలు దెమ్మని దెల్పుచుండఁగన్॥ ౬౫॥

క. ఆతరువాతలతాంగులు।
భూతలపతితనయకులు ను-బుచ్చుటకై వా।

క్చాతురితములోపలతమ।
రీతెఱుఁగునఁబలుకఁజొచ్చి-రింతివినంగన్॥ ౬౬॥

సీ. భామపైనృపునకుఁ-బ్రేమబుట్టించునే,
ర్పరిసుభాషిణియంచు-బలికెనొకతె।
ప్రేమకెవ్వరినేర్పు-లేమినర్మసఖుండె,
ప్రథమకారణమని-పలికెనొకతె।
పరులఁజెప్పఁగనేల-తరుణీమణివిలాస
ములెమూలమంచును-బలికెనొకతె।
మనసిజుండఘురాగ-జనకుఁడెవ్వరికిని,
బహుభావశేలని-పలికెనొకతె।

గీ. పతిదిలీపుఁడెయీమాన-వతికటంచుఁ।
బర్మజుఁడువ్రాసినాడని-బలికెనొకతె।
తడవులేదింతలోనయీ-తన్వికెలమి।
పరిణయంబౌనటంచును-బలికెనొకతె॥ ౬౭॥

శా. శ్రీదామోదరపాణిపీడనకథో-త్సేకంబులామీఁదటన్।
వేదాస్యాగసుతావివాహవిలస-ద్వృత్తాంతమామీఁదటన్।
వైదర్భీనలభూమిభృత్పరిణయ-వ్యాపారముల్ దెల్పుచున్।
మోదంబందఁగఁజేయుచుండిరతివల్-ముఖ్యాశికోగణ్యముల్॥

క. నెలపూర్వస్థితలప్పుడు।
దలచకచపలాత్ముఁడగుచు-దానపరాశన్।
మెలఁగెన్ వసుసందారలు।
దోలఁగుచునుండంగుముద్వ-తులువెతనెందన్॥ ౬౯॥

చ విరహిణులెల్లమ్రొక్క-నర-విందములెన్నికకెక్క-కైరవో।
త్కరములఁదేంట్లుజిక్క-విశ-దచ్ఛవిదీనతనొక్క-తారకా।
స్ఫురణమువెన్క-ద్రొక్క-నిశ-పోడిమిస్రుక్క-రతాంతతాంతసుం।
దరులుసుషుప్తిజొక్క-కలి-తంబుగవేగురుజుక్క-రాజిలెన్॥ ౭౦॥

గీ. విలసదపరానురక్తుఁడై-విధుఁడువిడువ।
ధవళిమచ్ఛలనమునుజ్యో-త్స్నలుప్రదీపి।
కలప్రవేశించెస్నేహసం-కలితలవని।
రమణివంచితమతులకా-శ్రయులుకారె॥ ౨౧॥

మ. సమయామాత్యుఁడినుండువచ్చెనని ప్రా-క్ష్మాభృద్వ్రతంసాగ్రభా।
గమునన్నిల్పెనబంధురారుణపతా-కస్ఫూర్తినాకల్యవా।
గముగన్పట్టె విభాకరోగ్రవిశిఖా-గ్రచ్ఛిన్నమందేహదు।
ర్గమదేహచ్ఛ్యుతభీషణక్షతజవి-భ్రాంతిప్రదాకారమై॥ ౨౨॥

క. తనపాండువిడచివిభుఁడే।
గినప్రాక్సతిమోముగోప-గించుచుఁద్రిప్పం।
గనుపట్టుతచ్ఛిరోమణి।
యనవేగురుచుక్క-బొడమె-యతిరమ్యముగన్॥ ౨౩॥

క. మొరసెన్ జరణాయుధతతు।
లరసెన్ గోకములుప్రియల-నభ్రమునభముల్।
విరిసెన్ సుమశరవర్షము।
గురిసెన్ మారుండుప్రణయ-కుపితలమీఁదన్॥ ౨౪॥

గీ అప్పుఁడినురశ్మిగైకొంటి-మిప్పుఁడధిపు।
డైయతండేగుదెంచునె-ట్లౌనొయనుచు।
భయముదొట్రిలవెలవెలఁ-బారెననఁగఁ।
బాండిమముబూనెభవనదీ-ప్రవజంబు॥ ౨౫॥

సీ. శోకవ్యథావల్లి-కాకురరాగంబు,
తుహినాంశురుచిపశ్య-తోహరంబు।
ఫలితాబ్జినీప్రదీ-ప్యత్పూర్వసుకృతంబు,
కైరవసంతాప-కారణంబు।
జనితచకోరక-క్షామప్రరోహంబు,
తారకాప్రాబల్య-వారకంబు।

రాజితాండజరవా-క్రాంతదిగంతంబు,
నిఖిలాభిసారికా-నిందితంబు।
గీ. పుణ్యపురుషసమూహప్ర-బోధకంబు।
జారచోరసముత్సవో-చ్చాటకంబు।
ముదితముగాంగనామనో-భోరుహంబు।
దగఁ బ్రభాతంబు విద్వత్ప్ర-దంబు మలర॥ ౮౬॥
చ. ద్యుమణి జెలంగ తమ్మిపడ-తుల్ దొలఁగింపుము శీతరుగ్జశో।
కములని విన్న వింపనను-కంపమదిన్ జనియింపఁ దెంపునన్।
సమయభిషగ్వరుండుదయ-శైలఖరట్టము పైఁ బురందరా।
ద్యమరులు మెచ్చ నిల్పినమ-హాతరుణార్కపుమాత్ర యోయనన్॥
క. జలజాప్తుండ ప్పుడుత।
మ్ములుహిత చక్రములులోక-ములు లోకులుని।
శ్చలత ముదమందఁ బ్రాజ్ఞ్ముఖ।
విలసత్సిందూర చిత్ర-వృత్తి వహించెన్॥ ౮౮॥
మ. అవయే భానుమతీభవాద్రిపవయే-హర్యబ్జజాగాత్ర నే।
రవయే పావనమూర్తయే ద్యుమణియే-భ్రాజిష్ణవే బంధుర।
చ్ఛవియే ధ్వాంతభిదే నమో యనియభి-జ్ఞశ్రేణి మొక్కంగఁ బ్రా।
గవిపక్వాంబుజనీత పఃఫలము ప-ద్మాత్ముండు భాసిల్లఁగన్॥ ౮౯॥
క, అకలంకాదయదీప్తి।
ప్రకటీభూతోజ్జ్వలాను-రాగురవిన్మా।
ధుకరీక్షణములకమలిని।
వికసితకమలాస్యయగుచు-వీక్షించెఁ దమిన్॥ ౯౦॥
ఉ. తాపకబింబధాముఁ డగు-శైత్యహరుండ నయంబు హాటక।
గ్రావము చుట్టు నందిరుగఁ-గాఁజపలాత్తయటంచు నస్మద।
జ్ఞావసథంబు సిరిన్ విబుధు-లందరు చిత్రమటంచు ఫేలికే।
లీవిధి నాడి రంబుజను-లే యననొప్పె మధుప్రవతార్భటుల్॥ ౯౧॥

గీ. చెలులు ప్రతిమాలన వ్వేళ-జలజనయన।
కాల్యకరణీయములు కృ-చ్ఛగతిని దీర్చి।
కమలబాంధవవంశ్యుని-కడకుఁ జనిన।
యింతి రాదయె మిగుల బ్రా-ద్ధిక్కొననుచు॥ ౫౨॥

ఉ. హూహాక మంత్రిభూపతిప-మున్న తినింబ లెజూడఁజూడసం।
దేహగుణంబునిశ్చయమ-నీవగలంపవధూటిచేటికా।
వ్యూహముదానునంబెదురు-చుండుసుభాషిణిజేరవచ్చెను।
త్సాహముతోఫలించెనుసు-దక్షిణకోర్కెలటంచుఁబల్కుచుఁ॥

మ తమకుంగర్ణరసాయనంబులగుత-ద్వాక్యంబులాలింపుచుఁ।
రమణీరత్నములాసుభాషిణిపరీ-రంభంబుగావించిమో।
దమునంజెందుచుఁదత్సరోజముఖితో-ధాత్రీశకన్యాసమీ।
పమునకొమ్మెల్లెనసన్నివిష్టులయిసం-భాషించిరీవైఖరిఁ॥ ౫౪॥

మ. తరుణీనీవెటులట్టులేగితివిత-ద్ద్వారికుల్ నిన్నుసే।
కరణిన్ లోనికినేగనిచ్చిరిమహీ-కాంతుండునిన్నెంగనా।
విరహోద్వృత్తులుమున్నగానడిగెనో-వేవేగనీవీసఖీ।
విరహోద్వృత్తులువిన్నవించితివొపృ-థ్వీజానికిన్నందుఁగన్॥ ౫౫॥

క. ననవింటివాఁడుసమతన్।
వనరుహబాంధవకులోద్భ-వగ్రామణినిన్।
వనజాక్షిమగధన్యపకన్।
న్యనుజూచినజూపుజూచె-నాయనిపలుకన్॥ ౫౬॥

క. వ్రీడాలంకృతనయనా।
వ్రేడితచాంచల్యయౌతఁసి-రీక్షణయైయా।
వ్రీడావతివినమోదము।
తోడసుభాషిణిలలనల-తోనిట్లనియెన్॥ ౫౭॥

గీ జలరుహాననయాజ్ఞయా-దలవహించి।
కరములనుశీతరశ్మిమా-ర్గంబుజూప।

మానినీమణులారయు-ష్మత్కృపాస।
హాయసైన్యప్రసన్నధి-కరుగు వేళ॥ ౮౮॥

ఉ. తూరిమి నెచ్చెలి న్నగధు-కూతురి కేననుచున్న-చింపదా।
వారికులేగ నిచ్చిరిన-వంశ్యని చెంతకుమాగధీసఖుల్।
గారునిరుద్ధులంచు మొద-లన్నతి దెల్పఁగఁ బోలుగానిచో।
ద్వారనియుక్తలెందు పెర-వారినిలోనికి నేగనిత్తురే॥ ౮౯॥

సీ. చిత్రార్పితాంగనా-శ్రిత నేత్రములవానిఁ,
జంచరీకవ్రతమాన-సంబువాని।
జనితనానావిధ-సంకల్పములవాని,
జాగరారుణకటా-క్షములవాని।
సుమకార్ముకాశుగ-క్షుభితాంగములవానిఁ,
దృక్కేతరప్రవ-ర్తనమువానిఁ।
ప్రబలనిశ్వాసప్ర-భంజనములవాని,
విస్మృతధీరతా-వృత్తి వానిఁ।

గీ. జివురుపాన్పునౌ నెమ్మేను-జేర్చువాని।
విరహతాపంబుసహియింప-వెఱచువాని।
నమ్మహీజానిఁగనిహృద-యంబులోని।
సందియముమానిసంతోష-సరణిఁబూని॥ ౯౦॥

గీ. నిమిషమాత్రంబునిలుచుండి-నెలఁతలార।
సమయమిాక్షించితత్సమీ-పమునకరిగి।
వినయమునచేతులెత్తివం-దనముజేసి।
విన్నవించితినీగతి-వీనులలర॥ ౯౧॥

ఉ. మాగధినెచ్చెలిన్నృపకు-మారసుభాషిణియంద్రుహనన్నీ।
వాగజరాజయాననయ-నాంబుజముల్ వికసింపఁజేసివే।
వేగఁజన న్నరుండునన-వింటనుకంటనుమంటలొల్కఁగా।
రాగపయోధిఁద్రోచెజవ-రాలిమదాళిగుణంబమర్చుచున్॥ ౯౨॥

ఉ ఆవిరిబోఁడిమన్మథశ-రార్తిసహింపఁగ లేకవన్న సం।
భావనఁజేసినీకడకుఁ-బంపెఁదవీయమనోరథంబుధా।
శ్రీవరనీసమక్షమునఁ-దెల్పుడు సేయఁగ నేల తేగమే।
నీవనురక్తితోడఁగరు-ణింపుకరగ్రహణోత్సవంబునన్॥ ౯౩॥

మ అనుచున్విన్న పమాచరింపఁబరమా-హ్లాదంబునం జెందియా।
జననాథాగ్రణిబాలికామణిమనో-జాతార్తికిన్ మానసం।
బునఁజింతింపుచు బాలికావిరహవి-స్ఫూర్తుల్ దగం దెల్పినన్।
వినుచుండా నెఱిఁగించెనాత్మవిరహ-వ్యాప్తుల్ సమాసీనుఁడై॥

ఉ. అంతటభానుబింబముద-యాచలకూటమలంకరింపభూ।
కాంతుఁడుకాల్యకృత్యములు-గన్కనంతకమున్నె దీర్చియే।
కాంతమునందునన్ రసచి-వాగ్రణికిన్ ననుఁ వేలుజూపియా।
యింతిసుదక్షిణానుచర-యేయనిబల్కి-వనాతఁడింపుగన్॥ ౯౪॥

చ. శుభమగుఁగాక నీకుపరి-శుద్ధచరిత్రయటంచుధారుణీ।
విభునిమొగంబుగన్గొనిన-వెంటనె నీవటకేగిజీవన।
స్ని భమతిరమ్యటంచుధర-ణీపతిలోచనసంజ్ఞ దెల్పినన్।
రభసమునంజనెన్ సచివ-రత్నమలంకృతరత్నభూషుఁడై॥ ౯౬॥

క. ఆతరువాతమహీతల।
నేతముదాస్యంబుజూచి-నీరజనయనా।
వీాతరుణీమణి చేతో।
జాతోరువ్యథలకెట్లు-సైరించెనొకో॥ ౯౭॥

క. గుణముశిలీముఖమేమా।
ర్గణమేవిల్లాశుగంబె-రథమశ్వంబుల్।
గణుతింపపత్రములే।
యణుమధ్యలనేచుటెంత-యతనునకబలా॥ ౯౮॥

క. నక్షత్రపకిరణములగ।
తక్షపనేరీతమీాసు-దక్షిణకును కా।

లక్షేపంబయ్యెనుమగ।
ధక్షోణీనాథుఁడీవి-ధంబెఱుఁగుఁగదా॥ ౯౯॥

మ. అనుచున్నావిభుఁడానతిచ్చినతదీ-యాలాపముల్ వీనులన్।
వినితాదృగ్విదనార్తయైనచెలికన్-విశ్వంభరాధీశ్వరుం।
డనురక్తిన్నినుగన్గొనెంబరిణయం-బౌనంచు కాంతాళి దా।
ల్పినతద్వాక్యమె దేవయాచువిరహా-బ్ధిన్ దేల్చెనబ్బాలికన్ ॥౧౦౦॥

ఉ. రాజశిఖామణీనినుని-రంతరమత్యనురక్తిమానసాం।
భోజమునందునిల్పిపిక-ముల్ శుకముల్ గొలువంగవచ్చుచే।
తోజునిధాటికిన్వెసకఁ-దొ్రక్కకకామినినిల్చెనుల్కనే।
యాజికిసేనచెంతనని-తాంతకుఁడైననిజేశుఁడుండఁగన్॥ ౧౦౧॥

క. భాస్వత్ప్రీతాషయుతుఁడువి।
వస్వత్కులదీపుఁడార్య-వర్ణితుఁడతితే।
జస్విదిలీపుఁడటంచును।
భాస్వద్గతిమేమువిన్న-పముసేయంగన్॥ ౧౦౨॥

క. నీవెయినుండవటంచును।
భావంబుననిన్నునిలిపి-పడఁతిమరచెజ్యో।
త్స్నావిర్భూతవ్యథక్।
ష్టావధిభూవరప్రతిక్రి-యాచరణమునన్॥ ౧౦౩॥

గీ. మనుజనాథసుధక్షణ-జననికేము।
విన్నవించితిమంగన-విరహవేద।
నావికారంబులాపద్మ-నయనవలన।
వినఁగవచ్చునుమగధపృ-థ్వీవిభుండు॥ ౧౦౪॥

ఉ. కన్నియచిత్తమాతనువు-కన్నునుమిక్కిలికోమలంబుమా।
రోన్నతతాపమింకమది-నోర్వఁగలేదనినేర్పుమీఱనే।
విన్నపమాచరించుతరి-వేగమెతత్సఖుఁడేగుదెంచిభూ।
భృన్నుతచర్యమీకగును-రేపువివాహమటంచుఁబల్కెనన్ ॥౧౦౫॥

క. మానవపతి నెమ్మదినా।
మానసమపుడప్పుడింతి-మానసముభవ।
స్నానసములచందంబున।
నానందాంబుధిని నోల-లాడం దొడఁగెన్॥ ౧౦౬॥

గీ. మందహాసంబు మోమున-కందళింప।
నంతరంగంబున ననుకోర్కు-లంకురింప।
లజ్జనయనాంబుజంబున-లంకరింప।
జనవిభుండిట్లనియెనర్మ-సఖునితోడ॥ ౧౦౭॥

క. ఆమాగధుఁడేమ నెనీ।
వేమని పల్కి-తివిలగ్న-మెల్లియనుచుఁదా।
నేమాహూర్తికుఁడనియెసు।
ధీమణిపరులెవ్వరిచటఁ-దెలియఁగఁజెపుమా॥ ౧౦౮॥

క. ఈవిధమునను దిలీప।
క్ష్మావల్లభు నాత్మసఖశి-ఖామణినడుఁగన్।
దేవావీనులకసఁ సం।
భావనగావినుమటంచుఁ-బలుకందొడఁగెన్॥ ౧౦౯॥

క. భూలోకపాలభవడా।
క్ష్మాలంకృతమాళిగ్నైస-మంచితసరణిన్।
మేలగునిమిత్తములు నే।
నాలోకింపుచును వేడ్క-నరుగఁగనచటన్॥ ౧౧౦॥

సీ. ఎలమికుంకుమముగో-డలఁబూయువారును,
వరుసచిత్తరువులు-వ్రాయువారు।
కస్తూరిచేవేది-కలసల్కువారును,
చెంగటఁబన్నీరుఁ-జిలుకువారు।
తెలిముత్తియములము-గ్గులుబెట్టువారును,
గడిమివితానముల్-గట్టువారు।

ప్రీతి సౌధములలం-కృతి సేయువారును,
కాయమానంబులు- వేయువారు।

గీ. నేర్పుగాఁబూర్ణకుంభముల్ -నిలుపువారు।
సఫలరమ్యంబులగుపనుల్ -సలుపువారు।
కోరకములుఁగవాఝాళి-గూర్చువారు।
మార్గములతోరణంబుల-మర్చువారు॥ ౧౧౧॥

సీ. పలుమారుసిల్పకా-రులఁబిల్చువారుక,
శాదులఁజూచిచె-లంగువారు।
రూపజీవికల నే-ర్పునవవ్వువారుమా,
ర్దంగికులను వెంటఁ-దరుము వారు।
తూర్యాదివాద్యయు-క్తులమెచ్చువారుసం,
దిరులనాస్తరణముల్ -బరచువారు।
తరులచందంబునఁ-జరియించువారుభా,
షించఁదీరకకోప-గించువారు।

గీ. యత్నములనప్రయత్నులై-యలరువారు।
నగుచుమగధప్రధానుల-యంతరంగ।
ములుశరీరాన్వితంబులై- మెలఁగుచాయ।
పనులుపరిచారకులువేడ్క-పడుచుఁజేయ॥ ౧౧౨॥

క. ఈరీతిన్ మగధునిపరి।
చారికలఁజరింపుచుండ-సందిగ్ధగతిన్।
హారమయమైనదత్సభ।
చేరంజనికారణంబు-చింతింపు మనెడన్॥ ౧౧౩॥

క. నినురమ్మనియనుమగధా।
వనినాథుఁడులోనికనుచు-వడికంచుకిన।
న్ననుమతిఁదోడ్కొనిచనె కాం।
చనఘటితోన్నతవిచిత్ర- సౌధంబునకున్॥ ౧౧౪

గీ. భర్తృపాంచాలికాపాణి-పల్లవాగ్ర।
భాసమానప్రభాన్విత-పద్మరాగ।
పటలపరిహృతతిమిరప్ర-పంచమైన
తల్పమున్నతకలితసౌ-ధంబులోన॥ ౧౧౫॥

క. కనకమయోన్నతసింహా।
సనమునతత్ప్రాంతఘటిత-చటులమణిరుచుల్।
తనతేజఃపుంజము చెం।
తనురవినికటస్థదీప-తతిఁగలిఁబూనన్॥ ౧౧౬॥

చ. చెలఁగెనుసన్నివిష్టనివ-సిష్ఠునిఁగన్గొనితత్పదాంబుజం।
బులకనురక్తిమొక్కి-ముని-పుంగవునావతితత్సమీపమం।
దెలమినిజార్హపీఠవసి-యించినయమ్మగధేంద్రుచెంతని।
శ్చలతవసించియున్నవను-సంయమిఁగన్గొనిపల్కెనీగతిన్॥ ౧౧౭॥

సీ. మనువంశ్యమౌళియు-ష్మత్ప్రయత్నంబున,
నారామవాటిక-కరుఁగుటయును।
సకియలతోడనం-తకమున్నెమాగధి,
ప్రీతినచ్చోటఁజ-రించుటయును।
స్మరశరంబులుపర-స్పరదృగన్వితములై,
నరవరాంగనలమై-నాటుటయును।
విరహాబ్ధినిర్వరు-వెడలఁజాలకగత,
క్షపకన్నుమూయక-గడుపుటయును।

గీ. మానినీముఖవిదితకు-మారికామ।
నోరథుండగుమగధమ-హీరమణుఁడు।
ప్రేమతోనన్నుమదినిస్మ-రించునపుడె,
దివ్యదృష్టిబలంబున-దెలిసియుటకు॥ ౧౧౮॥

గీ. వచ్చిమగధవసుంధరా-వరునిసంశ।
యంబుబాపివివాహప్ర-యత్నములర।

యంబునను జేయుఁడనియెదఁ-బాపులకును।
దెలిపినవతండతండుమ-దీయులగుట॥ ౧౧౯॥

క. మాకుం బ్రియశిష్యుండౌ।
కాకుత్స్థుఁడు భక్తుఁడీమగధనృపుఁడితఁడా।
రాకొమరునకు న్వేగమె।
కూతుదుఁడౌనింతకంటె-కుతుకముగలదే॥ ౧౨౦॥

చ. చెలఁగుచునీవుమీన్న పుని-చెంతకు నేగిభవద్గుణంబుని।
శ్చలమతియైనమాగధుని-సన్నిధి నెల్లిమ్ము గాస్యలగ్నమే'
వలనుగనిర్ణయించెనువి-వాహముగమ్ముసుదక్షిణాకసము।
జ్వలగతిఁబల్కమంచున్నె-వత్సలతకనుజా విభూవరా॥ ౧౨౧॥

గీ తానరుంధతితోఁడఁ-త్సమయమునకు।
వచ్చెదనటంచుమగధభూ-వరునితోఁడఁ।
బలికయంతర్హితుండయ్యె-భానుకులజ।
సంతసంబునసమ్మహీ-జానిదనర॥ ౧౨౨॥

గీ. ఇవ్విధంబునఘనుఁడైన-యవ్వసిష్ఠుఁ।
డమలవాక్యామృతంబున-నంతరంగ।
మలరజేసితిరోహితుం-డైనమగధ।
భూవరునితోడఁబలికితి-నీవిధమున॥ ౧౨౩॥

క. కూతుదుఁడవీవువరుఁడై।
ఇక్ష్వాకుఁడరుంధతిసమీప-వర్తినితాన్కం।
తెకాంతుఁడయాజ్ఞకుఁడిల।
నీకన్నియభాగ్యముల్గ-ణింపఁగఁదరమే॥ ౧౨౪॥

క. హరికసిరిహరునకుమహిమ।
కరునకురోహిణినొసంగు-కంధిమహీభృ।
ద్వరదక్షులగతిరవికుల।
వరునకుఁగన్నియనొసంగి-వరలుముకీర్తిన్॥ ౧౨౫॥

మ. అనుచున్ నేనువచింపభూమిధవుఁడా-హ్లాదంబునం జెందమీ।
జననాథాగ్రణిచెంతకుంజనివసి-ష్ఠప్రోక్తవైవాహికా।
యనముల్ వేగమె నేర్పునం దెలుపుమీ-యంచున్ విడెంబిచ్చిపం।
పినమీచెంతకువచ్చితెల్పితినిసా-మీసైన్యమే పారఁగన్॥ ౧౨౬॥

క. యెల్లివివాహమయోధ్యా।
వల్లభునకటంచువేగ-వాహినికెల్లం।
దెల్లంబుగఁజాటించెద।
నల్లుఁడవౌదువిఁక మాగ,-ధాఖ్యునకనఘా॥ ౧౨౭॥

క. అనినర్మసఖుఁడుబల్కిన।
వినిధరణీనాయకుండు-వేడుకతోనా।
తనిఁగనిచాటింపుమువా।
హినికనుచుంబంపిపలికె-నిట్లనినాతో॥ ౧౨౮॥

క. అనురక్తయైనమీజ।
వ్వనివృత్తాంతంబునెల్ల-వడిఁదెల్పఁగఁబో।
మ్మనికడువేడుకతోడన్।
వనరుహదళనయనలార-వచ్చితినిటకున్॥ ౧౨౯॥

శా. ఆరాజేంద్రునివాగ్విచక్షణతవి-ద్యాప్రౌఢిమంబంచితా।
చారస్ఫూర్తిపరేంగితజ్ఞతకృపా-శాలిత్వముత్కృష్టదో।
స్సారంబార్యనుతప్రవీణతవిలా-సప్రాభవంబున్నతో।
దారత్వంబుగణింపఁగాఁగలరయే-ధాత్రీశునందుర్వరన్॥ ౧౩౦॥

గీ. వినుతగుణశాలివిద్యక-బ్బినవిధమునఁ।
దొడవుఁకుమంచిరతనంబు-దొరికినట్లు।
భాగ్యవశమునఁగలిగెను-యోగ్యమైన।
రమణుఁడీపంకజాస్యకు-రమణులార॥ ౧౩౧॥

గీ. యీవధూమణియాధరి-త్రీవిభుండు।
పరిణయానంతరంబునఁ-బరిహసింపఁ।

గలయుశాశ్వతసౌభాగ్య-గతులభార।
తీవిధులుమావిధులరోహి-ణీవిధులను॥ ౧౩౨॥

క. అనుచుసుభాషిణిదెలిపిన।
వినిముదమునమగధసుతను-వినుతాంబరచం।
దనసుమఘూషాదులమా।
నినులునగుచుఁబెండ్లికూఁతు-నింజేసిరొగిన్॥ ౧౩౩॥

క. ఆవైఖరిఁగనిమగధ।
క్ష్మావల్లభురమణిమోద-మగ్నమనోరా।
జీవయయియప్రమత్తత।
వైవాహికయత్నములఁబ్రవర్తించెఁదగన్॥ ౧౩౪॥

ఉ. సేనలకెల్లనర్మసఖ-శేఖరుఁడాగతిచాటఁబంచియ।
మ్మానవనాథుఁడుండుమణి-మందిరబృందమమందవైఖరిం।
బూనిరయంబునంజతుర-బుద్ధినలంకృతిసేయుఁడంచుఁదా।
నానతియిచ్చెఁదత్తదుచి-తానుచరాళులకెల్లనేర్పునన్। ౧౩౫॥

ఉ. కుంకుమబూయుమున్రుచిర-కోరకపఙ్క్తులముగ్గుఁబెట్టుచుం।
బంకరుహంబులన్సరస-పద్ధతితోరణముల్ఘటింపుచున్।
రాంకవముల్విదర్చుచుఁగు-రంగమదాన్వితవారిజల్లుచుం।
గొంకకపైవితానములు-గూర్చుచుచిత్తరువుల్రచించుచున్॥

మ. మణిదీపంబులుకాయమానములనై-ర్మల్యప్రభన్వెల్లతో।
రణపార్శ్వంబులవారిపూరయుతపూ-ర్ణస్వర్ణకుంభావళుల్।
గణికానీకపయోధరాకృతులవే-డ్కంబూనవారాన్వపా।
గ్రణివతీణంచుగృహాంగణంబులుపరి-ష్కారంబుగావింపఁగన్॥

సీ. బాలికావీక్షణ-మాలికాచ్ఛవిబూని,
ఫుల్లాబ్జతోరణ-స్ఫురణఁజూచి।
మాగధివక్షోజ-మంజులాకృతినొప్పు,
పూర్ణకుంభంబుల-పొలుపుఁజూచి।

సుందరీచరణవి-స్ఫూర్తిఁ దనరారు,
పద్మరాగప్రదీ-పములఁ జూచి।
కామినీనఖపఙ్క్తి-కైవడి వెలయుమౌ,
క్తికలసద్రంగవ-ల్లికలఁ జూచి।
గీ. పంకజాననానూగారు-పగిదిఁ దనరు।
సలలితాగురుధూపరే-ఖలను జూచి। ||
జనవరుఁడుసంతసిలనర్మ-సచివుఁడిట్లు!
గృహమలర.వేద్క-లోనలం-కృతులఁ జేయ॥ ౧౩౮
సీ. సలలితవిద్రుమ-స్తంభాభిరామమై,
పద్మరాగోజ్జ్వల-ప్రాంతయగుచు।
మరకతసోపాన-మండపాకారయై,
గోమేధికాంచిత-కోణయగుచు।
మహితవజ్రచ్ఛన్న-మధ్యప్రదేశయై,
శక్రనీలాన్విత-శరణయగుచు।
స్ఫురదంతరంతర-పుణ్యమంగళతూర్య,
నాదమ్ములందుమం-డగతి జెలఁగఁ।
గీ. బరగుసౌధాంతరస్థశో-భనపు వేది।
కనువరారోహలత్యంత-కౌతుకమున।
మంగళారతులొసఁగిస-మ్మాన్యలీల।
మజ్జనమొనర్చిరంతట-క్ష్మాపతికిని॥ ౧౩౯॥
క. అంతటరవిగ్రుంకినభూ।
కాంతునకుఁగరప్రదీపి-కాశ్రితముదిత।
ధ్వాంతప్రయుక్తబాధా।
శాంతిప్రదమగుచుమిగుల-సంతసమొదవెన్॥ ౧౪౦॥
సీ. భూవిబుధాశీర్వ-చోవిశేషార్భటి,
వందిమాగధశుభ-వ్యాహృతియును।

మధురనృత్యన్నటీ-మంజీరనినదంబు,
లలనామణీమంగళస్వరంబు।
మార్దంగికోజ్వల-మర్దలారావంబు,
ఘనవైణికవిపంచి-కారవంబు।
చతురవారాంగనా-సంగతనాదంబు,
సరసవాంసికవంశ-జస్వనంబు।

గీ. శంఖపటహమృదంగని-స్సాణకాహ।
ళముఖశుభవాద్యకోలాహ-లంబుమిగుల।
దత్స్వరంబునసముద్ర-తంజెలంగ।
నచటిజనులకునిమిషార్థ-మయ్యెరాత్రి॥ ౧౪౧॥

గీ. కాల్యకరణీయములుదీర్చి-కలితపుష్ప।
మాలికాగంధకాంచనాం-బరపరిష్కృ।
తాంగుఁడైభూవిభుండల-రారెనెమ్మి।
గంబునేనువింతగాఁబెండ్లి-కళజిగుర్వ॥ ౧౪౨॥

ఉ. అంతటభానుదీప్తులుద-యాచలకూటమలంకరింపనీ।
మంతవతీమణుల్చతురి-మంగయిసేసినరత్నమండలా।
క్రాంతసువర్ణభూషణప-రంపరనెల్లనలంకరించెభూ।
కాంతునిసుందరావయవ-కాంతులుచూపరులెల్లమెచ్చఁగన్॥ ౧౪౩॥

ఆ. భక్ష్యభోజ్యలేహ్య-పానీయచోష్యతాం।
బూలగంధమాల్య-ముదితపౌర।
జానపదసమూహుఁడైన ర్ఘసఖుఁడుభూ।
జానికడకువచ్చె-సంతసమున॥ ౧౪౪॥

వ. ఆసమయంబున నిజకులకలశ పారావారపరిపూర్ణసుధాకరుండగు దిలీపవసుంధరావల్లభుని వివాహ సుముహూర్తమహోత్సవంబు రయంబున రాగోరుచందంబున వారిజబాంధవుండు వారుణీము ఖంబున కుంకుమబొట్టుచందంబునం గనుపట్టు కులగురుండగు శక్తి

గురుంతు శక్తిసంపన్నులగు సంయములతో నరుంధతీసమేతుండై కల్యాణవస్తుసమూహంబులతోఁ గరుణాసమేతంబై చనుదెంచు మూర్తిమత్పరిపక్వ పురాణకృత పుణ్యఫలంబు పగిది నచ్చోటికే తెంచి సమర్చితుండగుచు మగధప్రధానప్రార్థితుండై భూసురాశీర్వాదంబులు పుణ్యాంగనాశోభననినదంబులు పంచమహావాద్యరవంబులేకీభూతంబులై మిన్నుముట్టఁ బెండ్లికొమరునకు మంగళస్నానంబులు జేయించి మలయజాద్యలంకృతులు సేయుమని నియోగించిన కొందఱుమందయానలమందానందసందోహకందళితాంతరంగులగుచుఁ జందనంబందంబుగా మేననలంది, కాలాగురుధూపమాలికా పరంపరాపరిమితవాసనావాసితాసితకచబంధంబునకు సుమమాలిక లలంకరించి మకుటాది మణిమయాభరణములు తత్తదుచిత ప్రదేశంబులం గీలించి పరిణయోచితభర్మాంబర పరిష్కృతుంజేసి పల్లవిత పారిజాతంబుపగిది భాసమానుండగు పార్థివేంద్రుఁ డుదయాచలాగ్రంబున నక్షత్రగణ పరివృతుండై భాసిల్లు రాకానిశాకరు చందంబున సచివపురోహిత బంధుసంఘంబులు తత్తదుచితప్రదేశంబులం గీలించి పరివేష్టింప భద్రగజారోహణంబు సేసి రాజమార్గంబున వెడలు నెడ తత్కళానిధి సందర్శనార్థంబు చనుదెంచిన చందంబున యామవతి యేతెంచినం బొడము తమిస్రసంబణంగ మిత్రకులోద్భవోద్వాహవీక్షణాపేక్షా సమాగత పావకానేక స్వరూపంబులో యని చూపరులగ్గింప కర్పూర కరదీపికాసహస్రంబులు వెలుఁగఁ, గాంచన కరకంకణఝణత్కారప్రవర్ధమాన నటన్నటీపదపల్లవబద్ధ మణిమంజీర శింజితంబుల మున్నె నిండుకొనియుండిన బ్రహ్మాండంబు మహిమవిషాణంబులు మగధ నగరీమందిర మంటప సౌధారామప్రదేశంబులం దనేక ప్రకారంబులం గనకలవంబులు కందూషింపుచున్న వని జానపదముగాంగన లబ్బురంబుగాఁజూచుచుండ మొరయు బిరు

దుల భీషణారావంబుల బీటలువారం బొడమిన యావరణంబు బిందుసందోహంబులో యనం దనరారు తారకాసమూహములం జయింపంజను చందంబున రివ్వన తారాజువ్వ లెగయ తదీయోద్ధత్యంబు సహింపంజాలక నరేంద్రచంద్రుని సమీపంబునకు శరణార్థులై వచ్చుచున్న తత్తారకాసముదయంబులో యన సమున్నత చంద్రకాంత సౌధోపరిభాగంబుల నచ్చరపువ్వుబోండ్ల తెరంగున మెఱుంగుదీగలచందంబున కల్పవల్లికలపగిదిం గనుపట్టు కామినీమణులు కరాంబుజంబులంజల్లు ధవళాక్షతముక్తాఫలప్రసవంబులు దనరారం గనుంగొని సంతసింపుమ శర్వశరీరంబునుంబోలె సర్వమంగళాలంకృతంబై, మానిహృదయంబునుంబోలె మాలిన్యరహితంబై, చైత్రరథంబునుంబోలె త్రిరాజరక్షితంబై, మధుసూదను వక్షస్థలంబునుంబోలె మంగళదేవతాక్రాంతంబై, గగనమార్గంబునుంబోలె కవిబుధగురుకళానిధి కమనీయంబై, చంద్రాభ్యుదయంబునుంబోలె శ్యామాన్వితంబై, బ్రహ్మలోకంబునుంబోలె మధురాజరమణీయంబై, సూరిసహనంబునుంబోలె సుదక్షిణాంచితంబై, రత్నాకరంబునుంబోలె లక్ష్మీజనకంబై, సురనదీప్రవాహంబునుంబోలె సువర్ణపద్మరాగసుందరంబై, పుణ్యక్షేత్రంబునుంబోలె పురుషోత్తమభూషితంబై, యచ్యుతాతిశయంబయ్యును నమందరాగ ధురంధరంబై, సర్వజ్ఞసన్నుతంబయ్యును ప్రద్యుమ్న భాసమానంబై, రాజమండలోజ్వలంబయ్యును రహితకళంకంబై, భర్మపంజరబద్ధకీరశారికామంజులనినాదమందీకృత పరిచారికాసల్లాపంబును, కర్పూరకరదీపికా పరంపరాపరిహృత తిమిరప్రపంచంబును, గవాక్షమార్గనిర్గత కాలాగురుధూపధూమ మాలికా కాదంబినీ ముదితమందిర మయూరంబును, బాంధవాంగనాపరివృత రత్నదీపికారారజ్యమాన చంద్రశాలా సముజ్వలంబునునగుచు నేత్రోత్సవంబొనర్పు మగధనాయకు మందిరంబు

చెంతకుం జని సమున్నతాతిశయంబున సామజేంద్రంబు డిగ్గి కంచుకి
కరాగ్ర విరాజమాన కనక నేత్రవిభ్రమణచాతురీ విరళీకృతసరణిం
దరణికరణిముదితబంధుచక్రుండై సముచితప్రకారంబున కక్ష్యాం
తరంబులు గడచి వివాహవేదికాసమీపంబున కరుగునెడ. ౧౪౫॥

ఉ. ఆనరనాథకన్యకకు-నంతకమున్నె తలంటి చంద్రబిం।
బాననలీవదుష్ణసలి-లాశ్రయగర్భములైనచారుజాం।
బూనదకుంభసంఘముల-పుష్కరముల్ మొరయంగ మంగళ।
స్నానమహోత్సవంబుతగు-జాడ నొనర్చిరి వేడ్క మీఱఁగన్॥

చ. తనతనుదీధితుల్ తటిదు-దంచితవృత్తిఁ జెలంగుచుండన।
ర్తనరతిసద్భవర్తినిక-రంబునకున్ జనియింపమేదినిన్।
ఘనతవహింపుచుం గమల-గంధికుచంబుపయఃకణంబులన్।
జెనుగుమణుంగుడువ్వలువ-చేతడి యొత్తిరి కొందఱంగనల్॥ ౧౪౭॥

క. కాలాగరుధూపములను।
పాలేయకరాస్యయొకతె-బాలామణికిన్।
నీలాలకజాలార్ద్రతఁ।
దూలింపుచుఁ గొప్పఁ బెట్టెఁ-దొయ్యలులెన్నన్॥ ౧౪౮॥

చ. అలరెసముగ్రరత్నఖచి-తాభరణంబులపువ్వుదండలన్।
లలనలు నేర్పు మీఱఁగన-లంకృతిఁ జేసినబాలనీలకుం।
తలమునవగ్రహంబులను-తారకలంబయి దాల్చివచ్చనో।
తొలకరిమబ్బటంచుఁ బరి-తోషముతో గృహకేకులాడఁగన్ ౧౪౯॥

ఆ. రాజకంటిమిగుల-రాణింప నేరికిఁ।
గూడదనెడురీతి-కొమ్మయొకతె।
మృగమదమునతిలక-మొగిదిద్దసాంకుఁడో।
విధునినను సరించె-వెలఁదిమోము॥ ౧౫౦॥

శా. ఆకర్ణాంతములైనయావనితనే-త్రాంతంబులందీరుగా।
రాకాచంద్రనిభాస్య వేఱొకతెచే-రన్వచ్చి వేడ్కన్ శలా।

కాకారాంజనరేఖలన్ని లుపఁగాఁ బోచ్చటవర్తించునా।
లీకాఙ్షుల్ నుతిసేయఁగాఁ దోణగిరా-లీలావతీచాతురిన్॥ ౧౫౧॥

క. తాటంకాదిమణీమయ।
హాటకకర్ణాభరణము-నబలవుఁ జెవులన్।
నీటుగ నలంకరించెవ।
ధూటీమణి యొకతె సాటి-తొయ్యలు లెన్నన్॥ ౧౫౨॥

సీ. మకరికాపత్రికల్-మగువ వేఱొక్కతె,
లీలఁ గపోలపాలికల వ్రాసెఁ।
గుంకుమాన్వితగంధ-పంకమొక్కతె తాంగి,
కులుకుమిటారిగు-బ్బలనలందెఁ।
గనకవర్ణములైన-కంచుకప్రముఖాంశు.
కములొక్క తైరవ-గంధిదొడఁగెఁ।
దరుణాంబుజారుణ-చరణంబులకును వే,
ఱొకలతికాంగిల-త్తుకయొసంగె।
గీ. మణిమయాఖిలమహితకం-కణములొకతె।
కాంచియొక్కతె కాంచనాం-గదములొకతె।
యూర్మిలొక్కతెకటకంబు-లొకతెయొకతె।
హారములలంకరించిరా-యతివకపుడు॥ ౧౫౩॥

క. ముత్తియపునత్తుముక్కున।
దత్తరుణీమణికినొక్క-తన్విసలిపెయా।
నత్తధరకాంతికెంపుల।
నత్తుగ లిన్ నెమ్మొగంబు-నందనరారెన్॥ ౧౫౪॥

క. హల్లకపాణి జెలంగెస।
ముల్లసితాభరణరుచిస-మూహాన్వితయై।
పల్లవితకల్పవల్లుల।
నుల్లంఘనసేయజాలు-నొయ్యారముతో॥ ౧౫౫॥

క. కుందనపుటందియల మొరయం
దేవనమునను దెచ్చి-రంగనలంచల్।
మందాక్షము బూనఁగ నరవిందముఖిం దద్వివాహ-వేదికకడకున్॥ ౧౫౬॥

ఉ. దంతిముఖార్చనాదులు యథావిధి యాజ్ఞికయుక్తలౌచుఁదత్।
కాంతయుఁ దద్ధరాధవుఁడు-గన్యకనేఁ జేసి చెలంగిరప్పుడీ।
మంతవతీమణుల్ చతురి-మన్ ధవళంబు పఠింపజీరకా।
క్రాంతగుడంబుఁ గైకొని పర-స్పరమౌళులలంకరింపుమన్॥ ౧౫౭॥

క. క్షోణీనాథుడు జెందెఁగ్రొ।
పాణిన్ నాలంకృతాత్త-పాణింబులిన।
శ్రోణీపాణిగ్రహణా।
క్షీణానలనంబు తద్వ-సిష్ఠానుమతిన్॥ ౧౫౮॥

ఉ. అంగుళులన్ స్పృశించి శుభ-మస్తుయటంచు దివుల్వచింపఁ బు।
ణ్యాంగనలాత్తకంధరల-యందుఁ దగల్చనొసంగ వేడ్కతో।
మంగళసూత్రమా మగధ-మానవనాథకుమారికాశిరో।
ధింగుతుకంబుతో వసుమ-తీపతి గట్టె సమంత్రకంబుగన్॥ ౧౫౯॥

చ. తలిరులగేరు హస్తములు-దంచిత వైఖరిఁ గూర్చి పార్శ్వభూ।
ములను మెలంగుచున్న తమ-ముద్దియలం గమనీయకక్షకాం।
తులఁగనకాభిషేకపరి-తోషితచిత్తులఁ జేసి ముత్తియం।
బులతలఁబ్రాలు బోసెఁ బువు-బోణి నృపాలునిమౌళి వేడుకన్॥ ౧౬౦

మ. లలితానందసముద్భవాశ్రుకణజా-లక్షాళితశ్యామక।
జ్జలరేఖంబగు లోచనాంబురుహపా-ర్శ్వద్వంద్వము వ్వేళక।
జ్జలరేఖాన్వితమైన పోలికె సమం-చస్ఫూర్తిగావించుఘా।
మలతం గల్గిన హేమవహ్ని చెలిప్రే-మం దేల్చె లాజాంబులన్॥

ఉ. ఆగజగామినీనృపుల-కంగములంబులకన్ సువర్ణము।
ద్రాగతరత్నరంజితప-రస్పరరమ్యకనిష్టకాంగులీ।

యోగమునం జలించెప్రాద-యోద్గతరాగరసప్రసక్తి వాం।
ఛాగుణబీజముల్ మొలవఁ-జాగెనటంచుఁ జెలుల్ హసింపఁగ౯॥

క. చేరువసభార్యుఁడై చె।
న్నారుగురుం జూచిముదిత-యైతారాశా।
రారుంధతినివసిష్ఠుల।
నారిగమ్ముంగొనెఁదదాజ్ఞ-నాధునితోడ౯॥ ౧౬౩॥

శా. ఈరీతి౯ సుముహూర్తకృత్యములు మా-నీంద్రోక్తమార్గంబున౯।
ధీరోదాత్తుఁడు తద్దిలీపనృపుఁడు-త్సేకంబునం జెందనా।
నారత్నంబులు భూనిలింపులకుమం-దస్ఫూర్తితో దానమిం।
తారత్నంబగు మాగధుం డొసఁగెనం-తర్వాణంబగ్గింపఁగ౯ ౧౬౪॥

శా. స్థాలీపాకమహోత్సవం బుభయసం-ధ్యావర్తితోపాసన।
వ్యాలోలత్వము ధారుణీసురసప-ర్యల్ వాద్యనాదంబుతాం।
బూలస్రక్ఫలగంధదానసరణుల్-ముఖ్యాంచితాన్నంబు వే।
శ్యాలాస్యక్రియలొప్పెనందఱకును-త్సాహంబుబుట్టింపుచు౯॥

సీ. మాననియోగ్యోదక-స్నానమందఱకునం,
దఱకు హేమాంబర-ధారణంబు।
ఘనసారమిళితచం-దనములందఱకునం,
దఱకును మణిమయా-భరణతతులు।
షడ్రసోపేతభో-జనములందఱకునం,
దఱకేణమదవాస-నలవిడెములు।
సలలితపుష్పవ్యా-జనములందఱకునం,
దఱకుఁగళ్యాణబం-ధురగృహములు।

గీ. కలితవీణామృదుస్వనా-కర్ణనంబు।
లందఱకునందఱకునృత్య-దంబుజాన।
నానిరీక్షణసుమహితా-నందమంద।
ఱకుఁదదుత్సవశుభవాస-రములఁగలిగె॥ ౧౬౬॥

సీ. గంధతైలాన్విత-కరదీపికాతతుల్,
పటవాసవాసనా-పటలములును।
కాహళప్రముఖమం-గళవాద్యనినదముల్,
కర్పూరమలయజ-కర్దమములు।
మానితసరసాన్న-పాన సౌఖ్యంబులు,
కల్పితనవపుష్ప-తల్పములును।
భూనాయకార్హతాం-బూల సౌరభ్యముల్,
సాంకవపవనవాస-నాంకురములు।
గీ. పరిణయంబునకేతెంచు-ప్రజలకెల్లఁ।
బౌరులకు నెల్లమగధభూ-పాలమౌళి।
తివిరి వైవాహికోత్సవ దివసములను।
గలుగఁజేసెను బంధుసం-ఘమును తింప॥ ౧౬౭॥

గీ. బంధువులకాప్తులకువనీ-పకులకవని।
సుయలకును నాకబలినాడు-సురుచిరముగ।
మగధభూజానిరాంకవ-మదగజాశ్వ।
మణిగణాదులొసఁగిబహు-మతియొనర్చి॥ ౧౬౮॥
క. తనతల్లిదండ్రిమిథిలుం।
డనిధనదుని గెలిచి తెచ్చి-నట్టిమకుటము।
ల్లునకిచ్చెమాగధుఁడుతన।
జనకునకుం దజ్జనకుఁడొ-సంగినరీతిన్॥ ౧౬౯॥
మ. తనముత్తాతసురాసురాహవమునన్-దైతేయులంగీటణం।
చినబృందారకులెల్లఁగన్గొనసునా-సీరుండుతద్ధారుణీం।
దుహితకుంప్రీతినొసంగినట్టిమణిసం-దోహస్ఫురత్తప్తకాం।
చనకేయూరయుగంబొసంగెమగధ-క్ష్మానేతజామాతకున్॥ ౧౭౦॥
ఆ. తనపితామహుండు-తపమాచరింపపి।
తామహుండువాంఛి-తంబుదీర్చి।

కరుణనొసఁగురత్న-కంకణములుమఱి।
ధావనీంద్రుఁడొసఁగె-నల్లునకును॥ ౧౭౧॥

చ. అనవరతంబు వేదవిది-తాధ్వరకర్మపరంపరం బ్రవ।
ర్తన మొనరింపుచుండఁదన-తండ్రికి వీనులఁబూనుమంచుపా।
వనుఁడగు పావకుండు చెలు-వంబుగ నిచ్చినకుండలంబుల।
ల్లుని చెవులన్దగల్చె మది-లో మగధుండు ముదంబుబూనుచున్ ౧౭౨॥

ఉ. అల్లుఁడటంచు మద్రమను-జాధిపమౌళి వివాహవేళ భూ।
వల్లభులెన్నఁగాఁదనకు-వావిరిఁ గట్నముసంగినట్టిర।
త్నోల్లసితంబులైనకన-కోర్మికలంగుళులందగల్చిరం।
జిల్లఁగఁజేసినమ్మగధ-సింహుఁడుభామకులాబ్ధిచంద్రునిన్॥ ౧౭౩॥

చ. తనసఖుఁడైనపాండ్యవసు-ధావరుఁడిచ్చినతారహారముల్।
ఐనరుగవైచె సూర్యకుల-జోత్తముకంధరమాగధుండు సో।
మునిహసియించు గొప్ప వెలి-ముత్తెపుపేర్లుతనూజమెచ్చనే।
ర్పునను పయోధికైటభవి-రోధిమెడందగిలించు వైఖరిన్॥ ౧౭౪॥

చ. భవుఁడుదయాళుఁడై తనత-పస్సుముదగ్రతకాత్మమెచ్చిగా।
రవమలరంగ నిచ్చినశ-రంబులు చాపము చంద్రహాసమా।
హవజయదోజ్జ్వలాయుధము-లక్షయతూణములంగుళిత్రముల్।
కవచము సంగమాగధుఁడు-గ్రక్కున నల్లునకుల్లసిల్లుచున్॥ ౧౭౫॥

వ. అంత. ౧౭౬॥

క. తానమ్మగధదిలీపుల।
చేనర్చితుఁడగుచు నవ్వ-సిష్ఠుండంత।
ర్ధానంబయ్యె సభార్యుం।
డై వాగరికవ్రజంబు-లబ్బురమందన్॥ ౧౭౭॥

క. అపరిమితాజానేయము।
లపరిమితస్యందనంబు-లపరిమితానే।

కపములపరిమితధేనువు।
లపరిమితోత్సుకతమగధుఁ-డల్లనకొసఁగెన్॥ ౧౭౮॥

క. అరణములుదిలీపునకీ।
సరణిమగధుఁడొసఁగనర్థ-సఖుఁడిట్లనియెన్।
బరిణయమయ్యెనయోధ్యా।
పురికేగన్వలెదిలీప-భూపతికనఘా॥ ౧౭౯॥

క. నరనాధతిలకబంపుము।
తరుణీమణితోదిలీప-ధరణీధవునిన్।
సురుచిరవృత్తినయోధ్యా।
పురికనుచుంబలుకమగధ-భూపతిమదిలో॥ ౧౮౦॥

ఉ. భానుకులాబ్ధిచంద్రునకుఁ-బట్టినొసంగితిభర్తతోనయో।
ధ్యానగరప్రవేశమగు-నాత్మజదీనికివంతయేలన।
మ్మానసమందటంచుధృతి-మాగధుఁడాత్మవహింపుచుండన।
జ్ఞానములొటనోవెడల-జాగెతదక్షులనశ్రుబిందువుల్॥ ౧౮౧॥

క. పరిసరవర్తికరాగ్ర।
స్ఫురదమలినమృదుదుకూల-శుభ్రీకృతసుం।
దరవదనేందుండైకూ।
తురిచెంతకునేగిముదము-తోనిట్లనియెన్॥ ౧౮౨॥

గీ. వనితఫలియించెనీమనో-వాంఛితంబు।
వరునితోడనుసాకేత-పురమునకును।
జనగవలెననిమదిలోన-సంశయింప।
కతివలకునెల్లపతియొని-యామకుండు॥ ౧౮౩॥

గీ. పరిణయానంతరంబున-భర్తృగోత్ర।
మిరవుగాఁబూనిజనకుమం-దిరముబంధు।
మందిరంబులలోనొక-మందిరంబు।
గాఁడలంచుటకృత్యంబు-కాంతలకును॥ ౧౮౪॥

క. పతియే పరదైవత మని।
మతిలో నూహింపవలయు-మానవతిపతి।
వ్రతలకు నిహపరసౌఖ్యో।
న్నతులు శ్రమమున ఫలించు-నాళీకముఖీ॥ ౧౮౫॥

మ. అనుచుం గొన్ని పతివ్రతానుగుణయో-గ్యాచారముల్ దెల్పిన।
మ్మినదా సీత తివిచ్చి మాగధుఁడు సా-మీచీన్య మేపారగాం।
చనచేలాదులరత్నభూషలసము-త్సాహాన్వితం జేసి తా।
తనయం బంపెను భర్తతోడ తనయం-తర్వాణులగ్గింపగన్॥ ౧౮౬॥

క. మంగళతూర్యధ్వనులు చె।
లంగన్ నిజసైన్యకలక-లంబులు నిఖిలా।
శాంగణములఁ బర్వన్ స్వపు।
రింగను గొను వేడ్క మదిగ-రిష్టత బూనెన్॥ ౧౮౭॥

మ. చతురంగంబులతో చమూపతులు ప్ర-స్థానార్హ నిస్సాణఘాం।
కృతికర్ణామృతవృత్తిగాఁ గొనఁగ సా-కేతప్రయాణోత్సవా।
న్వితులై రంచు సఖుండు దెల్ప నిజప-త్నీయుక్తుఁడౌ మాగధ।
క్షితినాథుండు వసించు చోటికి సము-త్సేకంబుతో నేగుచున్॥

ఉ. మామను నత్తకుం దమిన-మస్కృతిఁ జేసి తదాప్తపండిత।
స్తోమములన్ నిధీశ్వరుల-తోఁ దులదూఁగఁగఁ జేసి యాచక।
స్తోమము హేమవృష్టి బెలు-చందొలఁగించుచు నేగొదానచిం।
తామణి తద్దిలీపుఁడు సు-దక్షిణతోడ నయోధ్యకదలెన్॥ ౧౮౯॥

క. చతురంగబలంబులతో।
నతులితగతిని వ్విధమున-నఖిలజనుల్ స।
మ్మతి మెచ్చ దిలీపక్షితి।
పతి నిజపురమునకు జనె స-భార్యుండగుచున్॥ ౧౯౦॥

క. మంగళతూర్యధ్వనులు చె।
లంగఁగ నిజాగమనమున-లంకృతమైశో।

భంగనుపట్టునయోధ్యఁగ
నుంగొని నృపుఁ డొసఁగె పురజనులకు ముద మొగిన్ ॥ ౧౯౧॥

ఉ. అంబరచుంబితాగ్రఘుటి-తాంచితకాంచనకుంభభాసమా
నాంబుజరాగసౌధచర-దబ్జముఖీకరముక్తమౌక్తికా
డంబరసేవితాత్మకు-టసిద్ధరత్నరుచిప్రరోహుఁడై
శంబరవైరియౌవనద-శంబలెనాత్మపురింజెలంగఁగన్ ॥ ౧౯౨॥

శా. పౌరుల్ బారులుఁగట్టి నేత్రములు సా-ఫల్యంబునం జెందశృం
గారాకారసమన్వితుం దదవనీ-కాంతున్నిరీక్షించి తత్
చ్చారిత్రంబులు పెక్కుచందములవా-చాప్రౌఢివర్ణింపుచుం
జేగన్వచ్చిరివందిపుంగవులవా-చిత్వంబునం జెందఁగన్ ॥ ౧౯౩॥

క. మించిపురీజనులిట్లే
తెంచిననిజగృహమునకుఁబృ-థివిపతిజనియెన్
కంచుకికరాగ్రవిచల
త్కాంచనవేత్రప్రభాప్ర-కల్పితసరణిన్ ॥ ౧౯౪॥

క. నీరాజనములు పుణ్యాం
భోరుహలోచనలొసంగ-భూవరుఁడు నిజా
గారప్రవేశమప్పుడ
పారోత్సవమున నొనర్చె-భార్యాన్వితుఁడై ॥ ౧౯౫॥

శా. ఈరీతింబురికేగిమాగధధరి-త్రీశావతంసార్పితో
దారస్యందనవాజివారణభటాం-తర్వాణివృద్ధాంగనా
వారస్త్రీపరిచారికాదులకుభా-వప్రీతిగాబంధురా
గారానోన్నదకతల్పసౌఖ్యములుగ-ల్గంజేసిసంప్రీతుఁడై ॥ ౧౯౬॥

క. కాలోచితకృత్యములున్
పాలుఁడుగావించిసరస-పద్ధతిమణిభూ
షాలంకృతయైచనియెను
కేళీగృహమునకుఁగంట-కితగాత్రముతోన్ ॥ ౧౯౭॥

సీ. కాంచనపాంచాలి-కాకరా(గస్ఫుర,
న్మాణిక్యదీపికా-మండితంబు।
కస్తూరికాగరు-ఘనసారచందనా,
సాంకవవాసనాసలలితంబు।
జలరుహేందీవర-చంపకాశోకహ,
ల్లకహృతతోరణా-లంకృతంబు।
మానినీవిరచిత-మల్లికాశోకమా,
క్తికరంగవల్లికా-దీపితంబు।
గీ. రత్నతాంబూలపేటికా-రంజితంబు।
శాతకుంభకలాచికా_సంయుతంబు।
సూనతల్పాదిసకలవ-స్తు(ప్రపూర్ణ!
మయినకేళీగృహంబుభూ-జానిజూచి॥ ౧౯౮॥
క. అనుమతిసంతోషింపుచు।
జననాయకుఁడొక్క-మహిత-జాంబూనదశ।
య్యనుమేను జేర్చిమదిలో।
వనితారత్నంబురాక-వాంఛించునెడన్॥ ౧౯౯॥
చ. చెలఁగిసుభాషిణీ(ప్రముఖ-సింధురయానలు నేర్పుమీఱఁగాఁ।
జెలువనలంకరించినృప-శేఖరుచెంతకుఁ దెచ్చినిల్పఁగా।
నలిగుణమెక్కు_బెట్టికుసు-మాస్త్రుఁడుముంచెను గుంచితాంసుఁడై।
వెలఁదినిభూవిభుంజెలకు-వింటసుమాశుగవృష్టిలోపలన్। ౨౦౦॥
క. ఈగతిఁగేళీకమనీ।
యాగారంబుననుజలరు-హాక్షినిలిపి వే।
వేగఁజెలువపయికరుగఁగ।
మాగధిమందాక్షమగ్న-మానసయగుచున్॥ ౨౦౧॥
క. తతముఖసితకరయైయు।
న్నతకుచయుగమధ్యహార-నాయకమణిద।

ర్పితపతివిలాసస్థైరతి।
పతిమోహనవిద్యారీతి-భాసిల్లంగన్॥ ౨౦౨॥

ఉ. గారుడరత్నసంఘటిత-కాంచనపంజరబద్ధశారికా।
కీరనినాదముల్ మకర-కేతనచాపసమన్వితాళిఝా।
ర్వ్యారవముల్ దిలీపవిభు-వీనులకప్పుడిరమ్యదంబులై।
తారసిలంగ నేడిసము-దగ్రతబాలిక కేలుబట్టినన్॥ ౨౦౩॥

గీ. తనకరంబుకరంబున-మనుజవిభుఁడు।
బట్టుకొనియుండఁబల్లవ-పాణికప్పుడు।
లజ్జలజ్జింపగాతమా-లతికయందుఁ।
బొడమెఁబులుకాంకురములుసం-పూర్ణముగను॥ ౨౦౪॥

ఉ. అంతట వేడ్కఁ-మీఱఁగన-కాంగినిశయ్యకుదార్చియామినీ।
కాంతునిఁజేరుబాలికమొ-గంబుపయిన్దనమోము జేర్చినే।
తాంత్రింతము లెట్టకేలకుఁబ్రి-యంబునచుంబనమాచరించిభూ।
కాంతుఁడుమోవిపానకము-గైకొనఁజాలకబల్కెనీగతిన్॥ ౨౦౫॥

ఉ. ఆరసిపోల్కెభాసిలన-పాంగవిలోకనముల్ పితాశుగా।
సారము లైదగంబొమలు-చాపములట్లజెలంగజంఘలం।
భోరుహనేత్రతూణముల-బోలి వెలుంగుపిరుందుచక్రమై।
మీరగనుత్సహింపనెల-మిన్ మదనాజికినబ్రమయ్యెడిన్॥ ౨౦౬॥

మ. అనురాగాన్వితవీక్షణంబులుముదం-గాకల్పముల్ గాఁగతీ।
యనివాగ్ధోరణిమామకశ్రవణపే-యంబైప్రవర్తింపగా।
మినియుష్మన్మధురాధరాధరసుధో-న్మేషంబునంబంధురా।
తినుతాపంబణగించికౌఁగిటసము-త్సాహంబునం జేర్పవే॥ ౨౦౭॥

శా. ఆకర్ణాంతములైనవీనయనపు-ల్లాంభోరుహంబుల్ మదీ।
యాకారేందిరకున్ గృహంబులుగనీ-వర్పించినంగాకనా।
శీకాక్షీమకరాంకచాపఘటితా-ళిజ్యాలతాప్రేరితా।
స్తోకానేకశరాతివృష్టిజనితా-ర్తుల్ సైపఁగావచ్చునే॥ ౨౦౮

ఆ. తావకాంశుకంబు-త్రపజార విడువన।
గ్లౌటలెస్స నీర-దాంశుకంబు।
నీరదములు మాని-నీజార విడువక।
చేతనముల కెందు-సిగ్గుగలదె॥ ౨౦౯॥

చ. చందనగంధి తావకకు-చంబులు మత్కరపల్లవంబులం।
గందుకవైఖరిన్ లికుచ-కాంతి నిబంగరుబొంగరాలపో।
ల్కెందరుణాబ్జకోశముల-లీలను పువ్వులగుత్తులట్లుచె।
న్నొందినఁ గాక నీనవవ-యోమహిమల్ సఫలత్వమందునే। ౨౧౦॥

క. బిసభుజ నీయధరసుధా।
రసధారాపూర్వముగను-రాజద్వక్షో।
జసువర్ణకలశలొసఁగుము।
కుసుమాస్త్రుఋణము దీర్చు-కొని సుఖియింతున్॥ ౨౧౧॥

ఉ. కన్నులఁ జూడకున్న ముఖ-కంజము ముద్దిడకున్న రొమ్మునం।
జన్నులు దార్పకున్న సర-సంబగు మోవియొసంగకున్న యో।
కన్నియ యెన్నఁ గానడవిఁ-గాచిన చంద్రిక నీవయోవిలా।
సోన్నతియొక్క-చందమున నొప్పు సుమీ పలుమాటలేటికిన్॥ ౨౧౨

ఉ. గంధగజేంద్రయానముఖ-కంజము పైఁడన చూడ్కి మత్తపు।
ష్పంధయవృత్తిఁ బూనఁగను-పాలకుఁడీగతిఁ బల్కి చంద్రపా।
గ్రంధిసడల్చు పువ్వువిలు-కాని తెరంగు వహించి కంచుక।
గ్రంధి తనంత నే విడిన-కైవడిఁ జేతులఁ జాచి విప్పచున్॥ ౨౧౩॥

క. బాలికతనువున పులకలు।
జాలుకొనం గౌఁగలించి జననాథుఁడు నా।
త్మాలింగనసౌఖ్యాంబుధి।
నాలలనయుఁ దానునోల-లాడఁ దొడంగెన్॥ ౨౧౪॥

క. నూతనపరిరంభావి।
ర్భూతానందమున మేను-పొలఁతుక మరువం।

బీరితిఁ నీవీబంధము।
శాతనఖాగ్రములన్నృపుఁడు-సడలించునెడన్॥ ౨౧౫॥

మ. కరగుప్తస్తనయుగ్మయై రదనరే-ఖాచ్ఛన్నబింబోష్ఠియై।
భరితోరుద్వయబంధగుంభితనితం బస్థానయై దోర్లతా।
వరణాగోచరకక్షయై భయజిత-వ్యాహారయై బాలశం।
బరభీతిన్ గణియింపదయ్యె మదిలో-బ్రత్యగ్రజితోరుత్రపన్॥ ౨౧౬

మ. అమితాయాసవిభక్తపూర్వఘుటితా-న్యోన్యోరుబంధంబతి।
శ్రమమార్గాజితమంజులాధరసుధా-సారంబనూనక్రియా।
స్తిమితవ్రీడమహీనహస్తచతుర-త్వప్రాప్తవక్షోజమ।
తరుణీనూత్నసమాగమోత్సవము గో-త్రాజానిబూనెన్ రహిన్॥

శా. శ్వేదాంచత్కుచహేమకుంభము జహ-చ్ఛీత్కారసంరంభమా।
హ్లాదాస్రాన్వితనేత్రమంకురితరో-మాంచస్ఫురద్గాత్రమా।
స్వాదర్స్యుగ్దతమందహాసమతిల-జ్జావాసమాలింగనా।
శాదూరీకృతనిద్రమానవవధూ-సంభోగసౌఖ్యంబొగిన్॥ ౨౧౮॥

క. ఈవిధమునను దిలీపో।
ర్వీవల్లభుఁడప్పుడనుభ-వింపుచునుండన్।
రే వెలఁదుక చూపోపకఁ।
బోవునన వేగుచుక్క-బొడమెం బ్రాచిన్॥ ౨౧౯॥

క. భవనప్రదీపికార్జిత।
ధవళాకృతి విదితరమ్య-దయసమయుండై।
ధవుఁడుకనుసన్న సేయఁగ।
సవినయముగ లేచిచలిత-చరణాంగదయై॥ ౨౨౦॥

ఉ. జారినకొప్పుతో నిదుర-సందడితోఁ బలుగంట్లమోవితోఁ।
దీరనికోర్కెతో బెదురు-దీరనికన్గవతోఁ జొలంగఁగా।
నేరనిలజ్జతో నిలువ-నేర్చనకూరిమితో లతాంగిశ్రీం।
గారగృహంబుచే డెలకుఁ-గన్నులపండువుఁగాఁగ వెల్వడెన్॥

ఉ. భూరమణుండు శయ్యపరి-పూర్ణమనోరథుఁడై చుడిగ్గిని।
ద్రారహితంబులైనకను-దమ్ములకెంపువహింపనాహ్ని కా।
చారవినోదవీతదివ-సశ్రముఁడై సుఖియించెఁ గామవి।
ద్యారతిరాత్రులందుమగ-ధాత్మజఁ గౌఁగిటఁ గారవింపుచున్॥

క. ఈరీతిఁ గొన్ని దినములు।
భూరమణుఁ డురతులఁ బ్రీతిఁ-బొందినసతిశృం।
గారవతి ప్రౌఢరతిఁ జె।
న్నారెం గందర్పవిదళి-తావిత్రపయై॥ ౨౨౩॥

సీ. విడివడియున్న నీ-వీబంధపటిమతో,
వలనొప్పులజ్జబ-యలికిఁ జనఁగ।
గ్రొమ్ముడిగట్టిన-కుసుమదామములతోఁ,
బ్రాలంబములు వెన్ను-పైనటింపఁ।
గనకకాంచీఘంటి-కారవంబులతోడ,
రతికూజితధ్వను-లతిశయిల్లఁ।
బలుదెరంగులఁ దోఁచు-పులకాంకురములతో,
ఘర్మసీకరములం-గములఁ బొడమ।

గీ. మీగుణోర్కె-లతోడసీ-త్కారమలరఁ।
బటుకళాభావసుఖముతోఁ-బారవస్య।
మావహిల్లంగ విభునకా-హ్లాదమొసఁగెఁ।
బూరుషాయితరతులనం-భోజవదన॥ ౨౨౪॥

క. ఆరామారత్నము శృం।
గారాగారములఁ గేళి-కానగముల పు।
ష్పారామములదిలీప।
క్ష్మారమణినితోడఁ గ్రీడ-సలుపుచు వేడ్కన్॥ ౨౨౫॥

క. లే నెలప్రతీచివిరియం।
బూనినచందమునవంద-ముగ శుభవేళన్।

బూనెఁ దౌహృదలక్షణ।
మానెలఁతుక సకలజనము-లానందింపన్ ॥ ౨౨౬॥

సీ. తినుబడివస్తువుల్ - తెప్పించుటయె కాని,
తృప్తిదీరఁగ భుజి-యింపలేదు।
మేనువంచివిపంచి-మేళవించుటె కాని,
మించితంత్రులు గోట-మీటలేదు।
చెలులతోఁ బువ్వుతో-టలకేగుటయె కాని,
కోర్కెమీఱఁగ విరుల్-గోయలేదు।
కవితచిత్రంబుగాఁ-గల్పించుటయె గాని,
పడిపుస్తకముబట్టి-వ్రాయలేదు॥

గీ. దిటముగా రతికుత్సహిం-చుటయె గాని।
విభునికమితోత్సవంబుగా-వింపలేదు।
లలన గర్భస్థశిశువువ-లక్షపక్షు।
విధునిగతిఁ బూటపూటకు-వృద్ధిబొంద॥ ౨౨౭॥

చ. నడుము బయల్పడెన్ వళుల-నమ్రములయ్యె నవీనకాంతులే।
ర్పడె మయికన్నులన్ నిదుర-పాదుకొనెన్ భరమయ్యె హారముల్।
నడజడమయ్యె చన్మొనల-నల్లవశించె కృశించె భుక్తియు।
ప్పడతికి గర్భమీశ్వరకృ-పం గ్రమవృత్తిని వృద్ధిఁబొందగన్॥ ౨౨౮

ఉ. అంతవసిష్ఠమౌనిసము-దంచితవృత్తి దిలీపమేదినీ।
కాంతుఁడు సంతసిల్లఁ దన-కాంతయుఁ దానును వచ్చి ప్రీతిసీ।
మంతవతీశిరోమణికి-మానితపుంసవనంబొనర్చిసీ।
మంతమహోత్సవంబు విధి-మార్గమునన్ నడిపించెఁ బిమ్మటన్॥ ౨౨౯

క. ఆతరువాత సుదక్షిణ।
ప్రీతిన్ శుభవేళ గనియె పృథునిభునిసుతన్।
శీతకరజైత్రరక్ష।
ద్యోతాదులు తుంగసంగ-తులదనరారన్॥ ౨౩౦

చ. తనయునిఁ గాంచెనిప్పుడెసు-దక్షిణయుంచును బ్రీతిపుణ్యభా।
మినుతెఱఁగింపవారలక-మేయధనంబులొసంగి రాజుకాం।
చనమణిరాంకవాభరణ-సామజసైంధవగోముఖార్థముల్।
జనులునుతింపవిప్రులకొ-సంగెముదంబుమదింజెలంగఁగన్॥ ౨౩౧॥

మ. అవనీదేవులకామహీరమణుఁడా-హ్లాదంబుగానందనో।
త్సవవేళందనవిత్తమెల్లనొసఁగన్-ధాత్రీశనీపట్టభూ।
దివిజశ్రేణికినింతకంటెఘనవృ-త్తిన్ విశ్వజున్నామయా।
గవిధిన్ ద్రవ్యమశేషమిచ్చునను చుం-దారాకొంతికుల్బల్కఁగన్॥

గీ చంద్రుఁడుదయింపనుప్పొంగు-జలధిరీతి।
నందనుండుదయింపనా-నందమంది।
జనవిభుండొనరించెను-జాతకర్మ।
మఖిలజనులెన్నఁగావసి-ష్ఠానుమతిని॥ ౨౩౩॥

క. ఒకశుభదివసంబుననా।
మకరణసంభ్రమముసేయ-మదిఁదలఁచుచునా।
రకతనముఖంబుఁజూచినఁ।
బ్రకటముగవసిష్ఠుఁడవని-పతికిట్లనియెన్॥ ౨౩౪॥

శా. మున్నిక్ష్వాకుకకుత్స్థులున్నృపులలో-ముఖ్యుల్ తదీయాన్వయో।
త్పన్నుల్ వృద్ధితదాఖ్యతంగనిరత-ద్ధాత్రీశులంబోలియ।
త్యౌన్నత్యుండగునీసుతుండితఁడుర-ఘ్వాఖ్యాన్వితుండైనవి।
ప్పన్నుల్ రాఘవులంచుఁబల్కుదురునీ-పౌత్రాదులంబార్థివా॥

క. అనుచువసిష్ఠుఁడుబలికిన।
తనయునకునురఘువటంచు-ధరణీశుఁడువ్రా।
సెనునామకరణమనఘు।
ధ్వనులమృదంగాదినిఖిల-వాద్యములలరన్॥ ౨౩౬॥

గీ. నామకరణమహోత్సవా-నంతరమున।
దేవతలుమెచ్చఁగాదిలీ-పావనిపుడు।

ధారుణీసురచాతక-తతులకెల్లఁ।
గనకవర్షంబుగురియుచు-ఘనతఁ గాంచె॥ ౨౩౭॥

క. ఉపధలు దెచ్చినన్నృపతులఁ।
గృపఁ గ్రమ్మర వారివారి-గృహములకశ్వ।
ద్వీపముఖ్యోచితబహుమతి।
నపరిమితోత్సవము జేసి-యవనిపుఁడనిపెన్॥ ౨౩౮॥

మ. కవులుం గర్మపరాయణుల్ కథికులుం-గార్తాంతికుల్ గాయక।
ప్రవరుల్ బ్రహ్మవిదుల్ ప్రశస్తచరితుల్-పౌరాణికుల్ పండితుల్।
ద్రవిణార్థుల్ గుణవృద్ధులాగమపరుల్ తత్త్వజ్ఞులాధారుణీ।
ధవుచేఁ బూజితులైరహింజనిరిత-ద్దాతృత్వమగ్గింపుచున్॥ ౨౩౯॥

మ అనుకూలావసరంబులన్నృపుఁడు దో-లారోపణంబర్భకాద।
ర్శనమజ్జారవిలోకనంబు గృహని-ష్క్రామంబు భూదేవపం।
దనమీషన్నవనీతభక్షణవిధా-నంబన్నసంస్పర్శనం।
బొనరించెం దనపట్టికిన్నిరుపమా-నోత్సాహసంయుక్తుఁడై॥ ౨౪౦

గీ. నృపుఁడు పండ్రెండుమాసముల్-నిండకుండ।
శుభముహూర్తంబునను దన-సుతున కాప్త।
సహితుఁడై పుట్టుజుత్తుల-సంబరంబుఁ।
గర్ణవేధోత్సవముఁ జేసెఁ-గడుముదమున॥ ౨౪౧॥

క. ఆటలపాటలమాటల।
తేటలనీటలరవసుమ-తీనాథునకున్।
మాటికిమాటికిముద్దులు।
మూటలుగట్టుచుసుధోత్త-ముఁడుతనరారున్॥ ౨౪౨॥

క. బాలున కైదవయేటను।
చౌలము వ్రతబంధనంబు-జరిగించెను భూ।
పాలుండీసంభ్రమమే।
కాలంబున జూడమనిజ-గజ్జను లెన్నన్॥ ౨౪౩॥

క. అపరిమితద్రవ్యంబుల।
విపులాదిత్యులకునొసఁగి-వినయాన్వితుఁడై।
యుపనయనానంతరమున।
నృపమౌళివసిష్ఠుతోడ-నిట్లనిపలికెన్॥ ౨౪౪॥

మ. భవదాశీర్వచనప్రభావమునభూ-పాలావళిన్ గల్చివే।
దవిధిన్ మాగధిఁ బెండ్లియాడి సుతర-త్నప్రాప్తి మోదించితిం।
ధవు లెన్నన్ ద్విజకోటికిం గనకర-త్నశ్రేణు లర్పించితిం।
స్తవనీయాతిశయంబుఁ గంటి మునినా-థగ్రామణీధీమణీ॥ ౨౪౫॥

శా. వేదాంగంబులు సర్వశాస్త్రిసరణుల్ - వేదంబులాచారము।
ల్వేదండాంశరథాధిరోహణములు-ర్వీపాలనస్ఫూర్తినా।
నాదివ్యాస్త్రవిధానముల్వివిధజ-న్యప్రక్రమంబుల్ ధను।
ర్వేదంబీతనికబ్బునట్లుగఁ గృప-న్వీక్షింపవే మ్రొక్కెదన్॥ ౨౪౬॥

చ. అనుచు దిలీపభూమివిభుఁ-డాదరమొప్పఁగ విన్నవించినన్।
మునివరుఁ డాకుమారునకు-ముఖ్యములైనతదుక్తవిద్యలె।
ల్లను దెలియంగఁ జేయఁ బ్రబ-లప్రతిభన్ గ్రహియించి రాజనం।
దనుఁడు కళాధికుండగు సు-ధానిధికైవడి నొప్పెఁ జెల్వుగన్॥ ౨౪౭॥

క. నృపమౌళి సకలవిద్యా।
నిపుణుండగు సుతునిఁ జూచి-నిర్భయుఁడై నే।
రుపుమీర నశ్వమేధము।
లపరిమితస్ఫూర్తి జేయ-నారంభించెన్॥ ౨౪౮॥

చ. సరయువుచెంగటన్ సవన-శాలలమర్చి సమస్తవస్తువుల్।
గురుతరలీలఁ గూర్చి సుర-కోటిముదంబెలఁగన్ సభార్యుఁడై।
ధరణివిభుండు వేదవిహి-తంబగుదీక్షవహించె మంత్రులం।
దరున్నృపుఁ జూడవచ్చినజ-నంబుల సుత్సవమందఁ జేయఁగన్॥

శా. ఆజానేయముతో సుతుండనిగి శౌ-ర్యస్ఫూర్తిఁ జూపింపఁగా।
భూజానుల్ మణికాంచనోపధలుస-ద్బుద్ధిన్ సమర్పింపఁగాఁ।

చేజోమూర్తివసిష్ఠుఁడాధ్వరముప్రీ-తింబూనివర్తింపఁగా।
శ్రీజెన్నారఁగనశ్వమేధమఖము-శ్రీభర్తగావింపఁగన్॥ ౨౫౦॥

క. ఆరాజుమఖముజూడని।
వారెవ్వరులేరుజూచు-వారలలోనం।
గోరినకోర్కెలభింపని।
వారెవ్వరులేరునాల్గు-వర్ణంబులలోన్॥ ౨౫౧॥

క. ఆతఁడుబ్రహ్మాధ్వర్యు।
ద్గాతలహోతనుసముత్సు-కతనుబరిత్రి॥
స్తాతమొదలైనఋత్వి।
గ్వ్రాతములందనిపెయోగ్య-గతిదక్షిణలన్॥ ౨౫౨॥

క. స్వాతీగతుఁడగుకవివి।
ఖ్యాతింగురిపించువృష్టి-గతినృపుఁడాత।
ర్యాతవతిషించెవిప్ర।
వ్రాతంబలరన్సువర్ణ-వర్షంబెలమిన్॥ ౨౫౩॥

ఉ. ఆరఘుశక్తివైరినృపు-లశ్వముముట్టఁగఁజాలరైరిదే।
వారులుమంత్రశక్తిసవ-నావనిముట్టఁగఁజాలరైరిపై।
వారువసిష్ఠశక్తినొక-వంకరఁబట్టఁగఁజాలరైరిగో।
త్రారమణుండుసేయుమఖ-తంత్రముజూచినవారుమెచ్చరే॥

ఆ. సకలజనులుజూడ-సరయూజలంబుల।
వారుణేష్టిఁజేసి-వసుమతీశుఁ।
డధ్వరాంతరమున-నవబృథస్నానంబు।
తానొనర్చెదేవ-తలునుతింప॥ ౨౫౫॥

క. అనఘుఁడుదిలీపుఁడీవిధ।
మునవరుసశతాశ్వమేధ-ములుజేసితనూ।
జునిరాజ్యంబునకభిషి।
క్తునిఁజేసిమృదూక్తినతని-తోనిట్లనియెన్॥ ౨౫౬॥

ఉ. నీకువసిష్ఠమౌనిన్నృప-నీతులుశాస్త్రములాగమంబులు।
న్నేకముతోడఁ జెప్పుటయుఁ-జెప్పినకెల్లను నీవుబుద్ధిన।
వ్యాకులతం గ్రహించుటయు-నాత్మ నెఱుంగుదు నైనఁ బ్రీతితో।
నేకమతిన్ వినందగున-రేంద్రమదుక్తహితోపదేశముల్॥ ౨౫౭॥

గీ. ధర్మనిత్యుఁడు బ్రాహ్మణో-త్తముఁడభిజ్ఞుఁ।
డగునుపాధ్యాయులను బ్రోమ-టర్హమగును।
వినయరతుఁడు బహుశ్రుతుఁ-డనఘుకులజుఁ।
డగుపురోహితుఁ బూజింపఁ-దగును సుమ్ము॥ ౨౫౮॥

క. మతిమంతు విధిజ్ఞు బహు।
శ్రుతు నగ్నులయెడను భూవ-రులు నిలుపఁదగున్।
హుతహేష్యమాణకాలము।
లతఁడెఱుఁగక యున్నఁ గర్మ-హానియగుఁ జుమీ॥ ౨౫౯॥

క. భూవరుఁడు దేవతలపితృ।
దేవతలను గురుజనులను-దేశికులను భూ।
దేవతలను వృద్ధులవి।
ద్యావిధులను జనకసముల-నర్చింపఁదగున్॥ ౨౬౦॥

క. శస్త్రాస్త్రప్రాజ్ఞు నిబహు।
శాస్త్రవిశారదుని సుగుణ-సహితు నృపాలుం।
డస్త్రగురుఁ జేసికొనిస।
ద్వస్త్రాభరణాదులొసఁగఁ-దగు నాతనికిన్॥ ౨౬౧॥

క. శ్రుతవంతులాత్మసములు నిం।
గితవిదులు జితేంద్రియులు సు-కృతులతిశూరుల్।
హితులు కులీనులు నృపతికి।
సతతంబు ప్రధానులైన-సంపదలరుదే॥ ౨౬౨॥

ఆ. శాస్త్రవిదులు మంత్ర-సంపన్నులైనమం।
త్రులను గూడి భూవ-రుండు మంత్ర।

సరణి జెలఁగవలయు జయమూలమగుజుమీ।
మనుజవల్లభునకు-మంత్రమెపుడు॥ ౨౬౩॥

క. మేలవయమునిద్రింపమి।
మేలు-చితంబైనవేళ-మేలుకొనుటభూ।
పాలసుతుఁడరనైపుణ।
మాలోచనఁజేయవలయు-నవరతుపలక్॥ ౨౬౪॥

క. వినుమొక్క-డైనపలువురు।
మనుజులతోఁగూడియైన-మంత్రంబాలో।
చనసేయరాదుచనరా।
దనఘాతనమంత్రమెప్పు-డన్యులచెవికిక్॥ ౨౬౫॥

గీ. పరమలఘుమూలములుమహా-ఫలములైన।
కార్యములునిర్ణయించిశీ-ఘ్రింబెయవని।
పాలుఁడారంభమొనరింపఁ-జాలఁడేని।
యాతఁడగుదుర్వ్యశంబున-కాకరంబు॥ ౨౬౬॥

క. భువినిశ్చితారములలో।
నవితథగతినడుచుచున్న-యవిఫలితములై।
నవిదాచినదాగగనే।
రవుకర్తవ్యము లె తెలియ-రాదితరులకుక్॥ ౨౬౭॥

క. తనచేతనుమంత్రులచే।
తనురక్షితమైనమంత్రి-తమునడుచుప్రయో।
జనములచేనూహలచే।
జనులకనిర్ణీతమైన-సఫలముకాదే॥ ౨౬౮॥

క. వినుమూగశతమృకంటెను।
ఘనుడగుపండితునిమిగుల-కరిగింపఁదగుం।
జనపతికాతఁడునయవ।
ర్తనమునసమకూర్చుకీర్తి-ధనవైభవముల్॥ ౨౬౯॥

చ. తనకుసహాయులై ప్రబల-తంత్రములన్విహరింపనేర్తురే।
ధనముహరింతురింతయును-తథ్యముమూర్ఖులఁజేరనిచ్చినన్।
వినుఘనుఁడొక్క-మంత్రియొవి-వేకమువిద్యయుశౌర్యమార్జవం।
బనుమతిఁగల్గెనేనిపతి-కర్థసమృద్ధియొనర్చుదక్షుఁడై॥ ౨౭౦॥

క. ఉత్తమమధ్యమజనముల।
నుత్తమమధ్యములునగుప్ర-యోజనములభూ।
పోత్తముఁడునిలిపియధమని।
మిత్తంబులుఁజెప్పవలెజు-మీయధమములకున్॥ ౨౭౧॥

క. పితృపైతామహులుశుచి।
వ్రతులుసమస్తోపధావి-రక్తులుసుగుణా।
న్వితులగుసచివశ్రేష్ఠుల।
చతురతదగనిలుపవలయు-సత్కార్యములన్॥ ౨౭౨॥

గీ. జానపదులీషదధికార-జనులొనర్చు।
క్రూరదండంబుచేఁగడు-గుందకుండ।
వారిరక్షింపఁగాఁదగు-వారినిలిపి।
చూడవలెరాజుతద్వృత్తి-సూక్ష్మదృష్టి॥ ౨౭౩॥

క. ధనలుబ్ధతకరమధికము।
గొనినంబ్రజలధిపుచెంత-కుంబోరుకులాం!
గనలంగజాత్తున్స।
జ్జనులధమునిఁజేరబోని-సరణికుమారా॥ ౨౭౪॥

క. శూరుఁడుపాయజ్ఞుఁడుపరి।
వారభయంకరుఁడుశాస్త్ర-వంతుఁడునిజల।
క్ష్మీరక్షకుఁడగుమంత్రిని।
భూరమణుఁడుత్రుంపకున్నఁ-బోలియునతనిచే॥ ౨౭౫॥

చ. కులమునుబుద్ధిశౌర్యమను-కూలతధైర్యముగల్గిదక్షుఁడై।
మెలఁగఁగనేర్చువానికడి-మిందనసేనకునాథుఁజేయఁగా।

వలయుజయప్రదంబుబల-వంతులుశూరులుయుద్ధకోవిదుల్।
విలసితవిక్రమాఢ్యులగు-వీరులనేలుటభూమిభర్తకున్॥ ౨౭౬॥

ఉ. కాలములన్యథోచితము-గానవిలంబితవృత్తిబూనిభూ।
పాలుఁడువేడ్కవేతనము-భుక్తముభృత్యులకిచ్చినన్బహు।
శ్రీలుజెలంగుచుండువిప-రీతమొనర్చినభృత్యులుగ్రవా।
చాలకులౌదురట్లయిన-సర్వమనర్థముగాదెరాజుకున్॥ ౨౭౭॥

గీ. కులమువారలుతనకను-కూలులైన।
తనప్రయోజనములయందు-మనసునిలిపి।
తనువులిచ్చెదరట్లౌట ధరణివిభుఁడు।
పూజితముదాస్వజాతినిఁ-బ్రోవవలయు॥ ౨౭౮॥

క. జానపదులభిజ్ఞులుప్రతి।
భానిపుణులుసత్యరతులు-పండితులధిక।
జ్ఞానులగుదూతలవనీ।
జానికివినుపింతురఖిల-జనచరితంబుల్॥ ౨౭౯॥

క. దౌరతీర్థాష్టాదశకము।
పరులదేసందనదుదెసను-బదియేనితరే।
తరమెఱుఁగవిముగ్ధరుము।
గ్గురిచారులవలనఁదెలిసి-కొనఁగావలయున్॥ ౨౮౦॥

మ. యువభూజానిపురోహితుండుసచివుం-డుదోగ్యగిదౌవారికుం।
డవరోధస్థుఁడుప్రాడ్వివాకుఁడుపురా-ధ్యక్షుండుసేనానిధ।
ర్మవిధిజ్ఞుండుపురప్రదర్శకుఁడుక-ర్మస్థుండుకర్మాంతికా।
ర్యవిచుండార్యుఁగుసుపండపాలకుఁడురా-ష్ట్రాంతాధ్యుఁడున్
దూతయున్॥

క. ఇవిపదునెనిమిదితీర్థము।
లివియన్యులపక్షుఁడు-నెఱుఁగవలెంబా।

రివుఁడుతన దెసపురోహిత।
గృహవరాట్సచివులనువిడచి-యూహింపఁదగదె॥ ౨౭౨॥

క. తను వెడలఁగొట్టినంబుర।
మునునుండకనన్యదేశ-ములుఁదిరుగుచుని।
రనుఁడైక్రమ్మరజనుదెం।
చినవైరులన్నృపుఁడువిశ్వ-శించినఁజెడఁడే॥ ౨౭౩॥

క. నాస్తికులవిద్యయాచియు।
పాస్తియొనర్చిననన్నృపుఁడు-పడయఁగలఁడెలో॥
కస్తుతిపండితవేషుఁడు।
వాస్తవవిద్వేషుఁడగుచు-వర్తించుజుమీ॥ ౨౭౪॥

క. ఆనాస్తికులతిముఖ్యము।
లైనస్మృతిస్మృతులుజగతి-నలరుచునుండం।
గానోటిబలిమిధరణీ।
జానికిఁజూపుదురనర్థ-సరణిచతురులై॥ ౨౭౫॥

శా. వీరోపేతమువాజివారణరథా-న్వీతంబుసత్ఖ్యాఖ్యమా।
చారభాజితవర్ణమున్నతమహా-సౌధంబమాత్యోత్తమా।
ధారంబర్కకులీనభూషితమువి-ద్వద్వర్ణితంబుజ్వల।
ద్వారంబేలుముధర్మపద్ధతినయో-ధ్యాపట్టణంబింపుగఁ॥ ౨౭౬॥

సీ. సకలాగ్నిచయనాది-సవనబంధురములు,
వివిధవిద్వజ్జన-విలసితములు।
దేవాలయసరోప్ర-పావర్ణితంబులు,
పశునరనారీవి-భాసురములు।
భయవిహీనంబులా-పద్వర్జితంబులు,
వృకముఖమృగవిష-ద్విరహితములు।
ఘనశోభితములుదు-ర్జనభయంకరములు,
రజితకాంచనరత్న-రాజితములు।

గీ. రమ్యగృహములుమత్పూర్వ-రక్షితములు।
ఘనసదీమాతృకలుత్పణ-వనసమిత్స।
మృద్ధములుజనపదములు వృద్ధిపొందు।
పదతినినీవుపాలింపు-బుధిమహీమ॥ ౨౮౭॥

క. తనకుంబ్రియులైనవణి।
గ్జనులను వాణిజ్యసరణిఁ-జతురుఁడగుచుఁబ్రోచి।
చినదాఁకవృద్ధిఁబొందునె।
ధనముతనరితటనతాను-ధరణీపతికిన్॥ ౨౮౮॥

క. జనసంరక్షణమునకై।
జననాయకుమహిస్సృజించు-జలజాసనుఁడా।
జననాథుఁడుభోగేచ్ఛన్।
జనులనురక్షింపకున్న-సద్గతిగలదే॥ ౨౮౯॥

క. మృదువచనంబులముదితల।
మదికుత్సవమెసఁగవిమల-మతిఁబ్రోవఁదగుం।
దదనుమతిఁదిరుగుటంగా।
డదుకూడదుగుహ్యమేర్ప-డం జెప్పుటయున్॥ ౨౯౦॥

క. కరివనగుప్తిశుభంబగు।
కరిణులనార్జించుటంత-కంటెశుభమగున్।
ద్విరదాశ్వరథసమృద్ధిని।
ధరణీపతితృప్తిఁబొందఁ-దగదెన్నటికిన్॥ ౨౯౧॥

చ అనుదినముంబ్రభాతసమ-యంబునలేచియలంకరిష్ణుఁడై।
జనములకాత్తదర్శనమొ-సంగుచుభృత్యులు జేయుకార్యముల్।
గనుఁగొనుచున్నవైఖరినిఁ-గన్గొనకున్న తెరంగునంజరిం।
చినవసుధావరుండువిల-సిల్లుశరద్గుహరాజుకైవడిన్॥ ౨౯౨॥

మ. ధనధాన్యాయుధవీరయంత్రజలసం-దర్భంబులైదుర్గముల్।
దనరారన్ వ్యయమల్పమైనధనమ-ల్పంబైతగంచద్వ్యయం।

బనిమేషాతిథియోధమిత్రపితృవి-ప్రాభ్యాగతాధీనమై।
కనుపట్టన్నృపుఁడేలె నేనియుదిస్వ-ర్గస్ఫూర్తి వాటిల్లదే॥ ౨౯౩॥

ఉ. దొంగలు కానివారిఁగడు-దొంగలటంచును దొంగలైనవా।
రింగరుణార్ద్రులంచుబహు-రీతులనమ్మికఁబుట్టునట్లుబ।
ల్కంగలరాయమాత్యులచ-లత్స్వపృహద్ధర్మపథంబుమాత్మదృ।
ష్టింగనిరాజుతద్వచన-దృష్టికి హేతువులూహఁజేసినన్॥ ౨౯౪॥

క. పరిశుభవిభ్రాంతింద।
వ్వారుదలఁచును మనుజులొక్క-సమయ్యంబునఁబ।
ల్కారెయుంచున్నపుడుశిక్షా।
చరణమునవిమర్శఁజేయఁ-జనునయ్యెడలన్॥ ౨౯౫॥

క. వృష్టుఁడుగృహీతుఁడవసర।
దృష్టుండతిచార్యగుణప-రిష్కృతుఁడగువాఁ।
డిష్టుండయినను శిక్షా।
భ్రష్టుంజేయంగరాదు-పార్థివుఁడెపుడున్॥ ౨౯౬॥

క. వినుమపరాధినిశిక్షిం।
చినవిధమున నిరపరాధి-శిక్షించినయా।
తని బాష్పబిందువులసం।
ఖ్యనుపశుపుత్రులునశింతు-రవనీపతికిన్॥ ౨౯౭॥

క. ఇలబలవంతులకున్మధు।
ర్బలులకునుంబీఁజరుగు-పట్లనుదనమం।
త్రులుపక్షపాతమార్గం।
బులువిడచిచరింపభూవి-భుఁడునుతికెక్కున్॥ ౨౯౮॥

క. బాలురువృద్ధులువిద్యా।
శాలురుముఖ్యులనుమాన-సమ్ముచెమ్మృదువా।
చాలత చేదానముచేఁ।
బాలింపఁగవలయుభూమి-పాలుండెపుడున్॥ ౨౯౯॥

క. గురువృద్ధతాపసాతిథి।
ధరణీదేవతలదేవ-తలచిత్తమునన్।
నరపతిపూజింపుచుయో।
గరహస్యములభ్యసింపఁ-గావలయుఁజుమీ॥ ౩౦౦॥

క. ధర్మంబర్థముచేతను।
ధర్మముచేనర్థమర్థ-ధర్మంబులన।
త్కార్మంబులఁగామముచే।
నిర్మూలముసేయరాదు-నృపుఁడెయ్యెడలన్॥ ౩౦౧॥

క. కాలజ్ఞుండైతత్త।
త్కాలంబులనర్థధర్మ-కామంబులుదా।
నాలోకింపుచుధరణీ।
పాలుఁడువిహరింపనాట-పట్టగుసిరికిన్॥ ౩౦౨॥

గీ. పౌరజానపదులు-బ్రాహ్మణుల్ధర్మశా।
స్త్రార్థకోవిదులుని-రంతరంబు।
తనసమృద్ధికోరు-కొనుచుండఁబాలింప।
వలయునింద్రియముల-గెలచినృపుఁడు॥ ౩౦౩॥

మ. అనిశాకృష్టసర్వదిగ్గమనమ-జ్ఞాలోచనంబేకచిం।
తనమాలస్యమునాస్తికత్వముప్ర-మాదంబింద్రియాసక్తితో।
భనకార్యారతిదీర్ఘసూత్రతయగో-ప్యంబీర్ష్యబొంకార్యవం।
చననిర్ణీతముసేయలేమిన్నృపదో-షంబుల్మనుప్రోక్తముల్॥ ౩౦౪

గీ. వడిచతుర్వర్గమునుదశ-వర్గపంచ।
వర్గములుసప్తవర్గాష్ట-వర్గములుత్రి।
వర్గమునుదండనీతినా-వార్తనాత్ర।
యీయనందగువిద్యల-నెఱుఁగవలయు॥ ౩౦౫॥

సీ. ఆనని సామాద్యుపాయములు చతుర్వర్గ,
మననుండులుబ్రుండు-నన్నృతవాది।

కూర్చుండుమూర్ఖుండు-భీరుఁడ సిరుఁడన,
యుండుఁ బ్రమాదిదూ-ష్యుండనంగ।
దశవర్గమపరాధ-వశమునసాపత్న్య,
మునమాటవలన స్త్రీ-జనమువలన।
ధనములవలనబు-ట్టిన వైరములుపంచ,
వర్గంబునృపమంత్రి-దుర్గరాష్ట్ర।

గీ. సైన్యమిత్రధనంబులు-సప్తవర్గ।
మరదూషణమిార్ష్యదో-హంబనూయ।
సాహసముదండవాక్పరు-షతలుపిశున।
వర్తనంబిష్టవర్గంబు-వత్స వినుము॥ ౩౦౬॥

ఆ. తనకశక్యమైన-పని సేయఁబోవుట।
తనకుశక్యమైన-పనివిడుచుట।
శక్యమైనపనికి-సమయంబెఱుంగమి।
వసుధలోననిద్రి-వర్గమగును॥ ౩౦౭॥

గీ. మానుషంబును దైవంబు-మండలంబు।
యాత్రదండవిధంబకృ-త్యంబుప్రకృతి।
సరణివింశతివర్గంబు-సంధివిగ్ర।
హములరీతులుషాడ్గుణ్య-మరయవలయు॥ ౩౦౮॥

గీ రాజుజుట్టాలచేయువ-రాజుచేతఁ।
బరులచేతనురాజులో-భంబుచేతఁ।
దస్కరులచేతవచ్చుదు-ర్దశలుప్రజకుఁ।
గాదెమానుషభయపంచ-కంబుమహిని॥ ౩౦౯॥

క. జలమువలనదుర్భిక్షము।
వలనహుతాశనునివలన-వ్యాధివలనఁజా।
వులవలనంబుట్టినభయ।
ములుదైవంబనగనైదు-భువిలోఁబరగున్॥ ౩౧౦॥

మ. పరమిత్రారిహితార్థులగ్రన్నృపటల్-పార్ష్ణిగ్రహాక్రందులి।
ద్ధరయుద్ధారికిఁబృష్ఠభూపతులుత-త్పార్శ్వస్థులాసారులి।
ర్వ్వరనేలున్ పయినుండిమధ్యముఁడుదా-రుండైయుదాసీనుఁడం।
దరదూరసితుఁడౌచునేలునిదియో-న్నన్మండలంబైతగన్ ॥౩౧౧॥

సీ. తొలుతపార్ష్ణిగ్రాహి-తోవైరిపైకేగు,
యానమెన్ననిగృహ్యయానమగును।
నృపుడుపార్ష్ణిగ్రాహి-కిష్టుఁడైజేసిఁ,
యానంబుసంధాన-యానమగును।
సామంతసహితుఁడై-శత్రులపైకేగు,
యానంబుసంభూయ-యానమగును।
శత్రునిపైకేగ-సమకట్టివేఱొక్క,
చోనేగుటయుపేక్ష-యానమగును।

గీ. అనికినొకవైరిమీఁదికి-నరుగవలయు।
ననిప్రసంగించివేఱొక్క-పనికిఁజనఁబ।
సంగయానంబగునుయాన-సరణులైదు।
సేనఁగూర్చుటదండవి-ధానమగును॥ ౩౧౨॥

చ. తనభటులందుశత్రువసు-ధాపతిలోభికిజీవితార్థమి।
య్యనియెడక్రుద్ధుఁడైకుపితు-డౌనెడమానినిమాటమించనా।
డినయెడనిర్భయున్భయప-టిష్ఠునిజేయునెడన్నృపాలుడా।
జనులనుభేదపెట్టితగు-సంపదలిచ్చుటకృత్యమెయ్యెడన్॥ ౩౧౩॥

గీ. రాష్ట్రధనమంత్రిదండదు-ర్గంబులైదు।
ప్రకృతియనఁదగుసంధికా-రణముభేద।
గతిసమాశ్రయములకువి-గ్రహముకార।
ణంబగునుయానమునకాస-నంబునగును॥ ౩౧౪॥

సీ. దుర్భిక్షభయపీడి-తుఁడుబలవ్యసనసం,
కులుఁడదేశస్థుఁడు-కుబ్జవృద్ధుఁ।

దతిలుబ్ధుఁడునలుబుఁ-డామయ సంయుతుం,
డింద్రియరతుఁడుబ-హిష్కృతుండు।
సాధ్వసజనకుండు-జ్ఞాతిభీతుఁడు దేవ,
విప్రహనిందకుఁడధ-ర్మప్రియుండు।
దైవోపహతకుండు-దైవచింతుఁడసా,
కారియును నానావి-చారయుతుఁడు।

గీ. వర్జితాంశుండు విరశతి-వర్గమనుచు।
నరధిజగడంబుయానమా-సనము భేద।
కుశలతసమాశ్రయంబుషాడ్గుణ్యమగును।
గాత్రిహ్యమాగాహ్యమెఱుఁగ నే-ర్పరులెన్న ఫులం॥ ౩౧౪॥

క. మంత్రిచతుష్కంబైనను।
మంత్రిత్రయమైననొప్పు-మాత్రంబునకా।
మంత్రులలోనొక్కొక్కని।
మంత్రము వేర్వేఱవినుస-మయములుగలుగన్॥ ౩౧౫॥

గీ. దానముసభోగమునునగు-ధనముసఫల।
మగ్నిహోత్రాదులను వేద-మగును సఫల।
మాలురతినుతసంప్రాప్తి-నగును సఫల।
మతులితాచారమునశ్రుతం-బగుసఫలము॥ ౩౧౬

చ. తహతహమానిసంతతము-దానసురక్తినితంద్రియుంబితా।
మహుఁడునొనర్చుసద్వ్రతస-మాజమొనర్చుచునీతిమంతుఁడై।
యిహపర సౌఖ్యదంబయిన-యీవచనంబులరీతిభూవిభుం।
డహరహముంజరింపఁదన-రారుఁదదీయయశంబునిత్యమై॥ ౩౧౭॥

చ. తనయునకానరేంద్రుఁడుచి-తంబుగనీగతిరాజనీతులె।
ల్లను దెలియంగఁజెప్పిహరు-లంగరులన్నిరులంబ్రధానులన్।
జనులను వేడ్కతోనొసఁగి-సాత్వికవృత్తిసభార్యుఁడైతపో।
వనమునకేగిమౌనిగణ-వర్ణితుఁడైవపియించెనయ్యెడన్॥ ౩౧౮॥

క. వినుతింపనీదిలీపా।
వనివరుచరితముఁజదివిన-వ్రాసినవినినఁ।
జనులకు నైహిక సౌఖ్యము।
లనవరతముగ లుగు మోక్ష-మర చేతిదగుఁ॥ ౩-౨౦॥

మ. అనిసూతుండిటుశౌనకాదిమునిము-ఖ్యశ్రేణికిన్ లీలందిలీ।
పనరాధీశమహాచరిత్రమునుసం-బంధంబుగాఁ దెల్పిన।
న్వినిస్వేచ్ఛంజనినైజవాసములత-ద్వృత్తాంతముల్ చెప్పుకొం।
చునుసౌఖ్యంబునమండిరుగ్రతపముల్-శోభిల్లవిజ్ఞానులై॥ ౩-౨౧॥

మ. హరివంశాంబుధిసోమసోమజితశౌ-ర్యప్రాభవస్తోమతో।
మరభీమారివిరామరామబలశుం-భచ్ఛైలసుత్రామతా।
మరసోద్యత్పదధామధామబలసం-పన్నాంబుదశ్యామసా।
మరశక్రస్తుతనామనామయవపు-ష్పన్మౌనిరాట్సన్నుతా॥ ౩-౨౨॥

శా. సీతాన్వితశ్రుతిప్రణీతముదితా-శేషాశ్రితవ్రాతజీ।
మూతాశ్వేతనుతేంద్రసూతవిశితా-మోఘాస్త్రసంఘాతఖ।
ద్యోతాతీతమహస్సమేతసరసం-ఘోపేతసామోక్తసం।
గీతప్రీతభవాభ్రవాతనతసు-గ్రీవాతపస్విస్తుతా॥ ౩-౨౩॥

క. శరగాంభీర్యతిరస్కృత। శరధీకరధీరతాప్ర-చలితోడుపశే।
ఖరకార్ముకభార్యాసో। దరవత్సలతాప్రహృష్ట-ధాత్రీజనవా॥

మాలిని. మనునృపకులదీపా-మర్త్యభావస్వరూపా।
దినకరనిభతేజా-దీనమందారభూజా।
కనకమణికలాపా-ఖండితోగ్రాక్షచాపా।
సనమయగుణసాంద్రా-జానకీరామచంద్రా॥ ౩-౨౪॥

గద్య—ఇది శ్రీజానకీరమణ చరణార్పిత మనశ్శతపత్ర హారితసగోత్ర
పవిత్ర కొటికలపూడి వేంకటరామపుత్త్రి విద్వద్విధేయ సరస
కవితాధేయ వేంకటకృష్ణనామధేయప్రణీతంబైన దిలీప
చరిత్రంబను మహాప్రబంధంబునందు సర్వం
బును జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

# మంజువాణీ పత్త్రికనుండి ముద్రించిన గ్రంథములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| 1. ఆంధ్రచంద్రాలోకము-అడిదము సూరకవివిరచితము ఉపోద్ఘాతసహితము... | 0 | 6 | 0 |
| 2. రాజవాహన విజయము—కాకమానిమూర్తి ప్రణీతము. టీకా తాత్పర్యసహితము. | 0 | 12 | 0 |
| 3. సర్వలక్షణ సారసంగ్రహము-కూచిమంచి తిమ్మకవి ప్రణీతము. .......... | 0 | 12 | 0 |
| 4. అప్పయ్యదీక్షిత చారిత్రము శ్రీరామమూర్తి | 0 | 4 | 0 |
| 5. తిమ్మరుసు చారిత్రము.. ప్రణీతము... | 0 | 4 | 0 |
| 6. శకటరేఫనిర్ణయము - భారతము లక్ష్మీపతి | 0 | 8 | 0 |
| 7. ఆంధ్రపరాశరస్మృతి-ఆదిపూడి ప్రభాకరకవి. విరచితము. .............. | 0 | 8 | 0 |
| 8. వ్యవసాయము. రాజాభుజంగరావు ప్రణీతము ..................... | 0 | 4 | 0 |
| 9. ధర్మజరాజసూయము—నేతి వేంకటసుబ్బరాయశాస్త్రిగారిచే రచియింపఁబడెను. . | 0 | 8 | 0 |
| 10. చమత్కారస్నేహ ప్రహసనము....... | 0 | 2 | 0 |
| 11. మహాయోగరహస్య ప్రహసనము ... | 0 | 2 | 0 |
| 12. విధవావివాహ ప్రహసనము.......... | 0 | 2 | 0 |
| 13. నిరపవాద ప్రహసనము .......... | 0 | 2 | 0 |
| 14. అపూర్వకవి పండిత ప్రహసనము ..... | 0 | 2 | 0 |
| 15. శిశుజీవ సంజీవని................ | 0 | 4 | 0 |
| 16. వాసవదత్త వచనము గంగాధరశాస్త్రికృతము. | 0 | 6 | 0 |
| 17. కాగడా బ్రహ్మయ్యగారు. [illegible]ము. | 0 | 1 | 0 |
| 18. దిలీపచరిత్రము ప్రౌఢప్రబంధము. వేంకటకృష్ణకవి.................. | 0 | 10 | 0 |
| 19. వైద్యుతలోహశాస్త్రము ప్రథమ భాగము డి. వి. శర్మగారు... ........ | 0 | 6 | 0 |
| 20. విక్టోరియా స్వర్గయాత్ర. రాజా భుజంగరావుగారు ............... | 0 | 1 | 0 |